# శ్రీ ధర్మవరపు సీతారామాంజనేయాభిధా !

## ఆశీః



నా పేరు శాశ్వతంబుగను నాల్గు కాలాల పాటొప్ప
దీపింపఁజేయవే యనిన, దీని నీ పేరఁ బెట్టెదన
యీ పుస్తకము నిల్వవచ్చు వృత్తవైశిష్ట్యంబు మహిమ,
నోపి యీ దైవభావనయు నొనరింప నూహింతువేని.

మనపేర నొక్క గ్రంథమ్ము మఱి యచ్చుపడె నన్న మాత్ర
మనసుబ్బ కననేల? దాని మహిమ ప్రాణముల జీర్ణించు
కొనవలెఁ గాక, నీ పేరు కూర్పించుకొనినంతఁ గాదు
మనసులో నీ దైవములను మసలించుకొన్మ, నావలెనె.

నీవుగా ధర్మవరంపు వేంకటసుబ్బయ్య కృష్ణ
వేణమ్మల కడుపునఁ బ్రభవించిన దానికి ఫలము
గా నాదు మధ్యాక్కఱలను గల గాఢభావన చేయ
గా నిచ్చు మాట, నీ పేరఁ గడఁగి పెట్టించుకొన్నావు.

ఎందుకో యభిమాన మిదియు నీరీతి నీపైన నాకు
పొందింప నంగీకరింతుఁబో, దీనిపైన నీపేరు,
నందించుకోఁ బ్రాణములను యత్నమ్ము సేయు మీదైవ
సందోహమును, జన్మ యిద్ది చరితార్థ మూనట్లు గాఁగ.

విశ్వనాథ సత్యనారాయణ.



ధర్మవరపు సీతారామాంజనేయులుగారు

కారంచేడు - గుంటూరు జిల్లా.

# విశ్వనాథ మధ్యాక్కఱలు
## శ్రీగిరి శతకము

శ్రీనీరధి నిషంగ, భక్తజనతతి శ్రేయోనుషంగ !
మానాథశరసంగ, ప్రౌఢ వృషభరాణ్మాద్యత్తురంగ !
క్ష్మానూతన శతాంగ! సంగతోష్ణీష సారాంబుభంగ !
శూలాభిషంగ ! శ్రీశైల మల్లికార్జున మహాలింగ      1

నాలోన శుష్కతృణంబు ముట్టించినావు దృగ్వహ్ని
నీలలోహిత ! దైన్యభావనామంజులోహిత ! నీవు
జ్వాల, తానదివేఱు, నిద్దివేరుగా నంతరించకువె
శూలాభిషంగ ! శ్రీశైల మల్లికార్జున మహాలింగ !      2

నాలోన నెంతగాఁ ద్రివ్వుకొన్నఁ బినాకి ! కన్పడవు
ఆలోకరమణీయ శారదాంభోధరాస్నిగ్ధమూర్తి
నీలోనఁ ద్రివ్వి నీలోఁతు తెలియగానేర, నిన్నెంచి
పాలిపోఁజాల ! శ్రీశైల మల్లికార్జున మహాలింగ ! 3

నాతల, సర్పమంజీర ! నీ పాద నాళీకమందుఁ
భ్రాఁతిగా నిచ్చలు, నడుము వంచుచు వ్రాల్చినయట్లు
చేతోఽంబుజాతంబునందు నాకు భాసించుచుండెడిని
జోతలు కాగ, శ్రీశైలమల్లికార్జున మహాలింగ ! 4

ఆ మానసికమైన మూర్తి, అట్లు నిరతంబుగాఁగ
స్వామి ! దీపించుచునుండి, కొంతలాభంబు కావచ్చు
ఈమేన శిలగాఁగ నచట నున్నచో నెల్లకాలంబు ?
సోమకిరీట ! శ్రీశైల మల్లికార్జున మహాలింగ ! 5

నా గుండె తీసి నీపాదమూలంబునం బెట్టుమనుము
మాఁగువారిన శ్రద్ధ మంత మసలిన మార్పేరఁబిలుము
ఊగులాడితినేని వందజన్మ లిటాగ్గకు ! నీదు
జోగిని నేను ! శ్రీశైల మల్లికార్జున మహాలింగ ! 6

నేనెంత ! నాబ్రతుకెంత ! సృష్టిలో నిజము నావంటి
మానవుల్ మూఁడుకాలములఁ బుట్టుచు మడియుచున్నారు
కానగా సర్వదేశములయందు, జగంబొక పెద్ద
సూనాపణంబు శ్రీశైల మల్లికార్జున మహాలింగ ! 7

కోరి, కబేలాకు, మందగాఁ దోలికొనిపోవుచుండ
దారిప్రక్కనయున్న పచ్చి గడ్డిపైఁ దారాడుపసుల
తీరుగానున్నది జనుల భోగాశ ! తెలివి సర్వమ్ము
చూఱవుచ్చెదవు, శ్రీశైల మల్లికార్జున మహాలింగ ! 8

మానసంబింతయుఁ గొల్లవోయి నీ మహనీయమూర్తి
లోని వెల్గు, పిసరుతోఁచనీనంత లోఁకువై పోతి
పీనినిఁ బెట్టెడుబాధ వేనినిఁ బెట్టవు నీవు
సూనాస్త్రవైరి ! శ్రీశైల మల్లికార్జున మహాలింగ ! 9

ఒకతెల్లగా వత్తువో యటంచు నే నొగి నిశీథముల
ముకుళించుకొన్న నెన్నుదురు నడుమ నీమూర్తికై వేతు
నకట ! తానరుదెంచు నంధకుఁడు, వాని హరియింపనంత
సుకరంబుగాదు శ్రీశైలమల్లికార్జున మహాలింగ ! 10

తనివితీరగ నిన్ను రెండుచేతులఁ దాఁకగావచ్చుఁ
గనులఁద్రావఁగవచ్చు నిన్నుఁగౌగింటఁ గ్రుచ్చుకోవచ్చు
నునికినున్నట్లుగా వచ్చి మఱి లేకయును గొల్వవచ్చు
న్నునిశితబుద్ధి శ్రీశైల మల్లికార్జున మహాలింగ! 11

అప్రాప్తి నింద్రియంబులు వడిగ నింద్రియార్థంబులందు
నా ప్రయత్నము లేక సాగుచున్న వాగ్నాయియా ప్రియాత్మ
నా ప్రార్థనఫలంబులగుత సన్న్యాసు నాశంబు నీదు
సుప్రసన్నతయు శ్రీశైల మల్లికార్జున మహాలింగ! 12

ఇప్పటి నాస్థితిమాడ నెడఁదలోఁ గోర్కులేమియు వెలికిఁ
గుప్పించి దూఁకెడు జాడలేద మేన్కొన బర్వాగాఁగ
నప్ప! యూహాకు నందకుండఁ దెలియదయా జీవుఁడేమి
చొప్పగలాడో శ్రీశైల మల్లికార్జున మహాలింగ! 13

ఇది తపోయోగ్యమా తనువు నాచేత నెత్తించలేదు
ఇది భోగయోగ్యమా తనువు నాచేత నెత్రించలేదు
మది భోగవాంఛ కన్పడదు వేఱుజన్మ తపఃక్షమమును
గొడమాఱియావె శ్రీశైల మల్లికార్జున మహాలింగ! 14

వేదాంతములలోని వేదములలోని విమలార్థచయము
వాదించు నాకైత, వానిశత్రువై వరలునీజగ మ
నాదిబంధుఁడ వీవునిద్దఱుంగూడ నన్ను వేర్పరుపఁ
బ్రోది నాకెచట శ్రీశైల మల్లికార్జున మహాలింగ! 15

ఆవిల జాగ్రదవస్థయందు స్వప్నావస్థయందు
జీవుని యనుభవభేద మింతగాఁ జెందియునొకఁడె
జీవాత్మ పరమాత్మయన్లై భేదమ్ము చెందియునొకఁడె
ప్రోవైన తెల్విఁ శ్రీశైల మల్లికార్జున మహాలింగ! 16

అది యుత్తమము నీవు మధ్యమమును నేనధమమ్ము స్వామి
మదిఁ జిత్రమయ్యె నీ మధ్యమత యుత్తమత వంటిదయ్యె
నదిర నాయధమత నీదు మధ్యమతాంశ లేదాయె
సొదవేడు వినును శ్రీశైల మల్లికార్జున మహాలింగ ! 17

కనుమూసినంత నీగర్భగుడిలోన కన్పించుచుంటిఁ
గనఁగ నేనేనాఁడు నింద్రిలీల లింగంబు ముంగలను
తనువువంచి శిరంబు పానవట్టంబు దగ్గరఁజేర్చి
మునిరతమూర్తి శ్రీశైల మల్లికార్జున మహాలింగ ! 18

ఆట వ్రాలియున్నట్టు లభవ యూహించినప్పుడే నా సు
ఘటన నిత్యమ్ముగా నున్న దామాయ కొమ్మి నేనెఱుంగ
నట్టులైన నీనిత్య సన్నిధాన స్థైర్యము వహించెదను
స్ఫుటముసేయఁగదె శ్రీశైల మల్లికార్జున మహాలింగ! 19

అటు వ్రాలియున్న నా వీపుపై నెంత రభవత్రొక్కెదరొ
త్రుటినైన నొకబాధ కలిగినట్లుగాఁదోచదు నాకు
నిటలాక్ష నీసన్నిధియును నీసేవ నెరయువేఁడి తఱి
చుట తోఁచనీదా శ్రీశైల మల్లికార్జున మహాలింగ! 20

త్రొక్కుళ్ళు నెక్కుళ్ళు మఱి దిగుళ్ళు నీధూళి దర్శన మ
దొక్కసారిగ శ్రమయంతయుం జోవునోయి మహేశ
మ్రొక్కిపోవుచు నెండ నడచి పెనుమర్రి సులభ శీతలతఁ
జొక్కుదునట్లు శ్రీశైల మల్లికార్జున మహాలింగ! 21

అనుభవ పరమార్థ హీనభావమ్ములవి యెల్లఁగూర్చి
తనర వారును వారు చెప్పినట్టి శబ్దమ్ములర్థముల
నిను నేనుబొగడ నీ పెదవిపై నవ్వునెరసు చూపవును
మునిభృతహాస శ్రీశైల మల్లికార్జున మహాలింగ! 22

నాగుండె పెకలించుకొంచు నా ప్రాణనాళముల్ చీల్చు
వాగర్థములతోడ నిన్నుఁబిలువ నీ పరమ విశ్వలత
లో నీజగా నన్నుతరగవలె నీలలోహిత కదలు
నేగ కన్పడునె శ్రీశైల మల్లికార్జున మహాలింగ! 23

స్వామి వాలోనేను గుబ్బిసాడి భావము లుబ్బనలయు
నీమేలి కదలిక లేని క్రొవ్వెల్లు నీరధిలోన
నేమేమొ తరగలు లేవవలయునా యిది నేనుగాగ
సోమించవలయు శ్రీశైల మల్లికార్జున మహాలింగ! 24

సర్వతర్కంబులు సర్వశాస్త్రముల్ సంసారమిద్ది
శర్వ! యనాదిగాఁ జెప్పు మఱియును సాంతంబుగాఁగ
పర్వము పొసగింపు నాకు దానితోఁ బనియేమిలే యా
జుర్వేద వినుత శ్రీశైల మల్లికార్జున మహాలింగ! 25

తొలివెలుంగా నీవు నన్నురక్షింపఁ దూఁగుచున్నావు
కెలనఁ జేరనయట్టి కొన్ని గ్రహములు కిట్టలువెట్టుఁ
దలచిన యుపకృతి భావముననుండి తగ్గిపోవకువె
సులభఘృణాక! శ్రీశైల మల్లికార్జున మహాలింగ! 26

అంత దక్షిణమ్ముగాఁ గ్రిమ్మియున్న యీయంధకాసురుఁడు
కొంతగా వచ్చలప్పటికి సిరఃపాలకోటి ఘాతములఁ
గ్రింతలు చూచ్చైన మేనఁగన్పించుఁ గన్పించకుండ
నుంత, మర్రించెంచు శ్రీశైల మల్లికార్జున మహాలింగ! 27

మనసులోపలఁ దర్శించి నిన్ను వెలిఁజేయు మాదిరి కాక
తనగుండెలోనుండి నీవ్రగా మనోదర్పణంబునను
గనుపించు నేరుపు కలుగునట్లుగాఁ గలిపింపవే క
రుణా కాల్పకట్టి శ్రీశైల మల్లికార్జున మహాలింగ! 28

జ్ఞానాగ్ని దగ్ధ కర్మ్ములని కొంత యూశాద్యోతకముగఁ
బూని చెప్పెదకాని యీశ! ప్రారబ్ధముల్ పీడ వెపుడు
లేనవే దాగామి సంచితంబు కాలినబొగ్గు, పరమ
సూనృత తేజ! శ్రీశైల మల్లికార్జున మహాలింగ! 29

నియమంబు లవి వేనియుందు నాబుద్ధి నీమీద నిలచి
భ్రమియింపకుండునో యివ్వి చాల స్వల్పపు సంఖ్యకలవి
తమముతెక్కినయవి యివ్వి వెలుఁగన్న ధైర్యముకాక
సుమనస్స్వరూప! శ్రీశైలమల్లికార్జున మహాలింగ! 30

అలసి క్షీవరుఁడైనవాఁడు మరిదేనినైన గ్రహించు
తలఁపుతో వల వేయు నీవువేసిన దయలేని మాయ
వల దేవికనివేసినట్లు జీవులు వణఁకిపోవుటకు
సొలసిపోవుటకు శ్రీశైలమల్లికార్జున మహాలింగ ! 31

కేవల యోగ్యాదిసరదనుపలబ్ధి కృతవాదసరణి
లేవని యున్నావటంచుఁ జిఱుధూళి లేపుట యది, య
భావమ్ము చెప్పుటకాదు కృఛ్రిలభ్యత వచించెడు య
శోవేద్యమాన శ్రీశైల మల్లి కార్జున మహాలింగ ! 32

సూరిమనోవేద్య పడగ పగ పాము చుట్టుమన్నట్లు
తూఱి నిన్ నీవు లేవనుచుఁ దెగఁజెప్పుదురు నిన్నుఁగొలుచు
వారిఁబ్రహ్లాద ముఖ్యులను బిట్టుసంభావింతురేమి
చోరలక్షణము శ్రీశైల మల్లి కార్జున మహాలింగ ! 33

విడతలు విడతలుగాగ భావనావేశంబు తెత్తు
వడియున్నయప్పుడు గుండెలోపలఁబట్టి పాలార్తు
విడిపోయినప్పుడు దీనుఁడై యెంత పిలచినరావు
నుడియాడినట్లు శ్రీశైల మల్లికార్జున మహాలింగ! 34

ఒంది మోదము చెప్పినట్టివా ర్చెప్పకుండఁ జెప్పెదరు
చెంది చిదంబర క్షేత్రిలో నీవుచేసినానంద
కంపలాస్యమ్ము సత్పదనవార్థాభిఘటనంబు పరమ
సుందరమూర్తి శ్రీశైల మల్లికార్జున మహాలింగ! 35

మాటలకొత్త యేమున్నదో స్వామి మరి నా యెడంద
గాటంపు బాధయే యిచ్చటం గొత్తగాని తానింత
పాటిబాధయు కొత్తగాదునా, నీ కృపాదృష్టి కొత్త
చోట నాయందు శ్రీశైల మల్లికార్జున మహాలింగ! 36

ఊరకయుండినవానిఁ గొనిపోవు టాక సంతలోనఁ
గూరుచుండఁగఁ బెట్టుటే పదార్థంబు కోరరాదనుట
కోరినచోఁ దలకొటువికొని తెచ్చికొన్నట్టి యేమి
సూరత్వముద్ది శ్రీశైల మల్లికార్జున మహాలింగ! 37

ఈవె పోయితి సంత చూతమనుచు నాదేమున్నదనెదొ
యీవు వచ్చితివల్లె వచ్చినావు నాయీ పెత్తనంబు
కైవనంబును జేసికొంటి వందుచేఁ గైమోడ్తు నీకుఁ
దోవచూపుమని శ్రీశైల మల్లికార్జున మహాలింగ! 38

ప్రతిదినంబును సూర్యుఁ డస్తగిరిపైనఁ బవ్వళించెడిని
బ్రతుకులో నేదియో పెద్ద బరువైన వగిది భాసించు
శితికంఠ నా గుండెమీఁద నృత్యమ్ము చేయుదో యేమొ
చ్యుతసంధికముగ శ్రీశైల మల్లికార్జున మహాలింగ! 39

స్నానంబుచేయుచుఁ దుడుచుకొంచును జపముసేయుచును
ప్రాణాలు తేలిపో నీవు కనిపించు భాగ్యమున్నదియె
యీ నాకటంచు నేనెంతగాఁ దపియింతు నీవెఱుఁగు
జో నాకుఁజాలు శ్రీశైల మల్లికార్జున మహాలింగ! 40

ఒకచోటఁ గూర్చుండి నిన్ను నూహింతునో యన్న నన్ను
నొకచోటఁ గూర్చుండనీరు కవినైన యొక దోష మొప్పి
యొకచోటఁ గూర్చుండ నీదు సంసారమో స్వామి పూర్వ
సుకృతంబులేదు శ్రీశైల మల్లికార్జున మహాలింగ! 41

ఈమేనిత్రాసుతోఁ దూచుచున్నానయీవైపు మొగ్గు
స్వామి క్రమమ్ముగాఁ దగ్గిపోయె భవద్దిశకొగ్గి
యీమేను కాకిక బరువు లేదాయె నీవె తూగెదవు
సోమకిరీట ! శ్రీశైల మల్లికార్జున మహాలింగ! 42

మున్ను లింగాకారమైనది కన్నులు మూసినయంతఁ
గన్నుం బొమలమధ్య జ్యోతిమూఁడదెఁ గానిపించెడిది
యున్న తెలిపిపోయెఁ జదువ వేయగా నొగి నన్నయట్లు
సున్నమైనావు శ్రీశైల మల్లికార్జున మహాలింగ! 43

అచ్చపుచందనములోఁ గరుణ దిగజారెదన్న నీమాట
తెచ్చిన గుండెకుఁ గరగి కన్నీరు దిగఁజారు నింత
వచ్చినమైన మిగుల్చు వాటి యున్నావు బ్రిదుకులోపలకుఁ
జొచ్చినావు శ్రీశైల మల్లికార్జున మహాలింగ! 44

గప్పుసెనపడిన నీమూర్తి కసక, నాకల కేడ్చి యేడ్చి
తప్పటికేడ్చినయట్లుగాఁగఁ జివరకుఁ దమరి నూహించి
యపియు గుండియమైన లేనియట్లుగా నగుదునో యంచు
సువిపాటయయ్యె శ్రీశైల మల్లికార్జున మహాలింగ! 45

నీ వచ్చుచెచ్చుటో నాదు శిరసుపై నెగడుచుంటివని
యావేగపడుకొంచు నాదు మేనిలో నాడు నెత్తురులు
నో విశ్వనాథ తా మెదూరు ప్రవహించుచున్నవి పైకిఁ
గ్రోవి చిమ్ముగతి శ్రీశైల మల్లికార్జున మహాలింగ! 46

మరియు వైరాగ్యంబు మరియు దేహాభిమానంబు మరియు
మరియు వైరాగ్యంబు మరియు మరియు నిన్ మరుగు
చొచ్చుటయు
విరిసిపోదునో యన్న భీతి నీవు నన్ విడఁద్రొక్కుదనియు
సురిగిపోయెదను శ్రీశైల మల్లికార్జున మహాలింగ ! 47

ఒకటి నిశ్చయమయ్యె బయట నెచ్చటనుంకియో నీవు
ప్రకట శైవానేక కథలలోని రూపాలతో రావు
ప్రకట మత్కాలంబు ఘట్టుమంచును బగిలి రావలయు
సుఖమొ దుఃఖమ్మొ శ్రీశైల మల్లికార్జున మహాలింగ! 48

మేలుకొన్నప్పుడు పట్టుకొంచుంటి మెదలకుండంగ
నీలలోహిత మేలుకొనెడి కోరికల్ నిద్రించుచుండ
పాలించవే నాకు నిద్రలేకుండ భసితరమ్యాంగ
శూలాభిషంగ శ్రీశైల మల్లికార్జున మహాలింగ 49

కలితకపాల హారా! మహాభావ్యాకార మంజీర !
దళితాఘసంతాన! పరిణతస్విన్న దర్పాంధకార !
మిళితాంధకార వైరిఘటితోష్ణీష మాలన్మనోజ్ఞ
సులలితాకార శ్రీశైల మల్లికార్జున మహాలింగ ! 50

ఈ మేను కర్పూరమట్లు హరియింప నీకువే నీకు
స్వామి నీరాజనం బెత్తినట్లుగా జ్వలియింపనీవె
కోమల పరిమళవ్యాప్త దశదిశా కుహరంబుగాఁగ
కామాంగభంగ శ్రీశైల మల్లికార్జున మహాలింగ! 51

నినుఁజూడకుండఁగా మాటనేర్చుచే నినుఁజూచినట్లె
నినుచు పూర్వకవీంద్ర వాక్యసరణి వర్ణించుటయెల్ల
నను నేన మోసంబుచేసికొనుటకోనాగఁ నాగాహి
మనిభృతబంధ శ్రీశైలమల్లికార్జున మహాలింగ! 52

నిదురయెఱుంగని నీవు నాలోన నిదురపోయెదవు
కుదిలించి గగ్గోలుచేసినను మేలుకోవు నిజంబు
నిదురైన మేల్కొల్పవచ్చు నీ దొంగనిద్దుర కేమి
రొదచేసి ఫలము శ్రీశైలమల్లికార్జున మహాలింగ! 53

ఎడఁద నాయది దూదిపరుపా కదలక యింతసుఖంపుఁ
బడక యేర్పడ్డది నీకు, నాయెదఁ బన్నినమాయ
యుడియించదుగదయ్య నిన్నుగూడ, నా యీ దోస మింత
సుడియించు నన్న శ్రీశైలమల్లికార్జున మహాలింగ! 54

నినుగుండెతో రాచి నొవ్వకనకుండ నీమీఁద వట్టి
కునుకుమాట లిఖింపనంచు మతిచేసికొంటి, నీలోన
ననుచుకొందువు నిన్నునీవ, గుండెలోనన్ ఆపుపొందు
చును ఆపుకనవు శ్రీశైల మల్లికార్జున మహాలింగ! 55

ననువుకాడవు నిశానిద్ర యెరుగవు నావలె నీవు
కనిపించినప్పుడు నీవు రాలేదుగద యన్న, నేను
చనుదెంచితిని నిద్రపోవుచుంటివం చనవచ్చు, తోలచు
చునె యేమియనరు శ్రీశైల మల్లికార్జున మహాలింగ! 56

నాయూహ నా గుండెలోని కదలిక నా బ్రదుకెల్ల
పాయని యీ మేనిమీఁద నాధారపడియుండె నభవ
నా యీ తనువుచేసినావు రాయిగ నను జారతేవు
నూయాణముగను శ్రీశైల మల్లికార్జున మహాలింగ! 57

అరయ నాభావనాశక్తి కవధిలేదాయె మిక్కిలిగఁ
బెరిగిన విఱుగుట యరుదె యేదైన వృషభరాడ్వాహ
పరమహా నీదు నిశ్చల మహాస్పర్శ భావనాశక్తి
మురుగఁజేయఁగదె శ్రీశైల మల్లికార్జున మహాలింగ! 58

పెరిగి బుద్ధులు నేర్చికొను జగము తమ పెద్దలవలన
పెరిగినతరువాత నాప్తవాక్యము విషమయిపోయె
నరయ నీయున్కికి నెల్ల నాప్తవాక్యము ప్రమాణమ్ము
సురలోకవంద్య శ్రీశైల మల్లికార్జున మహాలింగ ! 59

ఎండిన మతికిఁ బ్రమాణశతశత మెక్కదు నీకుఁ
బండినమతి కాప్తవాక్య మొక్కటి పరమప్రమాణ
మెందు వచ్చిమనస్సు లెంతవాదించు నిల దండితోగ్ర
శుండాలదైత్య శ్రీశైల మల్లికార్జున మహాలింగ! 60

కలసివచ్చినవాఁడు జగము పౌరుషకలనమం చాడు
కలసిరానియతండు లోకమిది దైవఘటనయం చాడు
తెలివి వేయువిధాలు, తెల్చివేయుట తేలిక నిన్ను
సులభమార్గమ్ము శ్రీశైల మల్లికార్జున మహాలింగ! 61

ఏది యొట్లైననేమి మరి నే మార్చుటింతయు లేదు
నీదయ యనుకొంట లోఁదప్పేమొ నే నెఱుంగ నినుఁ
గాదని పొడిచివేసినది యేమి యాఘటకుండు తుదకు
పోడెలో రాదు శ్రీశైల మల్లికార్జున మహాలింగ! 62

తనలోనఁ దన్నుఁదాఁ జూచికోఁబోక తనకంటె నితర
మునయందుఁ దన్నుఁదాఁ జూచికొన్నట్లు మురిసి తానదియా
యనినట్లుగ స్వయంప్రతారణము సేఁత యలవాటువడి పి
శునజాతి యాడు శ్రీశైల మల్లికార్జున మహాలింగ ! 63

ఎవరిదాఁకనో యేలనయ్యా నీమీఁద నెద నిల్పలేక
యవ్వర వారును వీరు నిట్టివారును నట్టివారంచు
తవులు మానినగుండెతోడ శివ! పెడదారిఁ బట్టెదను
సువిచారమూల! శ్రీశైల మల్లికార్జున మహాలింగ! 64

ప్రియతమ తేజ నా గుండె నీనుండి వెసక నీయకు వె
దయమాలి తనుకోను వెసకిపోయిన దండింపుమయ్యా
యయయొ నీదండనమద్ది క్రొత్తయా యల్పమా భావ
సుయమ గూఢాకార శ్రీశైల మల్లికార్జున మహాలింగ! 65

అటు సుఖావధివౌచు నీవు, దుఃఖానికవధివై నేను
ఘటియించు దుఃఖంబు చివరజ్యోతివై కన్బొమల్ నడుమ
మొటకరించుచునుంటి గుండె యటమటింపులయుఁ గన్నీటి
జొటజొటమూర్తి! శ్రీశైల మల్లికార్జున మహాలింగ! 66

నిరతిశయంబు సుఃఖంబు సాధనానియతి నేర్పఱచి
నిరతిశయంబు సౌఖ్యంబు నీమూర్తి నిభృతంబు సేస్తు
పరమ కాఠిన్యమో పరమదయయో స్వభావంబు నీది
సురుచిరమహాస ! శ్రీశైల మల్లికార్జున మహాలింగ! 67

కదలక మెదలక యంత నిశ్శబ్దఘటనగా నుందు
మదిలోన నెంచినమాత్రిలో సర్వమహిమ భాసించి
మెద దూసికొనిపోదు దూసినమ్ము నాహిత్యమ్ము కలవు
రొదలేనియమ్ము శ్రీశైలమల్లికారున మహాలింగ! 68

క్షితిలోనఁ బ్రత్యర్థితోడ యుద్ధమ్ము చేసెద రభవ!
శితికంఠ! భక్తులతోడ యుద్ధమ్ము సేసెద వీవు
అతిదయాక్షీరాంబునిధివి పిల్లలమని గుండె మాకు
తుష్టిచేసికొంటి శ్రీశైలమల్లికార్జున మహాలింగ ! 69

అనుభవ పారమ్యమందినపుడు బ్రహ్మానందపరిధి
వని చెప్పచుందురుగాని యవునుగా దది యుమాజాని
మనసులోనఁ దలంచుమాత్రి మధుపరీమళరేఖ మెడఁదఁ
జొనిపినట్టులగు శ్రీశైలమల్లికార్జున మహాలింగ ! 70

ఇలసుఖార్థులు గడ్డితించు కుధనులై యొకదొట్టుకేలో
తలపులోపల నీవు నువ్వుగింజంత తారాడ నొడలు
పులకరించెడు గుండె పరమ నిర్వాణముంబొందు నింత
సులభసౌఖ్యమవు శ్రీశైల మల్లికార్జున మహాలింగ ! 71

లౌకికంబయినట్టి సౌఖ్యలేశంబు లభియించు వ్యసని
తాకారణంబుగా వ్యసనభావంబు తమరిపై మలచఁ
దేఁకువ సౌఖ్యంబు తెచ్చి నిలువుగా దెల నింపవచ్చు
శోకాపనోద! శ్రీశైల మల్లికార్జున మహాలింగ ! 72

నిన్నుఁగూర్చిన యూహ కాగడావోలె నిలచి కాలెడిని
మున్ను సమృద్ధిగా నాముదంబును బోసితివేమొ
నన్నుతావిచ్ఛన్న తైలధారానుసాంతత్య మొప్ప
చున్నట్టులుండె శ్రీశైల మల్లికార్జున మహాలింగ ! 73

అన్నియుం జక్కఁగా జరుగుచున్నప్పు డభవ! యా మృత్యు
వన్నది సహజమైనట్లు దాని భయంబు లేనట్టు
లున్నది, యది వచ్చినప్పు డీరీతినుండఁగాఁజేయు
మున్నితంబుగను శ్రీశైల మల్లికార్జున మహాలింగ! 74

నీవు లింగాకార మూరుచే ధారుణికి నీ యథార్థ
భావంబు వ్యాఖ్యాన పరచునట్టులు పరమ పూర్ణతయు
నానలఁ గోలగా జ్యోతివగుట నిరాకార పరిధి
నూనె నీవగుట శ్రీశైల మల్లికార్జున మహాలింగ! 75

నను నే విచారించుకొనిన నవ్వగా నాకెయున్నయది
నిను సమభ్యర్చించు పద్ధతి, సుకృతి నీరేజ మధువ!
ధుని సముద్రినిఁ గోరవచ్చుఁ బెనుకొండ తూగుచేలో వ
రుణా దేవుగూర్చి శ్రీశైల మల్లికార్జున మహాలింగ! 76

నాబిడ్డ యీకైత, పాప మిదికూడ నగజాత, స్వామి!
జాబాలిమైత్రావరుణి మొదల్ ఋషుల్ సంబంధమాడ
రాఁబోరు నా మాటమీఁద దీనిని గ్రహింపు మిదియె
సోబానకూడ శ్రీశైల మల్లికార్జున మహాలింగ! 77

వియదాదిక బృహత్తనూ! శివా! పట్టువిడుపులు గల్గు
దయయేమి దయాభవా! సతత సురవారిధారాభిషేక
మయమైనఁగాక యీ కరుణ యేరీతి మన్నింతు నభవ
నువమా కాదయ్యె శ్రీశైల మల్లికార్జున మహాలింగ! 78

ఆలోల కల్లోలితామ్మ(?)యాకృతి యా రెండునాళ్ళు
సీలలోహిత తీసిపోయెను గదయ్యా నీ దయాతటిని
సీలమండలలోతు లేదు ముంచఁ దడిపొడి చేయదు సామి
శూలమ్ము చివర శ్రీశైల మల్లికార్జున మహాలింగ! 79

తుదిదాఁకఁ దోడవు వాని వోలికఁ దూగి వచ్చితివి
పదిశారలేగిన యంతలోఁ జప్పఁబడిపోయి తభవ
ముదిసిన నాకంటెఁగూడ మిక్కిలి ముదిసినయట్లు
చూదుగుమాలితివి శ్రీశైల మల్లికార్జున మహాలింగ! 80

నీవు నా మనసులోనుండి యెపుడు కంతేకాల! తొలఁగి
పోవను నొక తృప్తివిడచి నీవల్ల పొందినదేమి
పావనంబైన నీవెల్గు చూపించు పాపానఁబోవు
నూవె యంచన శ్రీశైలమల్లికార్జున మహాలింగ! 81

రెండుభావాలొకేసారి యుండనిరీతిగాఁ దర్క
పండితుల్ చెప్పగురేమి చెప్పట పరమ మహేశ
గండిలో నొడియు నిచ్చోట, గుండమై కదలవిం దమర
తుండాలమూర్తి శ్రీశైల మల్లికార్జున మహాలింగ! 82

కాలువగా జాలువారి యింతలో గడ్డకట్టెదవు
నాలోన బొనుగార్చుచుంటి యగ్గికణంబు నేరుపుగ
కాలాంతకున కైనవాడు నొక్కఁడే కానివాఁ డొకడె
సోలింపజేయ శ్రీశైల మల్లికార్జున మహాలింగ! 83

చిత్రము లాగుచున్న యవి యెఱ్ఱని చేరులై వ్రేలు
గుత్తులుగుత్తులై ప్రిదిలుకొన్నవి గుండియలెల్ల
బత్తులవో వేల్పుచెట్టు! నీ మెడ పట్టుకోనీవె
సొత్తేమిపోదు శ్రీశైల మల్లికార్జున మహాలింగ! 84

ఓసామి! నీవునా గుండెలోపల నుంటివా పెద్ద
లా సాము లన్నారటంచు నిది భ్రాంతియా నాకు నభవ
మూసరమ్ముగ నింతపైకిఁ బొక్కవా! మసలిన నచట
నూసరివాడు శ్రీశైల మల్లికార్జున మహాలింగ! 85

ఒకటి యదార్థమా నంబికాజాని! యుర్వి నెందేని
నెకదొట్టి యుండె నీ తత్వ మయ్యాది యెంతైనఁగాని
కొకిలికి యీ ధరాతత్వముం ద్రిప్పుకొలఁదిఁ గన్పడెడు
నుకమందునట్లు శ్రీశైలమల్లికార్జున మహాలింగ! 86

ఎదలోని సాధకు భావనాదీప్తి కెల్ల విరామ
మొదవిన యెచ్చోటనో నిరాకార మూని యుందువని
మదినమ్మఁజాల నిక భావతీవ్రత మదిలోని నొవ్వు
సాద నీవుఁ తోప శ్రీశైల మల్లికార్జున మహాలింగ! 87

ఇది కాదటంచు నాబ్రతుకు నేను యథేచ్ఛంబుగాగ
బ్రతుకుచు మరి మధ్యమధ్య నీవు కన్పడవంచుఁ దెనుగు
పదములు వ్రాయుచు నాటకంబుగా భావింతువేమొ
మదతీ కృతార్థ! శ్రీశైల మల్లికార్జున మహాలింగ! 88

నాసమ్మక మ్మిది స్వామినాథ! నాదు జన్మాదులచేతఁ
బూని తా నియమితమయ్యె వాసుకిభోగి కేయూర!
దీనిచేనిన్ను భావింతు నైరమ్మదీయమా సరసి
సోనవుగాఁగ శ్రీశైల మల్లికార్జున మహాలింగ! 89

నీలలోహిత! పొద్దుక్రుంకినంతనే నీవా వెనుకను
వ్రాలి వత్తువని యెరుంగుదున యమ్మవారి వానగలు
వ్రాలు చందురురేక తుక్రిగుచువుల బావిలీల్ పాప
సూలచేకట్లు శ్రీశైల మల్లికార్జున మహాలింగ! 90

ఒనర్తె నయంతలో నా మన స్సూరియూరియున్నయది
వనితాధనోహాతే యుప్పకారమావయు నూనె యనగ
తనర బండను వేసిరాచినంబోదు దానిలక్షణము
సాన కావిచెడదు శ్రీశైలమల్లికార్జున మహాలింగ ! 91

పిచ్చి తాఁకుదిరినఁగాని యోస్వామి పెండిలికాదు
పిచ్చి తాఁగుడురదు ప్రాణనాయక ! పెండ్లైనఁగాని
హెచ్చి నిన్నూహింతు మనసుచేతనే యిది చావ దీవు
చొచ్చినఁగాని శ్రీశైలమల్లికార్జున మహాలింగ ! 92

చెట్ట యీ మనసున కయ్యో సిగ్గువచ్చియు సిగ్గురాదు
పట్టినచోటనే పాముకరచియుఁ బట్టు నచ్చోటె
చుట్టుపెట్టిహారింపు దీనిని మరుగు జొచ్చితి నాత్మ
చుట్టమవంచు శ్రీశైల మల్లికార్జున మహాలింగ ! 93

ప్రళయంబు లెన్నైనఁ గడచుదాకఁ మార్కండేయునట్లు
ఇలమీఁద నుంచుమంచంటినా జన్మలింకేమి నాకు
వలదంటినా నాదుతలపులో నీవు వచ్చి నిల్మంటి
చులుక చేసితినా శ్రీశైలమల్లికార్జున మహాలింగ ! 94

అనుభవ స్మృతిఁగాక పెద్ద సుఖము లే దనుభవవేళ
ననుభవ వేళయందు సుఖమన్నచో నదియు భావనయ
జనితభావన కింత హేయ మల్పమహా పరికర మేలో
జానికినాపివు శ్రీశైలమల్లికార్జున మహాలింగ ! 95

నమ్మితి నుపనిషదర్థముల్ నిన్ను నమ్మితి నిన్ను
నిమ్మెయి నమ్మనో నీవుచేసెడి దేమియు లేదు
నమ్మినప్పుడు చేయవలదురయ్య యీ నాకు నిమ్మనెనె
సొమ్ములు నీవి శ్రీశైల మల్లికార్జున మహాలింగ! 66

ఏవేళ నినుఁజూచినానో యావేళ నీ గుండెకాయ
కాపువేసితి రంగుమారె వృంతమ్ముకడఁ జుక్కపొడిచె
సేవింపఁగా నీవు నెంచవేలో వచ్చి మరిందు కలిమి
సూవె మిక్కిలిగ శ్రీశైల మల్లికార్జున మహాలింగ! 97

ఒకవేళ నే నెఱుంగకయ సేవించుచుంటి వేమో యు
యకదంబ! సేవించనట్లుగ నభినయంబు సేయుచును
ముకుపుటంబునఁ బెట్టి యాఘ్రాణనుం జేయుదే మొ
నుకుమారమూర్తి ! శ్రీశైల మల్లికార్జున మహాలింగ! 98

నీ వంతరాత్మలో నిలచి వెలికిని నిగుడుయత్నంబు
జేవి శారదగ భాసించె నాదేవి దేవ! భవత్కృ
పావృష్టిఁ దగు నాదు జిహ్వా తుదఁ బైకిఁ బ్రాఁకిన వచట
నూావె నీయున్కి శ్రీశైల మల్లికార్జున మహాలింగ! 99

వరగ నా శారదాదేవి నీనుండి బయలుదేరినది
సరసిజభవురాణి యొక్క ధారఁ, నాసన్నిధిఁ బ్రాఁకె
హార! నన్ను నా ధార వెంట నీవద్ద కరుదేరనీవె
సురనదీచూడ! శ్రీశైల మల్లికార్జున మహాలింగ! 100

శ్రీ నీరధి నిషంగ, భక్తజనతతి శ్రేయోఽనుషంగ!
మానాథశరసంగ, ప్రౌఢ వృషభరా ణ్మద్యత్తురంగ!
త్స్నానూతన శశాంగ! సంగతోక్షీణ సారాంబుభంగ!
శూలాభిషంగ! శ్రీశైల మల్లికార్జున మహాలింగ! 101

# విశ్వనాథ మధ్యాక్కఱలు
# శ్రీ కాళహస్తి శతకము

ఆజానుబాహువా! అపరిధృష్య! హృదంతరాపూర్ణ
రాజిత భక్తి వశంవదా! సుశరస్త్రాపకృతర
మాజాని! స్వర్ణముఖీతటీగేహా! మాంజిష్ఠవర్ణ!
రాజిలభూష! శ్రీ కాళహస్తీశ్వరా! మహాదేవ! 1

తొలినాడు కలకండ పలుకులంబోని, ధూర్జటి సుకవి
పలుకులంబోని దాహమ్ము, చూచెదు వర కాగ గాని
యలసనై నిను వచ్చి చూచి యప్పటికారియు మరల
వలసట యగుచు శ్రీ కాళహస్తీశ్వరా! మహాదేవ! 2

తిరుపతికింబోయి యొడలి నగలెల్లఁదీసి యిచ్చెదరు
హర! వచ్చి నినుజూచి యొక నమస్కార మాచరించెదరు
శిక్షించుటకు మన్నించుటకు గల భేదమిద్ది హర
హర మహాదేవ! శ్రీ కాళహస్తీశ్వరా! మహాదేవ! 3

దయగల్గెనేని బంగారముం జేతు తాఁకినయంత
దయలేదయేని భస్మీకరింతువు తాకినయంత
అయయొ నినుంజూచి భయపడవలెనా! ఆచుకోవలెన
ప్రియత ధీనిలయ శ్రీ కాళహస్తీశ్వరా! మహాదేవ! 4

ఇంతగా నయథార్థ మంచుఁదెలిసియు నీ లోకమందు
నంతలో రమియించుట పరిహారణీయమను సాకుగాని
తంతవ్యమాన మోహంపు రేకు దొంతర లెంతయైన
నంతమ్మౌకావు శ్రీ కాళహస్తీశ్వరా! మహాదేవ! 5

ఏనెట్లునుంగాను, పరమ హంసయు నింద్రియ విహృతి
లోనడంచి విముక్తినందె, ఖగిలిన లోకమేమయ్యెఁ
దానచ్ఛమౌ బ్రహ్మమయ్యె బ్రహ్మచైతన్యమే మరల
నైనది జగము, శ్రీకాళహస్తీశ్వరా! మహాదేవ! 6

ఆయన, యహిరాజు శయ్య నిద్రించె, నా యహిరాజె
నీయెడ భూషణంబయ్యెఁ, గొడుకయ్యె నీ వాని యొకటి
మైయున్న తత్త్వంబె, మీరలిద్దఱా! యధికమా యేదో
మైయున్కి తోఁచు శ్రీ కాళహస్తీశ్వరా! మహాదేవ! 7

ఎంతకు విడలని యంతగట్టిది యింతలో విడిలు
అంత పీట ముడిపడ్డదియు నూరకే యా మర్మమరయ
నంతయు మరి వడ్లగింజలోని బియ్యపు గింజ యెంతో
ప్రాంతమైయొప్ప శ్రీ కాళహస్తీశ్వరా! మహాదేవ! 8

అన్ని విద్యలకును దుట్టతుద తెలియని దంచుఁ గలదు
తిన్నగా మనుజుని యూహకందనిది రహస్యమాచుఁ
నిన్నుఁ దోఁపించెడి దద్దివదలి మానినులాడెదరు, బ్ర
హ్మన్నలా సమితి శ్రీ కాళహస్తీశ్వరా! మహాదేవ! 9

పొత్తపినాటి దైవంబ! మై మైలపోఁగుల చెదలు,
చెత్త రాళ్ళులు చేర్చునేస్తు పాములు, చెప్పొత్తు బోయ
చిత్తమ్మునకు నచ్చి మల్లెపూఁ దేనె చినుకులకైత
హత్తదా నీకు శ్రీ కాళహస్తీశ్వరా! మహాదేవ! 10

కకుప్పులో నాదిత్యు లగ్నులును రుద్రఘటలైన నీవు
మెడఁగాల కూటమ్ము తాల్చినట్టిది మేటి మాటయటె
యుడుకు నగ్నుల బానఁ బిడుగువడెనన్న దొక వార్తగాగ
నడిగినయట్లు శ్రీ కాళహస్తీశ్వరా! మహాదేవ! 11

నా మీద దయమాలితేల? బలిసెనో నాయెడల్, సామి
నా మనస్సునుండి యెందుకని వెళ్ళినావయ్య నీవు
పో మనస్సిది దొంగలుపడి దోచుకపోయినట్లుండెఁ
బ్రామిన్కుదినుస! శ్రీ కాళహస్తీశ్వరా! మహాదేవ! 12

గుమికూడి. లోకవైయర్థ్య భావన గుబులుగా వచ్చి
యమృతాంశు నవకళలాకాచమత్కిరీటా! నీవు తోచి
విమలిత తత్త్వాల సాధు మృదుచిత్త వీధిలో మెల్ల
భ్రమియించుచుంటి శ్రీ కాళహస్తీశ్వరా! మహాదేవ! 13

మారేడు దళములు భూతిపూతయు మంచి గంధంబు
నౌర! నీ యభిషేకమైన పిమ్మట నధిక సౌందర్య
మారుచు నీ లింగమునకు, నిర్వాణమయ్యెఁ గన్నులకు
హోరాయితాహి! శ్రీ కాళహస్తీశ్వరా! మహాదేవ! 14

లాలసలేకుండఁ జూచినన్ నీ విలాసంబుగాఁగ
నీ లోకమంతయు నీవుగాఁదోచు, నెదఁ గోర్కి క్రమ్మ
నీలోకమంతు నీ పాడయె కన్పించదేమి చిత్రమ్ము
పాలేయ కరుణ! శ్రీ కాళహస్తీశ్వరా! మహాదేవ! 15

హర! నన్ను నే నీకు సర్వ మర్పించినప్పటినుండి
బరువు దించినయట్టులుండెఁ దేలికపడితి నుమేశ!
బరువు నాయది నీకు నెత్తిన పాపమ్ము కలదా
యరయంగనేర శ్రీ కాళహస్తీశ్వరా! మహాదేవ! 16

ఎప్పటిదో దిగులెప్పుడేవో సహింపగా రాని
విప్పికోఁజాలని చిక్కులను దెచ్చి పెట్టెదవేని
అప్పుడు నినుఁగూర్చి తలతునో కాని అన్నియునున్న
యప్పుడు కాదు శ్రీకాళహస్తీశ్వరా! మహాదేవ! 17

నీకన్న బాదరసమ్ము నయము దొన్నియ భద్రపరచి
పోకుండనీవచ్చు బియ్యమందుఁ గప్పూరమును నారి
పోకుండ నిల్పగావచ్చు మదినుండి పోకుండ నిన్ను
నాఁ కిడరాదు శ్రీకాళహస్తీశ్వరా! మహాదేవ! 18

ఖడ్గ ధారావ్రతమయ్యె నీతోడ గదల నీవింత
అడ్డువేయుగ నీవు తీయగానీవు అహిరాజభూష
మడ్డున మున్గినవానిఁ బైనుండి మస్తకం బదిమి
యడ్డునంటెంతు శ్రీ కాళహస్తీశ్వరా! మహాదేవ! 19

నిన్ను విస్మృతి పొందినట్లుగాఁగ గొన్నాళ్లేమియౌనొ
నన్నుగా వచ్చుట తెలియు గుండెలో సవరించుచుండి
కున్నులై తెలియక యుండ నడుగంట గోకుక చనెదు
వ్రిన్ననమాలి శ్రీ కాళహస్తీశ్వరా! మహాదేవ! 20

అరసి నానాక్షేత్ర సమితి యందు మీరావిర్భవించి
భరత దేశంబున భక్తి భావంబు పనకల్పిగొంచు
పొరుగు రక్కసి యూబిలోన దిగఁబడిపోకుండ జనుల
నరసికొంచుండ శ్రీ కాళహస్తీశ్వరా! మహాదేవ! 21

మీరమ్య మూర్తులనుండి యగ్నుల మిలమిలల్ బయలు
దేరి యదృశ్యముల్ మిన్ను నందున దెసలందు నిండి
ధారుణి భాగంబునందు యోగ్యమౌ స్థలముల వెలుగు
లాచరించుచుండ శ్రీ కాళహస్తీశ్వరా! మహాదేవ! 22

ఉండియుండి యెదో ప్రసన్నత యదెందుకో నాకుఁ దెలియ
దండ పాయని గుర్తొయ్యేమొ యొక మోహనాకార రేఖ
గండరించెడు వచ్చి కన్బొమలమధ్య కనుచూపుమేర
హాండి దించితన శ్రీ కాళహస్తీశ్వరా! మహాదేవ! 23

అచ్చట మీ మీ సుసన్నిధానంబులందుఁ గొన్నాళ్ళు
విచ్చి సేవింపగాఁ బట్టరానంత భావంబు కలదు
వచ్చి రానీని యీ కొలికిపూస తప్పింపు మూడివడి
యచ్చటనుంటి శ్రీ కాళహస్తీశ్వరా! మహాదేవ! 24

ఏది యిచ్చినసైనఁగాని తలగీసి యిచ్చెడు కొఱత
యాది, న తృప్తి హేతువయి మోహమగ్నాత్మను బెగుల
నీద, యిద్దాన నయ్యెడిది లేదు పోయెడిది లేదైన
నాది మోహమ్ము శ్రీ కాళహస్తీశ్వరా! మహాదేవ! 25

అకట! యుడుము పట్టు పట్టుకొన్నదయ్యా మహాదేవ
చికిలి చేయుచునుంటి మ్మాటిమాటికి సీత్కరించుచును
మకిలి పట్టుచువచ్చు నొక్క దెసనుండి మరి నాటుముక్క
ప్రకటమై దినును శ్రీ కాళహస్తీశ్వరా! మహాదేవ! 26

నిను రెండు కన్బొమల్ నడుమ యత్నించి నిలుపుట యొకటి
నినుగూర్చి లోతైన యూహ తెచ్చికొని రసించుటొకటి
నను దెచ్చి నీలోన గలిపికోఁజేసిన ప్రయత్నములకు
ననుకూలపడవె శ్రీ కాళహస్తీశ్వరా ! మహాదేవ! 27

ఈవిట్టివాడ వంచింతయును నిర్ణయించుకోలేక
భావంబునం దెట్టి యూహ పొడమ నీ పరమస్వరూప
మావిష్కరింపించుకొనగ నా వెంట యతనంబు సేతు
రా! వత్తొ! రావొ శ్రీ కాళహస్తీశ్వరా! మహాదేవ! 28

మంటిలో గాలిలో నీటిలో నిప్పుమంటలో బయలి
మింటిలో నాగుండెలోన నే దేది మేలైన పొడయొ
నంటియుండెడు దానినంచు నినుదాన నావిష్కరింతు
నంటి రా! స్వామి! శ్రీ కాళహస్తీశ్వరా! మహాదేవ! 29

కంట వత్తిడుకొని పవలు రాత్రులు కావలాకాచి
వంటకొగ్గుట యెవ్వడో తెలియక యప్ప ! పరాకువేళ
కంటిముందాడి యుందికొన యత్నించకయమున్ పొకాలు
మం చెన్నిసార్లు శ్రీ కాళహస్తీశ్వరా! మహాదేవ! 30

ఓమెదవని యెక్క మూర్తి ధ్యానించి యొరిగించుకొన్న
జేమి వార్విశ్వమంతయును నీవంచు నెంచిన నాకు
సోమించ నిదియేమి ప్రతిపదానంద సోమకిరీట
రై మాటకేమి శ్రీ కాళహస్తీశ్వరా! మహాదేవ! 31

ఎందాక మనసులో నుండునో శాంతి యదియు నందాక
ఎందాక నుండువు లిప్తయుందది యేడాది యనగ
సందీపితంబగు నంతబరువైన సరకీవు హృదయ
మాందోళితముగ శ్రీ కాళహస్తీశ్వరా! మహాదేవ! 32

మాటిమాటికి బలవంతముగ నిన్ను మదిలోన నిలుప
పాటించి యెప్పుడు నెడదనొకవంక వచ్చియుందడెవు
నాటియున్నది నాకు నిత్య సన్నిధానంబు గల్గినది
హాటకవర్ణ శ్రీ కాళహస్తీశ్వరా! మహాదేవ! 33

వానికిఁ జలిలేద యెండలేద యెప్పటికిని ద్వార్తకై
నేనియుఁదినుు లేద యేనిఁ దినడు తా నిట్టినట్టు కద్దలు
లైనలేదే మన్నుతిన్న పాము దేహంబున్న నట్టు
లైనను సుఖము శ్రీ కాళహస్తీశ్వరా! మహాదేవ! 34

ఎంతెంత యల్పమ్ము లిచట మర్యాదల్ గౌరవములు
వింతలౌ నుద్యోగములును హర! వీని వెంబడిఁబడిఁ, హృ
దంతరాళము గండ్లుపడిన దివి పూడ్చుటన్నది కలదె
యంత కాంతకుడ శ్రీ కాళహస్తీశ్వరా! మహాదేవ! ౩౫

వదలిపోయినఁ దిండి సాగుటెట్లంచు వనరెడువాడు
వదలిపోవుట సంభవించునా వానివల్ల కాదద్ది
ఎదను క్రిందంబడి మీఁదఁబడి యిట్లె యీడుచునుండు
నదమిత విషయి శ్రీ కాళహస్తీశ్వరా! మహాదేవ! ౩౬

చచ్చెడునాటికి సంధ్య మంత్రమ్ము జదురు వల్కొప్ప
హెచ్చి యర్వదియేండ్లు దాటినవ్వాఁడిదేదోను నాకుఁ
దెచ్చిపెట్టితి విల్లు వదలిపెట్టి నీ దెసకు రాకుండ
రచ్చకెక్కించి శ్రీ కాళహస్తీశ్వరా! మహాదేవ! 37

నీ నేర్పుకొలఁదిగా నన్ను మేకు బందీచేయు మిచట
నా నేర్పుకొలఁదిగా నీదు సన్నిధానము చొత్తు నచట
వానీరమది బిట్టు వరదలై యెంతొ వ్రాలి నీరొవ్వు
పై నిల్చుఁగాదె శ్రీ కాళహస్తీశ్వరా! మహాదేవ! ౩౮

చేకొని నా గుండెలోన వచ్చి వసించుచునుంటి
లౌకికంబుగ నింతలోన నాకొక్క లాభముకల్గె
నాకుఁ దెలియకుండ దూసికొని పోయినావు జగత్సు
ఖాకర దూర! శ్రీ కాళహస్తీశ్వరా! మహాదేవ! 39

ఇదికాదు లేవయ్య యెప్పటికి నేది యెట్లైనఁగాని
మదిలోన నొకమూల నక్కియుండెడు మాత్రముగాక
కదలుచుండను వెలె బ్రిదుకు లోతులు కదలించవలయు
నది మానఁబోకు శ్రీ కాళహస్తీశ్వరా! మహాదేవ! 40

ఏడాది మరియును గాదయేని రెండేండ్లు నీ తీర్థ
మాడవచ్చెద నిమేషమును దొలగిపోనై నది లేక
తోడుమాని నడిమి కాలమున విడఁద్రొక్కకు నన్ను
నాడిపోసెదరు శ్రీ కాళహస్తీశ్వరా! మహాదేవ! 41

ఈ కోప మీ యహంకార మీ కామ మివియెల్ల స్వామి
నీ కృప కలుగక వెన్కకుంబయనించు నట్లుగను
లేకున్నవయ్య! యుమర్చ్భవిలోక! లేలిహానాంగ
దా! కాలకంఠ! శ్రీ కాళహస్తీశ్వరా! మహాదేవ! 42

బహుళముల్ దుష్టభావములు మృత్యువు భయము నీమాటి
విహరణ వైఖరి లోకపతి! యొక్క విధముగానుండు
సహహా యీ మూడింటఁగన దురూహాలే యధిక భీకరము
లహరహమ్మభవ! శ్రీ కాళహస్తీశ్వరా! మహాదేవ! 43

మ్మేలుకొన్నప్పటికంటె కలలోన మెదలిన భయము
తూలి విచారణచేసి హేతువు తొలగింపరాక
వ్రాలి గుండియఁగలగుండు వెట్టు నీ భయమెందు కేమి?
యా లేనివేళ శ్రీ కాళహస్తీశ్వరా! మహాదేవ! 44

నాలోన నింకొక్క యర, మహేశ! యంతర్నాటకంబు
వోలె, నిచ్చటి దుఃఖచయము చాలనిపోల్కి స్వప్నమ్ము
గాలిలో వట్టిన దుఃఖపడు మన్నగతి నవివేక
మాలంబనముగ శ్రీ కాళహస్తీశ్వరా! మహాదేవ! 45

అచట భయంపడు నాతఁడల జీవుడా భయమునకు
నిచటి యీ దేహ మాలంబ మీ దేహమేగిన పిదప
నెచటి యాలంబమో యకట తా నెయా యిదియునునదియు
వ్రిచుర నిమ్కరుణ శ్రీ కాళహస్తీశ్వరా! మహాదేవ! 46

ఆలంబనము లేక కూడనున్న భయంబిది నిత్య
మాలంబనమునకు వెదకు నది హేతువయ్యె జన్మలకు
ఆలంబనమ్ములకేమి? మూలభయంబు నీ కరుణ
నాలానమైన శ్రీ కాళహస్తీశ్వరా! మహాదేవ! 47

ఒగిలి ప్తలు గుణించుకొని మహాకాలమొకటి యేర్పడియె
నొగి బిందులు గుణించుకొని మహాదేశమొకటి యేర్పడియె
తగలి ప్తయే బిందువా వ్రిథమమైన తళుకైన నిన్ను
నగుపించుకొనవె శ్రీ కాళహస్తీశ్వరా! మహాదేవ! 48

అనుభవ పరమార్థభూతులైన మహాత్ములమాట
ల నొకంటనైన నాయెడల ననుభూతి లాభంబురాద
తనరంగనా యనుభూతి దవ్వునఁ దారాడునట్లు
ననిపించరాదె శ్రీ కాళహస్తీశ్వరా! మహాదేవ! 49

ఒకసాలెపురుగు నింకొక్క యేనుగు నొక పాము నీని
నకట! త్రికాయుగస్వామివైన గాకాచికొఁగలవె
వికృతమై కాలంబు మేము నిన్ను సేవింపగాఁజాల
దకట మా నిష్ఠ శ్రీ కాళహస్తీశ్వరా! మహాదేవ! 50

సంచిత ప్రారబ్ధములను మరి గ్రహచారంబు వీని
పంచిన జన్మంబు నడకయిది మేకు బందీ మనుగడ
కొంచెమో అదికూడ లేదో నేను వెల్గునని, హరింపు
మంచింత యిరులు శ్రీ కాళహస్తీశ్వరా! మహాదేవ! 51

ఏపూర్వ పుణ్యమో మనసు నిను స్మరియించుచునుండె
ఆపూర్వ పుణ్యమ్మె నిన్ను నాకుఁ బ్రత్యక్షమ్ము సేయ
నోపినయంత నున్నదియొ లేదో మహాబ్ధి ! నీ కరుణ
ఆ పాళమేమొ శ్రీ కాళహస్తీశ్వరా! మహాదేవ! 52

మనసు లోఁతుననుండి చేయు భావన మన్నించుచుంటి
పనితమై జిహ్వ నిన్నెపుడు పలికినఁ బాటింపవింత
మనసు వెన్కను లేనిమాట దారుసంరావమో తాఁక
దనుకొందు విన్ను శ్రీ కాళహస్తీశ్వరా! మహాదేవ! 53

ఇది త్రిశంకుస్వర్గమయ్యె నా బ్రదు కిట్టట్టుగాక
మదికి నట్టిట్లయి జ్యోతిరాదిక మార్గమ్ము వఁజెడి
పదివేల్ త్రిశంకులుండిరన నా కేమిపట్టె నీ దెసకు
నదుముకోవయ్యా శ్రీ కాళహస్తీశ్వరా! మహాదేవ! 54

ఎంతగా విసువెత్తుచున్నదన, సాగనీ సాగనిమ్ము
అంతమ్మదెల్లను గలద, పైననేమగు నద్ది యగున
చింతాకు కృపయు మాస్వామి నాపైనఁ జిలికించడన్న
యంతగా నకు శ్రీ కాళహస్తీశ్వరా! మహాదేవ! 55

నా పూర్వకర్మంబు నిన్ను బ్రతికినన్నాళ్లు చింతించి
వాపోవుచుండి యదెపుడో దేహంబు వదలుటో యేమొ
అపుడ్వు మాత్రము కాని మనుగడయయి తుదిదాక
కాపు పొందుచును శ్రీ కాళహస్తీశ్వరా! మహాదేవ! 56

ఎక్కువభాగమెడారి యటనట నెక్కడెక్కడనో
యొక్కటియో రెండో పచ్చని స్థలాలు యార్పు తీసికొన
నక్కటా! చేసితి నాదు పయనంబు నచ్చోట, లేని
యక్కటికమున శ్రీ కాళహస్తీశ్వరా! మహాదేవ! 57

ఇది పాపమంచును దెలియు, మనసులో నెక్కడో బెసకు
నదుపు, పట్టికొనంగ, ననువుచాలక, యటునిటు విరియు
నది నీ కృపావిశేషమున నేదియో యడ్డుకోవలయు
నదనునయందు శ్రీ కాళహస్తీశ్వరా! మహాదేవ! 58

అజవజ తెలియనియట్టి స్థితిలోన నమరె నా లెక్క
విజితారి! యిదినిల్వ యిది ఋణంబన్న విధ మెరుంగకయ
వజలోనఁబడితి గుడ్డెద్దు చేనిలోబడ్డ విధాన
నజగవధారి! శ్రీ కాళహస్తీశ్వరా! మహాదేవ! 59

చదిసిన గుండెయై క్రోధలోభ మాత్సర్యముల్ కొంత
యదుపులోఁ బెట్టితిఁగాని తలమీరినట్టి మోహంబు
వెడఁగాడి క్రిందికి రాదు దమియింపవే దీని, శమన
రదపాద దమన! శ్రీ కాళహస్తీశ్వరా! మహాదేవ! 60

నన్నింత వ్యష్టిగాఁ బెడకుఁ ద్రొక్కి గంతలుకట్టి కనుల
మన్నుతిన్పించెదు పచ్చికన్నట్టి మమత కల్పించి
నిన్ను నమ్మినదాని కిట్లు జేయనేవలెఁ బ్రభుత
యున్నదెట్లుండు శ్రీ కాళహస్తీశ్వరా! మహాదేవ! 61

ఇల్లువదలిపోవ వేయి యూహాల్లెసగ వనొన్న
నల్లగాంతారంబు నందు లతలు వేలవి యల్లుకొనగ
నల్లుకొన్నైన గుణంబు నిర్మూలమగుఁగాక పాంధ్య
హాల్లీసకాంత! శ్రీ కాళహస్తీశ్వరా! మహాదేవ! 62

ఘనసర్వ సృష్టి హేతువయి తగునెల్ల విక్షేపశక్తి
మునరి నా మనసులో వచ్చి కూర్చుండెఁ బులిపీటవెట్టి
ప్రసరత్సమష్టి జీవ నిచయాధార రమ్యా మహాస్కా!
రసియింపు మిచట శ్రీ కాళహస్తీశ్వరా! మహాదేవ! 63

అన్నాను నీభక్తుడ ననివైకి, నీ యడుగుల నందు
కొన్నానొ, అదిలేదు, గుప్తిగుహ్యాలకుం బండ్లుతోము
చున్నాను యమ నియమములు ధ్యానంబు నొకయింతలేవ
యన్నభాది నయి శ్రీ కాళహస్తీశ్వరా! మహాదేవ! 64

ఇష్టమైనట్లు కానట్లు నిదురలో నెప్పుడో వచ్చి
యిష్టమ్మనుభవించి పోదు పగలెల్ల నెడపెడ మొగము
నష్ట సంసారమ్ముకాద మరియు నౌననుటకు లేద
యష్టమూర్తి వయి శ్రీ కాళహస్తీశ్వరా! మహాదేవ! 65

చీలికై యొకసారి వచ్చి కుమ్మరించి చను మబ్బైన
వీలుకల్గు, కిచాటులేదు చుట్టు వ్యాపించి కూర్చుండె
గాలిబిగించెఁ బట్టుమని కురియదు కమ్మి బాధించు
నాలోకనంబు శ్రీ కాళహస్తీశ్వరా ! మహాదేవ ! 66

కన గురూపసనము చేయుటకున్ను కావలసినవి
గానములు తొలుదొల్త నెడదలోపల కుదురుకోలేదు
నినుగూర్చి తెలియగా నెవరి నడుగగా నేర నయ్యోదన
యనువు మాలితిని శ్రీ కాళహస్తీశ్వరా! మహాదేవ! 67

కొన్ని జన్మలు దాటితిని, మనోమయ కోశంబునందు
నున్న జన్మమిది, యింకెన్ని జన్మలకో మరి రెండు
మున్నున్న కోశముల్ దాటి నీవైన మూర్తితో నొక్క
డన్నది యగుట శ్రీ కాళహస్తీశ్వరా! మహాదేవ! 68

తెలివియే కొంచమో కలిగిన కొలందిఁ దెలియమియొక్క
పలుగులోతులు ఘాతములుగఁ దెలియంగఁ బడియెడు స్వామి!
తలుగు లోతుల నీదు చెమ్మ యొకయింత తగులునో యంచు
నలరెడు నాస శ్రీ కాళస్తీశ్వరా! మహాదేవ! 69

ఒకయొక్క పొరఁగాఁ దొందరించక యొలువంగవలయు
నకట యిప్పి తడిసి, నాని, తెగయెండి, యట్టగట్టినవి
తుకతుకలై నీ కృపగిరి ఝురమయి తుడిచి పెట్టకయ
పరికటార్థ్యమేది శ్రీ కాళహస్తీశ్వరా! మహాదేవ! 70

భక్తి వైరాగ్యమో, మొండితనమొ, నా కెఱుగంగరాద
ఉక్తిగానుండు నీరెండు వైరాగ్యమొక చిత్రమైన
శక్తియుంచిన పూరద్వారములను నీ వగుపించుచుండు
వక్తి యున్నదటె శ్రీ కాళహస్తీశ్వరా! మహాదేవ! 71

ఇదికూడ వైరాగ్య మార్గమే యందు నేది వ్రాసినదో
అది వచ్చు రానిచో రాదు పోనిమ్మటన్న భావమ్మె
మదని, వచ్చుచు నున్కిఁ దృప్తి యిదియంచు మరల
సంశయము
సది యౌనో కాదో శ్రీ కాళహస్తీశ్వరా! మహాదేవ! 72

తనుదానకికురించుకొనును మానిసి తనయందు లేని
గొనములు తనయందుఁ గలవటంచు నన్యోంచు నేరైనఁ
దనయందు నవి లేవటన్నఁ దెలియున తనలోని పశుత
మానవుపై నాడు శ్రీ కాళహస్తీశ్వరా! మహాదేవ! 73

పుట్టినదానికి సర్వ పరమార్థభూతమై యున్కి
మెట్టిన మీ క్షేత్రభూమి, బ్రిదుకెల్ల మీరుగా నగుట
మిట్టిపడుదు సద్దివేర్చి యిద్దినేర్చి మృడ ! యవివేక
మట్టకట్టితిని శ్రీ కాళహస్తీశ్వరా ! మహాదేవ ! 74

అయ్యవార్లంగారినిఁ బొనరింపఁబో నది కోఁతియయ్యె
నయ్యయో నీ దెస నన్నుఁ ద్రిప్పికో నాపద తెచ్చి
కయ్య కోసితి గుండె నీదు దెస భక్తి కాళ దుఃఖాన
వ్రయ్యలై పోవు శ్రీ కాళహస్తీశ్వరా! మహాదేవ! 75

పాము పడగవిప్పి శిరసుపై నీడపట్టిన నేది
యేమేలు కలుగునందురు సదా నీ కహి మహేంద్రుడుండు
నామాదిరింగనె మేలు నీకు నిత్యంబు మాదృశుల
తామాటలేమొ శ్రీ కాళహస్తీశ్వరా! మహాదేవ! 76

పాము పాఁత యుగంబు దానిఁ దనువులోపలఁ జేర్చికొంటి
నోమితి. దురితంబు, మల్లికార్జునుండును బసవన్న
సోమన యన్నమయ్యయును నేను నీ స్తుతి పతంజలుల
పై మేముకామొ శ్రీ కాళహస్తీశ్వరా! మహాదేవ! 77

చేసిన పాపంబు హర! సదాశివ! చెప్పినఁబోవు
మోసంబుచేసితి మెల్ల నన్ను గుంపునఁదూర్చి చెప్పి
ఆసత్త్వ మూర్తులు పరమ శైవులే నద్వైతి నిన్ను
నాసింతు వంతె శ్రీ కాళహస్తీశ్వరా! మహాదేవ! 78

బంగరు రేకులు విప్పినట్లుగా వరలెడు నీదు
లింగంబు కన్నులు మూసినంతన లీలగా నొసట
ముంగిట కజ్జలు, తీయఁబోయిన ముగ్గిగ్గాల్కొనట్లు
అంగజాతారి! శ్రీ కాళహస్తీశ్వరా! మహాదేవ! 79



ఎంత పొడుచుక చూచినను గన్నుల కగుపడబోవు
ఎంతగాఁ జొచ్చిచూచినను గుండెలో నింత కన్పడవు
అంతగాఁ గంటికిఁ గలికమునకైన నక్కఱపడవు
ప్రాంతమై యుండి శ్రీ కాళహస్తీశ్వరా! మహాదేవ! 80

ఎందుచేత మనస్సుఁ గామపుంద్రోవ కెడముగా లాగు
మందురు, మరియును జనన మరణంబులగు నందుచేతఁ
బొందు కామమ్మున యందు న్యాయపుంబొంత పోలేర
యందుచేఁగూడ, శ్రీ కాళహస్తీశ్వరా! మహాదేవ! 81

బ్రతుకెల్ల నీరీతిగాగ నీమీదఁ బాటలు పాడఁ
జదురుగాఁ దుదకిదియెల్లఁ గవితగా జమకట్టెదేమొ
యిది ముందరే తేల్చిపెట్టు మూరక యీ శ్రమయేల
అది యౌనొకాదో! శ్రీ కాళహస్తీశ్వరా! మహాదేవ! 82

అనవధియగు నెదో సాగరమున గోళాకార మొప్ప
చును తేలుచున్నట్లుగాఁ గానిపించును నీదు లింగ
ము, నయనములు మూసికొనగ నా ప్రాణమూర్తి హర్తా ర్తి!
యనల దృగ్భాల! శ్రీ కాళహస్తీశ్వరా! మహాదేవ! 83

పొనువద్ద నీ కంటి యగ్నిగోళమై పొలుచు నీ లింగ
మనిపించుఁ దక్కిన తనువు పంచభూతాత్మకంబగుచుఁ
గనిపించు నెల్లెడ నో యుమర్ధ్యాభాకార! యనగ్ని
నని లేదు నేను శ్రీ కాళహస్తీశ్వరా! మహాదేవ! 84

అదియేదో మెఱపుగా నగుచు నీ చుట్టు ననిపించు నాకు
పదిలమై నీదు లింగమ్ము ధ్యానించు పట్టున స్వామి!
యది యొక్క తెల్వి బంగరముగా కాదు నన్నట్లు నొక్క
హాదినుధా భ్రమిగ శ్రీ కాళహస్తీశ్వరా! మహాదేవ 85

నాజాతకంబును బట్టి యిదిదని నాకును దెలియు
నాజన్మలో నీవు కానిపించవన్నది కూడఁ దెలియు
రోజురోజును వ్యర్థముగ నె నే నిన్ను రోయుదు నీవు
నాజి చేసెదవు శ్రీ కాళహస్తీశ్వరా! మహాదేవ! 86

రోజురోజుకు దుర్ఘటం బవుచునుండెఁ బ్రొద్దుకుగ్రుంకుటయు
నీ జపంబొక్కటై ప్రాణ నిచయంబు నిల్చుచున్నదియు
నాజపం జపముపై నూటికిన్నూఱునగు పాళ్ళు లేదు
రాజసబుద్ధి శ్రీ కాళస్తీశ్వరా! మహాదేవ! 87

పదివాగులై పాఱు కాలకర్మముల్ పాపపుణ్యములు
బ్రదుకు చావులు వెల్గుచీకటులు దైవపౌరుషంబులును
కదలికచే నొక్కఁడొకడు కలియుట కలుగుఁ గదలుట
యది మానుపింపు శ్రీ కాళహస్తీశ్వరా! మహాదేవ! 88

బియ్యమ్ములో రాళ్ళు లేరనగుగాని వెస రాళ్ళలోన
బియ్యమేరి ప్రయోజనంబు సుంత కన్పించదు స్వామి!
యయ్యయో పాపపు టూహాలందు బుణ్యపుటూహ లేరు
టయ్యె నాబ్రదుకు శ్రీ కాళహస్తీశ్వరా! మహాదేవ! 89

మెఱవద యుఱుమద తెలుపి లేకొక్క మెయి వానవిడక
కురిసెడు ప్రోయి క్రిందఁబైన మిక్కిలి కొఱఁతయైన యది
వెరవేది యున్నది నా స్వామి! యీ వాన వెలియింపు నిన్ను
వరుదెంతుఁ జూడ శ్రీ కాళహస్తీశ్వరా! మహాదేవ! 90

మొదలు తుదల్ లేని కాలముల దేశముల జనుల్ పుట్టి
బ్రిదుకుచుఁ జచ్చుచు హింసచేయుచుఁ జంపుచుఁ గనుచు
నదులు పొంగుచు భూమి పగిలి యుద్ధముల్ నడుపుచు నేమి
యదుపు లేదాయె శ్రీ కాళహస్తీశ్వరా! మహాదేవ! 91

నేనెట్లు ముక్తిపొందుదును నాకెట్లు నీవు కన్పడెదు
ఈ నేర్పు వెదకుట కాదు నీవ యీ సృష్టికి హేతు
వైనది జగమెల్ల నెందు కొప్పికోదని కోపమేమి
యైనది ముక్తి శ్రీ కాళహస్తీశ్వరా! మహాదేవ! 92

ఎప్పుడు వత్తువో యెపుడు పోదువో యెఱుగక నీవు
చెప్పక వచ్చితో యని పరామర్శ చేసి చూచెదను
చప్పని గుండియ తెలిసి లోకమ్ము చాయఁబోయెదన
యప్పటికైన శ్రీ కాళహస్తీశ్వరా! మహాదేవ! 93

నీ వేగుదెంచి లో నాడుటకు వెంటనే గుర్తు నిత్య
జీవనంబగు మవ్వటేఱు పొట్టొగ్గి జీర్వారు భువన
భావనా కల్మష క్షాళనము చేసి పాఱైనవేళ
నావి తేరెదన శ్రీ కాళహస్తీశ్వరా! మహాదేవ! 94

ఘనికి యంగిటిలోని బెల్లమునకును గుడిలోని లింగ
మునకు నైవేద్య మన్నట్లు జీవితమును బెసకింప
మనసు నీపై నున్నయట్లభినయింతు మరి పీలుకాద
యనుటకు లేద శ్రీ కాళహస్తీశ్వరా! మహాదేవ! 95

లింగంబనీవ, పరస్వరూప మాలింగనంబంది
లింగమన్నాట యన్వర్థతంగను లీల నీయుండె
లింగమ్మె కాని మూర్తులను గొలుతు రలీక లింగముల
నంగజాతారి! శ్రీ కాళహస్తీశ్వరా! మహాదేవ! 96

సృష్టికి హేతువు నీవ యర్ధనారీశ్వరమూర్తి
సృష్టి ఘటిల్లు స్త్రీ పుంస యోగంబు చేతనకాదె
స్పష్టమైయున్న నీ మూర్తిని నెఱుంగఁజాలమిఁ బెట్ట
వష్ట సంపత్క శ్రీ కాళహస్తీశ్వరా! మహాదేవ! 97

వెసనావు పాల్వోని నాదుకైత నైవేద్య మిచ్చెదన
రసఁగప్పురము వోని నా శరీర మారాత్రిక నిత్తు
కసటు నా యీ ఁబ్రదు కగురుధూపంబుగా నిత్తు స్వామి
హసియింపు మిచట శ్రీ కాళహస్తీశ్వరా! మహాదేవ! 98

# విశ్వనాథ మధ్యాక్కఱలు

# భద్రగిరి శతకము

# విశ్వనాథ మధ్యాక్కఱలు

## భద్రగిరి శతకము

శ్రీరామచంద్ర! యుస్మద్ధృదుర వియత్ ప్రియతమ చంద్ర!
సారోపనిషదర్థభూత! ముక్తి యోషామణీ క్రీత
నీరధి భంగ! భూమీసుతా మనో నీరజభృంగ!
నీరధర శ్యామ! భద్రగిరి పుణ్యనిలయ శ్రీరామ! 1

మాటియొక్క యూవా తో చెడిని నాదు నీమాత్రపా పద్య
విరచనకే పొంగిపోయి శ్రీముక్తి విభవంబు నాకు
నొరిగింపనైన నాడళ్ళు వరుగులై యుగములు తవము
నెఱయించు చేలాకో భద్రగిరి పుణ్యనిలయ శ్రీరామ! 2

ఎవ్వరో యెవ్వరో యయిన యీ దైన్యమెసఁగు కోరికలు
రువ్వాటలో నర్థమొప్ప విశ్వేశ్వరుండును నీవు
నవ్వుల మీయంత మీరు చేదుకో నవ్వువారు నన్ను
నెవ్వాగల్ కూర్పక భద్రగిరి పుణ్యనిలయ శ్రీరామ! 3

మనసెక్కువగ నైహికమ్మగు దినుసు మనసుతో మమ్మ
మననంబుచేసిన నైహికమ్ములా మహిమల నిత్తు
మనుకొన్నసదియేల యాత్మలో వచ్చి యవధరింపఁగల
నెనరె చూపింపుదు భద్రగిరి పుణ్యనిలయ శ్రీరామ! 4

లావణ్యనిధి! లక్షమంది రావణులం జంపుమీవు
భావంబులో నిన్నెంచఁ జివురాకు పగిదిభాసింతు
జీవంబులో నెంత మార్దవమ్మును జెందించఁగలవో
నీవారశూకాభ! భద్రగిరి పుణ్యనిలయ శ్రీరామ! 5

గ్రహములు తొమ్మిదిమంది యైదు వర్ణమ్ములవారు
గ్రహముల సంచారగతిని నేను కిరాతబుద్ధి నయి
విహరింపవచ్చు నొక్కపుడు చైతన్య విభవాంబురాశి
వృహారి! పాలింపవే భద్రగిరి పుణ్యనిలయ శ్రీరామ! 6

అన్ని రోగంబులు కుదిరెడివి గాని యీ రోగ మొకడు
చిన్న మెత్తంతైనఁ గుదుర లేదు రాజీవాక్ష! రామ!
యన్నలా! లగ్నమందున్న కుజుడును నను రగుచుండు
నిన్నుఁ గాదన్నట్లు భద్రగిరి పుణ్యనిలయ శ్రీరామ! 7

మొగిఁ జాపమఱ నీదు మైవెలుఁగు మహాంబులలో
మునుఁగుట
కుగ నెంచగా నొడ్డు కచ్చితంబుగా గోసినట్లుండె
దిగుటకు లేదంత దూఁకుటే కాక ధృతి నిల్వ నీవు
నెగడించుటయె కాక భద్రగిరి పుణ్యనిలయ శ్రీరామ! 8

జోరీవుల నీళ్ళొక్కసారి వట్టుగా ముంచెత్తు నీదు
లావణ్య నది యొక్కసారి జివ్వున లాగివేసెడిని
దేవ! నీదయ యెప్పుడెట్టులుండునో తెలియఁగఁజాల
నీవ కన్పడవాయె భద్రగిరి పుణ్య నిలయ శ్రీరామ! 9

వెసఁ దెల్గు తెల్గంచు జనము వెఱ్ఱిగంతులు వేయుచున్నారు
దెసమాలు మాజాతి కీవొకండవు తెలుఁగుదైవమవు
కసితీర నుతియింతు నిన్నుఁ దెలుగు వక్కణములతోడ
నిసిపోవఁ బగలురా భద్రగిరి పుణ్య నిలయ శ్రీరామ! 10

పాఱఁడని నీవ్రను నీవని పాఱుండు వ్యర్థపుచ్ఛకుడు
జరిపి నా ప్రార్థన మీఱుమీఱు వచ్చిందాలు పోయి
చెఱియొక చేయి వేసినను జాలును చేరితి ముక్తి
నిరుపమాన దయాబ్ధి! భద్రగిరి పుణ్య నిలయ శ్రీరామ! 11

కొనిపోయి నన్నుఁ గైలాసమందొ వైకుంఠంబునందొ
గణములలోఁ బారిషదులలోఁ జేర్పఁగాఁ గోర లేదె
నను నేన పాపముల్ తొలఁచ మనసిగ్గొన సాయపడగ
నెనరు చూపుడటంటి భద్రగిరి పుణ్యనిలయ శ్రీరామ! 12

పడిఁబుట్టుచునె యున్నది ప్రజ, బాధలు పడుచునే యున్న
దొడుదుడుకు సుఖానికి జతనమ్ము చేయుచునె యున్నదియు
విడుదల లేదింత మెలికలోనుండి విడుదల లేదు
నిడుద యూర్పుల గమి భద్రగిరి పుణ్య నిలయ శ్రీరామ! 13

తడవకు నప్పటికప్పుడె సంసార తాపత్రయంబు
బెడఁదతోనె సరిపోవుచున్నది ప్రియతమ జ్యోతి
నెడఁదకు నిను గదియించుకోనెప్డు యెఱుఁగన యెడఁద
నిడివి యానఫలింప భద్రగిరి పుణ్య నిలయ శ్రీరామ! 14

తెలివిగా నెవ్వో చేయఁబోయి తలదూర్చి తీసికోలేక
వెలిమేనుగాలిలోఁ గొట్టుకో నటుపిట్టు నయ్యెదను
కలుగగాఁ గోదండ రమ్యమైన కైదండ యీవె
నిలువఁ బ్రోక్కికొనంగ భద్రగిరి పుణ్య నిలయ శ్రీరామ! 15

కొండపైఁ గోఁతి రమ్మన్న రాదు మాకును, నీవనుకొన
కొండఁ దానై వచ్చు రాక్షసవధ చేయును బయిపెచ్చు
కొండపైఁ గోఁతి రానక్కఱయమె లేదు కోఁతియు నీవు
నిండియున్నారెవ భద్రగిరి పుణ్య నిలయ శ్రీరామ! 16

విడివడి కట్టలు తెగిన మతిఁ బుల్లవిరుపు మాటలను
చెడిపోవుచున్నారు కొంతమందినిం జేరఁగాలేక
వడి నాకు నీదయ ముదురు పాకానఁ బడక నిన్ గాద
నెడు బుద్ధి రాలేదు భద్రగిరి పుణ్య నిలయ శ్రీరామ! 17

ఈ పద్యములు నీవు నిట్టివేషాల నెందఱో వేతు
రే పవ్వ లుడుకవు చచ్చినట్లుగా నింద్రియ జయము
ప్రాప్తింపఁ జేసికో తేరగా వచ్చి పడదనె దీవు
ఎవట్టు తెలియలే భద్రగిరి పుణ్యనిలయ శ్రీరామ! 18

ఈ వెట్ట యిటులున్న నింక నేమైన నున్నదా మండి
పోవుటయే కాక యిందిర్రియ జయమ్ము పొలువేది నాదు
జీవ వల్లరి వాడ్రిలుతీర, మూరాకు చేరికగాగ
నీవు నిల్పకయున్న భద్రగిరి పుణ్య నిలయ శ్రీరామ! 19

పదవయ్య నాస్వామి! విదియనాడు కన్పడని చందురుడు
తదియనాడైనఁ గన్పడును గన్పడి దారిపుఁ బోగు
పద యిత్తు నీలావనింద తొలగించు, భక్తి మేల్కొను
నిదురరా నీకువే భద్రగిరి పుణ్య నిలయ శ్రీరామ! 20

తెజేఁజచ్చునప్పుడు సంధ్యమంత్రమని బ్రిదుకు చివరఁ
బరమమహా నీ భక్తి సుంతగానైనఁ బట్టుకొన్న యది
కొంఱ గుర్రిడ్డిలో మెల్ల, ప్రాణముల్ గుటగుటలాడు
నెరపురాకయ మున్న భద్రగిరి పుణ్య నిలయ శ్రీరామ! 21

ఎక్కడనొక లిప్తమైన నీ భక్తి హీనమై చనునో
యక్కటా యనిదిగుల్ పడెదునాకు నిద్రావధీర్ణయు
చక్క బ్రదుకు కృషి కనక తప్పవిసరియు నింతకును
నిక్కమిా వొకడవై భద్రగిరి పుణ్యనిలయ శ్రీరామ! 22

వగ నా శరీరస్థితి యెగఁదీసిన బ్రహ్మహత్యయును
దిగఁగీసినంగవీ హత్యయుగ నున్నది సుతవస్సరణ !
యొగిడీనిరతు కష్టముగ నున్నది, యున్నదీ చరణ!
నిగమాంత సంవేద్య భద్రగిరి పుణ్యనిలయ శ్రీరామ! 23

కథనీది సూక్ష్మమతి రమణీయముగ రచించెదఁ గద
కథనాది పాలింపగారాదె స్థూలమ్ముగానైన నీవు
ప్రథితమ్ములిచ్చి పుచ్చుకొనుటలు నీకు బట్టవో ముక్తి
నిధికి శ్రీశాలికి భద్రగిరి పుణ్య నిలయ శ్రీరామ! 24

పుట్టించి వట్టించినావు కారాని పోరాని సంత
రెట్టించి ధట్టించినావు దుఃఖ దారిద్ర్యంబులెల్ల
కట్టించి ముట్టించినావు తీవ్రాగ్ని కాయంబునందు
నిట్టులమ్మా కృప భద్రగిరి పుణ్య నిలయ శ్రీరామ! 25

పట్టిన దయ్యమై, క్రిందఁబెట్టిన వానలు పైనఁ
బెట్టిన యెండలులేని దుక్కలు పీని రక్షింతో
త్రొక్కెలుకట్టిన, జ్ఞానదగ్ధ కర్మలని చెప్పటయు
నెట్టుచున్నది నన్ను భద్రగిరి పుణ్య నిలయ శ్రీరామ! 26

నోరు మాటాడుచో వెక్కిరింపనా నోస లనుములను
జేరిమిఁడించు మిన్నులను జేతిలోఁబెట్టనా నిద్ది
తోరమైనట్టి లౌకికము దీనికి దూరమా దీవు
నేరనా దూరము భద్రగిరి పుణ్య నిలయ శ్రీరామ! 27

వలెనని యిది చూడ, ననుభవించగా వలెనని యిద్ది
తలఁపులో బాహిరవోయి యీ కట్టె తమ దయలేక
చలియించుచున్నది చలన సంగతా సాధుచేష్టముగ
నిలువరింపుము దీని భద్రగిరి పుణ్యనిలయ శ్రీరామ! 28

కనవలెనని శ్రావణాంబుధర శాబళమనోజ్ఞ నిన్ను
వినవలెననియు షడ్జస్వరమయూర పీరావు నిన్ను
కననేల విననేల యేటికీ రమ్యకాంతులు చేయు
నిను నన్నొకటిగాఁగ భద్రగిరి పుణ్య నిలయ శ్రీరామ! 29

స్వామి! నన్నొకసారి యిట్లు దయచూచెఁ బరముఁడన్నట్టి
యామాట కొందఱితోడ చెప్పితి ననుచుఁ గోపమ్మొ
ఆమెయి నీవైపు తిరిగిచూడవ యద్దిక్షమింపు
నీ మన్నన వచింప భద్రగిరి పుణ్య నిలయ శ్రీరామ! 30

చట్రమ్ములో బిగించితివి యటునిటు సాగనీకుండ
కుట్రచేసితి లేదు వీలు కాల్తిసికోఁ బులిమీఁది
పుట్రనా నిత్య మృత్యు భయమిదేమి ముక్తి వ్రతంబు
నిట్రవవాసముల్ భద్రగిరి పుణ్య నిలయ శ్రీరామ! 31

ఏడువలేక నవ్వుటయ యెంచిన నీ సృష్టియెల్ల
కాఁడువాఁలగు నేటి కడుపులో నిల్లుకట్టినయట్లు
వేడి నిట్టూర్పులగాదె యిదిదని వెలయని బ్రిదుకు
నేడె తెలియరాదు భద్రగిరి పుణ్య నిలయ శ్రీరామ! 32

చివరి యీ దినములలోన నొకరీతి జీవనధార
నవదరింపఁగ సాయపడెదు పెంచి యాస జగదాధార
తవిలి నాలో సాయపడవె నను నేను దహియించుకొంచు
నివురు కప్పికొనంగ భద్రగిరి పుణ్యనిలయ శ్రీరామ! 33

వేతప్పుచేయును మరి క్షమింపఁగా వేడుఁ గన్నీళ్ళ
నీతిబాహిరుఁడైన వాఁడు నేను నా నీతిగాఁగలన
చేతో నియమ సర్వధర్మ పాలకా! శ్రీరామ! నాకు
నీతోలగించునా భద్రగిరి పుణ్య నిలయ శ్రీరామ! 34

నాయూహాయుఁ బ్రియాగవోలెఁ బొలుచు జానకిరామ! , యెప్పుడు
నీయూహ కలిమి గంగయుగ యమునగా నినుపైన కోర్కి
నా యీ సుకవితా సరస్వతియును నంతర్వాహినియుగ
నీయేమి తలచుటో భద్రగిరి పుణ్యనిలయ శ్రీరామ! 35

గుండెలో సుడివోలెఁ దిగిరి ప్రాణముల్ కొఱవోయి యెడఁద
గండిగొట్టినయట్లు తోచు జన్మదుఃఖపు టూహవచ్చి
బండలపై దూఁకి జారి పోకుండఁ బట్టుకోరాదె
నిండైన కృపతోడ భద్రగిరి పుణ్య నిలయ శ్రీరామ! 36

ఊహాకవధిలేని మనసు కలిగిన యులిపికట్టెకును
గాహితాఖిల విషయముగఁ దన్మయత్వము కలుగదు స్వామి
యూహతోనే నగ్గిమగ్గి వైరాగ్య మొదవించుకొంచు
నీహేల తెలియనౌ భద్రగిరి పుణ్యనిలయ శ్రీరామ! 37

చెట్టుమానిసి, తన యులుకు బయట వేసికొని యెవ్వారో
తిట్టినారంచు హోరుమని యేడ్చెడి తీరుగా నేను
కట్టిడి పాపముల్ చేసి నీవు నన్ గరుణింపవంచు
నెట్టవంచందును భద్రగిరి పుణ్య నిలయ శ్రీరామ! 38



మరి సిగ్గుచేటు నా పాపసంహతి మాట నీతోడ
సిరికావియును జెల్లనైన మల్లెపూ శీలమ్ము గలుగు
దొరతోడనే మోము పెట్టికొని చెప్పుదును క్షమియింపు
నెరపుకల్గిన గుండె భద్రగిరి పుణ్యనిలయ శ్రీరామ! 39

చెడుగు మాటలు చేసిన నట్టి పాపము చెప్పినఁబోవు
నెడలఁ జేయుచునుండవచ్చుఁ జెప్పుచునెపు డుండవచ్చు
వడినోరు మూసుక యనుభవింపఁగా వలయునే కదయ
నెడు తెల్వియున్నది భద్రగిరి పుణ్య నిలయ శ్రీరామ! 40

ఇటువంటి పాపులు నుందురా యని యేల సందియము
కటికవానికిఁ బాపమన్న యూహయే కలుగనివాని
కటునుండి నరకుక రమ్మటన్న తీవ్రశునకేమి
నిటలస్థమగు జ్యోతి భద్రగిరి పుణ్యనిలయ శ్రీరామ! 41

నా కికెందుకు లేదుగాని రామచంద్ర! యిది జుగుప్స
కాకరంబని యెరింగియు జుగుప్స నిత్యంబును బడుచు
లేకిజన్మము కాక యేటికిఁ ద్యజింపలేనో యెఱుఁగను
నీ కాంతి యెఱుఁగను భద్రగిరి పుణ్యనిలయ శ్రీరామ! 42

కొడుకు కాంతారమ్ము చనిన నసువుల గ్రుంకె నీ తండ్రి
కొడుకు తా నసువులఁ గ్రుంక నేనింత క్రుంక నీ పేరు
కొడుకుకుఁ బెట్టితి వాని బ్రదికించికొను నిక గాద
నెడు తీవ్రతయు లేను భద్రగిరి పుణ్యనిలయ శ్రీరామ! 43

వసుధ నాకంటెను బుద్ధిమాలిన వాఁడు లేడనుము
పసివాడు వానిపైఁ బ్రాణములు పెట్టి బ్రదికితి వాడు
నుసియయ్యె మేనితో నేనుమాత్రము నుసికాను దుఃఖ
నిశ వేఁగ నీయను భద్రగిరి పుణ్యనిలయ శ్రీరామ! 44

ఏడుపులో నట్టయుడుగు నందున నెక్కడో నీదు
జాడ కన్పించు నా యేడుపైన నిచ్చట నేడ్వలేను
నీ్రీడామనోహరమూర్తి నిన్ను దర్శింతునంచనగ
నీడజ హారివాహా! భద్రగిరి పుణ్య నిలయ శ్రీరామ! 45

నమ్మకమ్మునఁ గొంత యప్పు పెట్టి పంటలమీఁదఁ దీర్చి
కొమ్మనుటున్నది జగతి నీవు నాకును గానిపించి
నెమ్మదిగా నఘవ్రతతిఁ దూల్చికో నీ వసుమాత్ర
నెమ్ము నీ యెదలేదు భద్రగిరి పుణ్యనిలయ శ్రీరామ! 46





తోరపుబెడ బాధ దంప నాగళ్ళతో దమ్ముచేసి
నారుకట్టలు దగ్గరలుగ విసరినన్నను పైన చేని
యేరిమిగా నుంటి స్వామి! వెసవచ్చి యూడ్చుకోవయ్య
నీరమెండకయమున్ భద్రిగిరి పుణ్య నిలయ శ్రీరామ! 47

అది కాని దానియందున నకట! అదియదియను బుద్ధి
పొడలదు నాకైన దానియందు నా బుద్ధి యున్నటులఁ
బొదలుచుందును నేనుగాని మెలఁకువ పూర్తిగారాదు
నిదురయందున నుండి భద్రిగిరి పుణ్య నిలయ శ్రీరామ! 48

చేవవెల్గు వెలుంగె, మరియు చీఁకటి చీఁకటే, రెండు
నా వెల్గు చీఁకటుల్ కలిసి యుండుట యున్నది లేద
యో వేధ! గుడ్డివెల్తురని. లోకాన నున్నది స్వామి!
నీ వొప్పకోవంతె భద్రగిరి పుణ్య నిలయ శ్రీరామ! 49

నిను నింతగా దలంచియు ప్రమాణమ్ము నేరను, జీవి
యనుభూతికిం బ్రిమాణమ్ము లేదు నీదగు దయకాక
యనువుగాఁ గొలువవే వేసి యెన్ని నీ యడుగులు కలవో
నెనరొప్ప నాభక్తి భద్రిగిరి పుణ్య నిలయ శ్రీరామ! 50

నాలోతు తెలియును నాకు, నేడ్చుట నాయెద వ్రిస్సి
లోలమై యుబికెడు గ్రుడ్లనీర్గ్రుడ్లలో గ్రుక్కకొనుట
వ్రాలు సంజలఁ బ్రొద్దుపొడుపు వేళల రాపుపొందుటయు
నీలోఁతు తెలియక భద్రగిరి పుణ్యనిలయ శ్రీరామ! 51

ఒనరగా నల్వురు నన్నుఁజూచి యయ్యో పాపమంచు
ననిపించుకోలేన బయటి నా వ్యవహార నిష్ఠతయు
ననుఁగట్టు పొగరుబోతని యయనిపించు నా గుండె వ్రయ్య
నిను నెంచుచునుగూడ భద్రగిరి పుణ్యనిలయ శ్రీరామ! 52

నీటికొలంది తామర జగత్తేమి నీవేమి? భేద
మో టోకుబేరము నీది చిల్లర యుర్విది యెంత
టాటోటు బ్రదుకయ్యె నిమ్మనియడుగుటయె చాలు నెంత
నీటు చూపింతురు భద్రగిరి పుణ్యనిలయ శ్రీరామ! 53

నిలచినవాడను నిలచినట్లుగ నీవెల్గు క్రమ్మ
శిలనుగానాయె బూడిదయుఁగా నాయెను జెందించవంత
వెలుఁగు నాపై రాయి నెలఁతఁ జేసితివి. మనుష్యు శిలగ
నిలుపంగఁజాలవో భద్రగిరి పుణ్యనిలయ శ్రీరామ! 54

ఓయి బాబోయి! తా వెలికి వచ్చుటయును నెంత తేలి
కో యశ్లె లోనికిఁ బోవుటంత కాదోయి నా స్వామి
హీ్రియేచ ద్వారబంధాల్బిగించి రానీవు దేవతలు
నీ యాజ్ఞ లేకుండ భద్రిగిరి పుణ్య నిలయ శ్రీరామ! 55

నీదతు నీదయ నీదయ మరొండు నేరను తోోవ
కాదని జన్మలెత్తింతు చంపెదు కాంతా సుతులను
వే దరిద్రుని రోగిఁజేతు చేసికోవే రమా రమణ
నీదయ కానిమ్ము భద్రగిరి పుణ్యనిలయ శ్రీరామ! 56

నా జీఱ యెఱుఁగుదు వీవు రామచంద్రా! మొండివాఁడు
రాజుకన్నను బలవంతుఁడు బిగింపు రవ్వంత ఫలము
తేఁజాలదెందుకు గాని దిగవయ్య దిగు సంచరన్మ
ణీజాల రుచిహాస! భద్రిగిరి పుణ్య నిలయ శ్రీరామ! 57

నాది క్షేమున్నది ప్రీతి నిమేషమ్ము నన్నేను సిద్ధ
మే దాని వ్యవహారమే మొ చూచికొమ్మిమ్మావు చూచుటకు
లేదందువా దానికైన సిద్ధమే లేకపోనిమ్ము
నీదేది కాదందు భద్రగిరి పుణ్య నిలయ శ్రీరామ! 58

నిరపాయ! నేనేర్చి నన్నిమాటలు నేర్పరెవ్వరును
అరయ నీమాటలు వేనికవి నీక యప్పఁ జెప్పెదను
మఱియు దీనికి దారవోతెఁ గోపము మన్నింతువేని
'నిరవాక' మైనట్లై భద్రగిరి పుణ్య నిలయ శ్రీరామ! 59

అరులును మిత్రముల్ జరుగవలసిన యుపకారమునకుఁ
బొరసెడు నుపకారమునకు సాధనములు దైవమునకు
మఱియు నీ దయలేమి మఱియు దయకల్మి నా సాధనములు
నెఱికల్గుఁ గల్గవు భద్రగిరి పుణ్యనిలయ శ్రీరామ! 60

ఆఁకలి లేకుండ నోటి వాపిరి యన్నది కలదు
ఈ కామ మంతకుమించి చెడ్డది యిందిరాహృదయ!
వేకట్టి పాతిపెట్టుము చిగుర్చును వేళ్ళను బారు
నీకంటె మొదటిదో భద్రగిరి పుణ్య నిలయ శ్రీరామ! 61

యోగీశ్వరుల కథల్ విన్నచో నాకు నుల్లాన దిగులు
కాఁగల నా! యట్టివాఁడనంచు నీ కామమ్ము కోసి
ఝూగియే పాపమే జన్మ మెత్తించునో ఆఁగవే! ధు
నీగంధి కరుణాక! భద్రగిరి పుణ్యనిలయ శ్రీరామ! 62

చివరకు వెనుకటి జన్మకూడఁ దెలియుని జీవుడై పోతి
నప్పుడ నేనీ జన్మదాఁక నఘహీనమైనట్టి జన్మ
మవ్వనెత్త లేదన్నమాట యెత్తింపుమయ్యా యింకైన
నివిడిన జాలితో భద్రగిరి పుణ్య నిలయ శ్రీరామ! 63

నవ్వుచుఁ బావపు మాటలాడెద, నా జీవునందుఁ
బవ్వళించిన యట్టి కామ భావనోల్బణములు కావా
నవ్వులై పరిసిపోయెడిని కవనంపు నా యంకరమున
నెవ్వగ యెదపొంది భద్రగిరి పుణ్య నిలయ శ్రీరామ! 64

ఈ లోకపుం దెల్వి పొంగులై నట్టు లిచ్చితి స్వామి!
నాలుక తుద జమత్కృత సరస్వతీ నాట్య రేఖగను
మేలు కావచ్చును కవికి, జన్మయు మృతియు మాకేమి
నీలాంబుధర దేహ భద్రగిరి పుణ్య నిలయ శ్రీరామ! 65

చదువవేసిన యంత నున్నమతికూడ సమసిపోయెనన
మొదలిడి నీ మక్వాచారఁగ మున్నున్న పోడిమి కూడఁ
జెదరిపోఁ జిత్తంబు చెదరిపో నాశ చెదరిపో స్పృహాలు
నిదురపోనీవాయె భద్రగిరి పుణ్యనిలయ శ్రీరామ! 66

సంచిత పాపమ్ము లెట్టివో స్వామి! సంసార బుద్ధి
మంచినీటికి నెక్కునట్టిదగు చేవమాదిరి గాఁగఁ
బంచుచున్నది యూహా నీదు మృదుపాద పారిజాతమ్ము
నించునా చిఱుతావి భద్రిగిరి పుణ్య నిలయ శ్రీరామ! 67

పోరియు బోరి యీ మనసు వంకర, పురుష యత్నమునఁ
దీరకయున్నది దైవయత్నానఁ దీరగావలయు
తోరముగాఁగ మీ కాళ్ళ వేళ్ళయందునఁ బడుచుంటి
నేరకయేకదా భద్రిగిరి పుణ్య నిలయ శ్రీరామ! 68

నన్నేమి చావుమంచనెదొ యెంత యత్నము చేసి మనసు
నిన్నంటుకొని నిమేషమ్మయినగాని నిల్పుటలేదు
నన్నొక్క వేయి జన్మలను గత్తుల నరకము విడక
నిన్నంటుకొని యుండ భద్రిగిరి పుణ్యనిలయ శ్రీరామ! 69

ఇంతగా మనసు నీపైని నిల్పని యీ జన్మకంటె
వింతయా పశుజన్మ చాల మేలనుపించునో స్వామి
కొంతయఘ మనుభవించు నంతియ కొత్తపాపము గు
ణింతముల్ నేరదు భద్రిగిరి పుణ్య నిలయ శ్రీరామ! 70

అల కామరోగమ్ము దొంగదియు మానినట్లుగా మాని
సెలవేయు రెట్టింపు తీపు నెత్తురు చీము పట్టీలు
తొలిగూడు నీ కృపారసము పూంతల దీరును గాక
నిలువనీయదు జీవి భద్రగిరి పుణ్యనిలయ శ్రీరామ! 71

జ్యోతివోలిక నీవు కనుబొమల మధ్య నుదయించు వేళ
నీ తనూయష్టిలో గాలి యాగిపోయెడు రమా రమణ
చేతమ్ము స్తంభించుచుండెఁ బ్రాణమ్ము చేతమ్ము జంట
నీ తమ్ములౌకసారి భద్రగిరి పుణ్య నిలయ శ్రీరామ! 72

కాటించుచుంటివి మనసు దినదిన గండంబు మరియు
నూరేండ్లు లాయుస్సుగాఁగ బ్రదు కిదెందుకు బిట్టు భార
మారీతి నేటికీ సుఖములు సుఖంబులని రమించుటయు
నేరని కాడికి భద్రగిరి పుణ్యనిలయ శ్రీరామ! 73

లేదు మాదృశు లుర్వి సుఖము లక్కఱలేదు దుఃఖంబు
లోరువజాలను బ్రదికియుండుట యుర్విపై బరువు
నౌర నీ కృపలేదు తెలియరాదు జన్మాంతర ఫలము
నీరీతి తెలియదు భద్రగిరి పుణ్య నిలయ శ్రీరామ! 74

చేసినవానికిఁ దప్పకున్నచోఁ జేయుము నరక
వాసమ్ము పుణ్యానుభూతి యేమియు వలదు లే నరక
వాసాన వైరాగ్య మతియు నీదైన భక్తియు సాగ
నీ సర్వ రక్షకా! భద్రగిరి పుణ్యనిలయ శ్రీరామ! 75

సారిది నీ యున్నగోడ చెడకుండఁగఁ జూచినఁజాలు
పెరుగ నక్కఱలేదు లేదయాశ నన్ బీడించుటయును
మరణమ్ము ప్రభు! నిరాయాసముగఁ జేఁత మన్నించుచాలు
నెఱసుల నెన్నక భద్రగిరి పుణ్యనిలయ శ్రీరామ! 76

ఇట నెదో విధముగా సాగుచున్నదింకేమి వైరాగ్య
పటువచో గత విడంబనము చేయఁగా వచ్చునం చీవు
వెటకారముం జేసెదేని కాదన్న విధమూను కాదు
నిటలాక్ష హితతమా! భద్రగిరి పుణ్యనిలయ శ్రీరామ! 77

ఒక మాటమాత్రము నిక్కరమా మాట యుర్వీజానాథ!
త్రికరణ శుద్ధిగా ననెడు మాటయే తెచ్చినదైన
సుకమింక నొక జన్మతోడఁ గోరను సుమ్మో నీదగు వ
నికి పోఁకపై నొట్టు భద్రగిరి పుణ్య నిలయ శ్రీరామ! 78

ఉన్నచో మొదటినుండియును నీ తెల్వి యుండగావలయు
నన్నగా నడుమను గల్గినేనియుఁ జచ్చిన చావె
వచ్చిన బ్రిదుకు గోచికిని బెద్ద గావంచాకు చిన్న
నిన్నెంచు చెన్నక భద్రగిరి పుణ్యానిలయ శ్రీరాఁమ! 79

ఉండియుండి యితండు గొడవ పెంచుచు నున్నాడటంచుఁ
బండఁబారని కాయకోలకు నిరుకునఁబడకు నా స్వామి!
వండఁబారిన నాటిమాట చూచుకోవచ్చు నాయెడఁద
నిండియుండుము చాలు భద్రగిరి పుణ్యానిలయ శ్రీరామ! 80

ముడిదినుసు నిజంబు నాయెడద యంబుజ పరిమళము
వడఁబోయు నీ కాలి దుమ్ముతో నూరిభావన చేసి
వడి దీనజన రక్షణంబనెడి యనుపానంబుతోఁ ది
నెడి యోప్పు చూపవే భద్రగిరి పుణ్యానిలయ శ్రీరామ! 81

అన్ని వ్యాధులు మశూచికముతోఁ బోవు నని మృతితోడ
నన్నియు నింకన్నిపోవు, మృత్యువు నాడెదరేలా
ఉన్న మృత్యువుకంటె మితిమున్న దే యున్నన్నినాళ్ళు
నిన్నెంచుచున్నచో భద్రగిరి పుణ్యానిలయ శ్రీరామ! 82

ఏమియు లేనిదానిని గురించి యిదెల్ల నున్నదని
యీ మానవులచేత నిత్యమనిపింతు వెంతటి మాయ
స్వామి! నీవే యెన్నోసార్లు ధాత్రిపై జన్మించితి వల
నీమేను లేమయ్యె! భద్రగిరి పుణ్య నిలయ శ్రీరామ! 83

కావలమైనట్టి జనముచేత లోకంబున సజ్జ
నావళి యిడియుట లోకవృత్తంబు నందిది సగము
నీ వోడుట సగంబు సజ్జనావళి నీ వౌటచేత
నీ వాడుట సగంబు భద్రగిరి పుణ్య నిలయ శ్రీరామ! 84

ప్రభువును నమ్మినందులకుఁ దెలిపిని బడవేసినావు
సభయుని నభయునిఁ జేసినా వింక జన్మలమాట
యుభయుల మున్నామ యెత్తుమన్నచో 'ఊఁ' నీలమేఘ
నిభమోహన శరీర! భద్రగిరి పుణ్య నిలయ శ్రీరామ! 85

మండిపోవుచునుంటిఁ గోపమూని కామమ్ముచేఁ బెరిగి
గండిపడుచునుంటి సిగ్గుబడు లహంకారమ్ము పూని
యుండియుండి యిదేమొ బోర్లపడి పోవుచున్నాను నేను
నిండుకుండవు నీవు భద్రగిరి పుణ్య నిలయ శ్రీరామ! 86

స్వామి! యీ కామగుణంబహో జన్మజన్మాంతరాల
నే మొట్టమొదటనో ప్రథమ చైతన్య ప్రపదంకురమున
వ్యామిశ్రమైనదో వదలరాకుండె అది కరగింపు
నీమేల్మి యరుదేర భద్రగిరి పుణ్య నిలయ శ్రీరామ! 87

ఖగవాహ! మాటలు నేర్చినట్టి కుక్కను వెంటఁగొంచు
నాగి వేటకేగ నుజ్జోయన్న నుజ్జో యన్నదంట
నిగమాంత వాక్యముల్ నేర్చి యనుభూతినేరని వాక్య
నిగళంబు లిట్లుండు భద్రగిరి పుణ్య నిలయ శ్రీరామ! 88

అచ్ఛమైన సుఖంబు మొదటిదినుసేది యర్థించి సృష్టి
తెచ్చితో బాధలర్థించి దుఃఖమర్థించి తెచ్చితివా
కోర్చిన మతితోడఁ దద్దినమె వండుకొని తెచ్చుకొనును
నిచ్చలుడుగనిది భద్రగిరి పుణ్య నిలయ శ్రీరామ! 89

చేసెడునట్టి పాపములె వదలక చేయుచు నిన్నుఁ
జేసెడునట్టి ప్రార్థనయు వదలక చేయుచు నున్న
యీ సంధిలో నున్నయట్టి మానవుఁడేమానో సురధు
నీ సంగి చరణాబ్జ! భద్రగిరి పుణ్య నిలయ శ్రీరామ! 90

వంతంబుగాని నేను కష్టపెట్టుకోవలెఁ గాని దాని
యంతట నది కష్టపడదు నాయెడ హరి! నిన్నుఁదలచి
అంతటిదగు బలవంతపున్ బ్రాహ్మణార్థంబు పరిగ
ణింతువో నీయెడ భద్రగిరి పుణ్యనిలయ శ్రీరామ! 91

నిన్నుదలంచుటయున్న భావముల్ నెగడుటకాదె
వన్నిన మధ్యాక్కఱలుగ భావముల్ వచ్చెడు స్వామి!
యెన్న నీ కవనంబు లేకయున్న నేనేమయి యుందు
నిన్నెన్నఁజాలక భద్రగిరి పుణ్యనిలయ శ్రీరామ! 92

మఱుజన్మ మాట యెందులకు తెలియదు మఱుని మేషమ్ము
జరిగెడు నీ సృష్టియేలొ తెలియదు స్వామి! నీ రూప
మెఱుగను భావముల్ వచ్చుటాడుట యెఱుఁగుదు నెంత
నిరుపాయమా స్థితి భద్రగిరి పుణ్య నిలయ శ్రీరామ! 93

కూడి పూర్వ మహర్షులన్నదానిపై గుర్తి నమ్మకము
వాడి తదుక్తు లర్థమ్ముసంబు లవం బనుభూతి
యాడని గుండెతో నేనుగాని గీర్వాణకృతి నైతి
నీడ చోటెఱుఁగక భద్రగిరి పుణ్య నిలయ శ్రీరామ! 94

చెవులు చిల్లులు పడిపోవు గుండియ చిట్టైము కట్టు
నవని నన్యాయముల్ వినుచు స్వాయముగా ననుభవించుచును
నవుర యీ యొక జన్మచాలు మరియు నేలయ్యా జన్మములు
నివసద్రామా వక్ష! భద్రగిరి పుణ్య నిలయ శ్రీరామ! 95

ఇతర జన్మయని వద్దు స్వామి! యన్నట్టు లెత్తించినావు
ఇతర జన్మవద్దు నా స్వామి! యెత్తించితేని యెత్తించు
మొకరి! సంచిత మున్నదందువా! సరే! మొద్దుపై వర్ష
నికరంబు కురిపించు భద్రగిరి పుణ్యానిలయ శ్రీరామ! 96

ఒక నిప్పుకణము నీ నుండి చెదరించి యొప్పించి నివురు
సెకమాలి కప్పించి మరియు దీనిని జీవుఁడన పేరు
నకు బొల్వారచి నన్ను నన్నుఁగాకుండ నా తెల్విలే కు
నికి చేసిరెవ్వారు భద్రగిరి పుణ్య నిలయ శ్రీరామ! 97

అట్టె మాటాడినఁ గర్మ కర్మయంచాడెదు నీవు
ముట్టించవచ్చును లేదయేని నే ముట్టించఁగలను
వట్టె వన్నూదిపెట్టుము రవంత కప్పదు నిన్ను నివురు
నిట్ట జాలింజూడు భద్రగిరి పుణ్య నిలయ శ్రీరామ! 98

నీ మంత్రము మహర్షులకును లో నుండి నిర్గమించినది
స్వామి! నాకో వెలినుండి యాత్మ లోపలికెక్కవలయు
స్వామి! యీ మంత్రము ఏది, కాదన్నవాఁడెవ్వఁడు నను
నీ మంత్రమున నిల్పు భద్రగిరి పుణ్య నిలయ శ్రీరామ! 99

నిన్నార్తిచేత నిట్లడుగుచుంటిఁ గానీ లేకయున్న
వన్నెలు చిన్నెలుగాఁగ వర్ణింప వలఁతిని నేను
నన్నెఱుంగుదుగాదె మరల రామాయణమ్మంత చేతు
నిన్నుఁ గష్టము కాదు భద్రగిరి పుణ్య నిలయ శ్రీరామ! 100

శ్రీరామచంద్ర! యస్మద్హృదుర వియత్ప్రియతమ చంద్ర!
పారోపనిషదర్థ భూత! ముక్తిరామామణీక్రీత !
నీరధి భంగ! భూమిసుతా మనో నీరజభృంగ !
నీరధర శ్యామ! భద్రగిరి పుణ్య నిలయ! శ్రీరామ! 101

# విశ్వనాథ మధ్యాక్కరలు
# కులస్వామి శతకము

ఇంతటి వ్యర్థమైనట్టి దేహమ్ము నిచ్చి నానోగ్ర
సంతాపములతోడ నేను బ్రదికి నీ సన్నిధిచేర
నంత తపంబు చేయంగనైన నీ యాజ్ఞ నా యాత్మ
ప్రాంతమా నందమూర్నిలయ విశ్వేశ్వరా! కులస్వామి! 1

నేయియంచును ద్రావ నూనెయంచును నత్తిన పోయ
మాయురే కావైతి వింటి వేల్పవై మన్నింపవైతి
ఆయే వెలుంగవో యైన మన్నించు నవసరమేమి
రా! యయ్యా నందమూర్నిలయ! విశ్వేశ్వరా! కులస్వామి! 2

ఇదియెల్ల నాలోన నేను నాకోస మేర్పడి యేడ్చు
పదములుగాఁ గట్టి యేల యీరీతిఁ బాడుటో తెలియ
వదలని నీ పట్టుదలకు గుండియ బ్రద్దలై పోవు
సదయుడ నందమూర్నిలయ! విశ్వేశ్వరా! కులస్వామి! ౩

ఒక దిగుల్లోనుండి పుట్టి వదలక యుండగావలయు
నొక తగుల్ నీవన్నఁ గలిగి వెఱ్ఱిగా నూగాడవలయు
నకట తానది కోటిజన్మముల చారితార్థ్యమ్ము సంవి
దకలంక నందమూర్నిలయ! విశ్వేశ్వరా! కులస్వామి! ౪

తగవీని పిత తెచ్చి నన్ బ్రతిష్ఠించెఁ గావీడు నన్ను
మొగమోట పెట్టు నంచింత యనుకొనఁ బోకువే! నాది
వగఁబూంచి యిరుకునఁబెట్టి కొంత లాభము గుంజుకొనెడి
రగడయా నందమూర్నిలయ! విశ్వేశ్వరా! కులస్వామి! ౫

స్వగృహే యటంచు సంకల్పమందు భాస్వన్మూర్తి యేమి
స్వగృహంబటన్న వైరాగ్యమూనెడు పరికృతి నాయదియు
నిగమాంతవేద్యుగా నెంతు నెచ్చటి నీవైనఁ బెట్టు
నగచాట్లు నందమూర్నిలయ! విశ్వేశ్వరా! కులస్వామి! 6

పరశివా! యీ మేనితోడి నాయునికి పట్టించుకోకె
వరమమా నా గుండెలోని రాయిడి పాటింపుమయ్యా
వరుస నా నిందిృయ పటలియొక్క తీవ్రలు వానివయ్యో
సరసిజ నందమూర్ణిలయ! విశ్వేశ్వరా! కులస్వామి! 7

ఆ యిందిృయములు జీర్ణించు నప్పటి కా యిందిృయములు
చేయున దేమియు లేద యవ్వాని చింతయు లేద
రోయుదు వవిలేక వాని సంస్కృతిరూపమై యున్న
రాయిడి నందమూర్ణిలయ! విశ్వేశ్వరా! కులస్వామి! 8

అవనిజ మున్నచో దాని పుష్ప ఫలాపేక్ష మొకటె
యవనిజనానికిముండ్లై సర్వ లక్ష్యము సేతువీవు
యవ్వర నీ భావన నవసుమ ఫలాభమా మమ్ము
నవియింతు నందమూర్ణిలయ! విశ్వేశ్వరా! కులస్వామి! 9

క్షితిపైనఁ బ్రిదికినన్నాళ్లై పుణ్యంబుసేఁత ముఖ్యముగ
మతికి దీపించెదు పూర్వకృత పుణ్య మహిమచే నిన్ను
స్తుతిచేయు మతి గల్గుఁగాన నీ వచ్చు సుకృతాకృతివిగ
నతికెదు నందమూర్ణిలయ! విశ్వేశ్వరా! కులస్వామి! 10

ఏదురయు మేల్కొంట సూర్య చంద్రుల నియతిచేఁ గలుగు
బ్రిదుకులోపలి సూక్ష్మములును శుక్రాది గ్రహములవలన
నదియు కాలము కాలమీవ విడఁదీయ నలవి కానట్టి
బ్రిదుకిది నందమూర్నిలయ! విశ్వేశ్వరా! కులస్వామి! 11

అనుభవించెడు భాగమేను చూచెడు నా భాగమీవు
అనుభవించుట మాని పట్టిచూచెడు నట్లు చేయఁగదె
యనుభవమేల యో యభవ నీచమ్ము ననుభవమేల
యభవమై నంమూర్నిలయ! విశ్వేశ్వరా! కులస్వామి! 12

దండితానేకపదైత్య! తమరి చింతన లేకయుండ
కుండలలోన గుఱ్ఱాలు తోలుచు కూర్చుంటి నేను
గుండియలో దిగులొకటి కొండయై కూరుచున్న యది
యుండగా నందమూర్నిలయ! విశ్వేశ్వరా! కులస్వామి! 13

వేళకుఁజేయుచు జపము నిన్ను భావించుచు నితర
వేళల నింతకుమించి సేయగా వేరేమి నేర
నోలిమైఁ గృచ్ఛ్రమ్ములు నుపవాసములొకయింత నాకుఁ
గాదిలవు నందమూర్నిలయ! విశ్వేశ్వరా! కులస్వామి : 14

చీఁకటి యడుగున నెక్కడో వెల్గు చిన్న మొక్కవయి
కాక యెట్లుందువో కో యగాధాంధకారాంధువు నను
ఛీఁక మైఁ వెదుకగా మునిగి యుక్కిరి బిక్కిరయ్యెద, ర
సాకార, నందమూర్నిలయ! విశ్వేశ్వరా! కులస్వామి! 15

క్షణికంబగు నొక్క చిన్ని తృప్తి కల్గఁగఁ జేసి క్రోను
దాఁక వెన్కకు జారెదవును గనుచూపు దాటిపోవంగ
నీకోసమై యాగి యాగి ప్రాణముల్ నిలచిపోయెడు, ము
దాకార! నందమూర్నిలయ! విశ్వేశ్వరా! కులస్వామి! 16

ఇతర విషయ సన్నికర్ష మెప్పు డీ యెదకుఁ గల్గెడినా
మతి చలించుచునుండె నప్పుడందునే మమత యక్కఱయు
జతపడకుండనే మదికి సహజంబు చాంచల్య మిట్టు
లతికితి నందమూర్నిలయ! విశ్వేశ్వరా! కులస్వామి! 17

ఎదలోనఁ బ్రేమంపుటూహ యుదయించు నింతలో నీవు
వదవదల్ సేసిన ప్రేమ, స్మృతిపథంబున నంటి యీ ప్రేమ
పదములో నైనట్టి తీపి పాడవు, వ్యర్థతా బుద్ధి
వదయుడ నందమూర్నిలయ! విశ్వేశ్వరా! కులస్వామి! 18

మిక్కిలి నల్పమా సుఖము లోక గడ్డిమేటిగాఁ గూర్చి
యొక్క యగ్గికణంబు తుదకు నంటింతు వున్నన్నినాళ్ళు
లొక్కొక్క సమిధగా వేయు దారిపోకుండ నేమందు
నక్కటా! నందమూర్నిలయ! విశ్వేశ్వరా! కులస్వామి! 19

తెలివి యనంగ నీయదియ తెల్వి, యంతికమునఁ జేరు
పోలపముల్ పచరింతు వందలుఁ వేలు మోహమ్ము పెంచి
మొలక నవ్వులతోడ దులపరించుక పోయెదు తుదకు
నలయించి నందమూర్నిలయ! విశ్వేశ్వరా! కులస్వామి! 20

క్రిందినుంచియును బైదాక శ్వాస దీర్ఘీకరించి తరు
ణేందు చూడామణీ! పాము తోఁకపై నిల్చు చందమునఁ
బొందు వెన్నెముక వెంబడిఁ బినాకంబు పూనియుంటివని
యందునా నందమూర్నిలయ! విశ్వేశ్వరా! కులస్వామి! 21

చందిరు రేక నెన్నొసట వారగా సారాంబు వీచి
యొందిన మెదడులోఁ జలువ చెమ్మలు నురళింపఁ దలకుఁ
జెందించిన తలగ, నిన్ను నిరతంబు చింతించుచుండ
నందువా! నందమూర్నిలయ! విశ్వేశ్వరా! కులస్వామి! 22

ఒందిన ఐదుభూతములతో నున్న యున్కి మేనౌచు
కందును డిందు ననంగఁ గమలాప్త కమలారులౌచు
నిందు చేనయి యజమాను డీవౌచు నేను వేఱొకడ
నందునా! నందమూర్నిలయ! విశ్వేశ్వరా! కులస్వామి! 23

కంపనకాయ యాడునన నూపిరి కదలుచున్నదన
చిండిపోయెడునట్టి యూహాలోక చోటఁజేరుచున్నవన
మందమై చలువలుక్రిమ్మవన రుధిరమసల విచ్చోట
నందునా! నందమూర్నిలయ! విశ్వేశ్వరా! కులస్వామి! 24

బొందిలోఁ బ్రాణమ్ములనుచు నుంట నీపొలుపు, ప్రాణమ్ము
లందాడుచుంట నా పొలుపు, ననియతమై ప్రాణచయము
లందాడుచుంట నాపొలుపు నియతమ్ములగుట నీపొలుపు
వందునా! నందమూర్నిలయ! విశ్వేశ్వరా! కులస్వామి! 25

శ్రీయుత నేత్ర! చిత్రములురయ్య నీ చిద్విలాసములు
వేయిరకాల యొయ్యారములుగ నర్పితహస్తకోటి
యై యున్నదగు పినాకముంగ నిల్తు మత్ప్రాణాత్తకుంభ
కాయతి నందమూర్నిలయ! విశ్వేశ్వరా! కులస్వామి! 26

కన్నులకును వేడిలేని యెండయుఁగడలేనిమిన్ను
చిన్నారిమణియును దోడుగనీయవు చేతలోఁగలవు
పొన్నారివాదువు నావి యన్నట్లుచూపించుచుండు
వన్నియు నందమూర్నిలయ! విశ్వేశ్వరా! కులస్వామి! 27

మున్ను కాళియ ఫణి యడుగులందున మోసిన మాఱు
చిన్నారి యడుగులపైన గల మోజు చెడలేదు నీకు
వెన్నవెంబడిఁ జిత్రముగను ద్రొక్కెదు విరిసి పా యెదన
యన్నలా! నందమూర్నిలయ! విశ్వేశ్వరా! కులస్వామి! 28

ఇవియెల్ల ప్రాతిభాసికములే యంచు నీసడించకు వె
శివ! భాసమైయున్న నీవ యీవెన్క సేవింతుకాదె
యపుర ప్రతిధ్వని యధిక రమణీయ మది దిక్కువారగ
ప్రవణత నందమూర్నిలయ! విశ్వేశ్వరా! కులస్వామి! 29

చచ్చినవారేమొ వారు చావగాఁ జావనివారు
పచ్చని యీ చెట్టుమీదఁబడి తెగ కావుకొందురటె
యిచ్చట మిగిలిన వారికోన మీ యేడ్పుటయంచు
నచ్చుగా నందమూర్నిలయ! విశ్వేశ్వరా! కులస్వామి! 30

పానవట్టమ్మును బైని శేషాహి పడగ నిత్యములు
గా నీకుఁ దోఁచెడు స్వామి! వానితోఁ గలిపి ధ్యానింపఁ
గానంగ నయ్యెడు సన్న జోతిగాఁ గన్బొమల్ నడుమ
నానంద! నందమూర్నిలయ! విశ్వేశ్వరా! కులస్వామి! 31

నీ విరహము దుస్సహమ్ము నాకుఁ గంఠేకాల! యభవ!
నీ విరహమ్మనఁ బూర్వ సంగమ నిర్ణయంబనను
భావంబులో నీవు నిల్చుటయును నిల్వమి యిద్ది నాదు
హావళి నందమూర్నిలయ! విశ్వేశ్వరా! కులస్వామి! 32

ప్రాచీ సతీగర్భముక్తి నుంతయుఁ బడయని యినుని
శౌచమ్ము నౌష్ణ్యమ్ము పగిది నుదయమ్ము సంతరింపకయ
రాచి ఊంపానఁ బెట్టెదవు చిత్తధారాచితి బాధ
నాచెడు నందమూర్నిలయ! విశ్వేశ్వరా! కులస్వామి! 33

నాదు చిత్తమున నేదో దిగుల్ విడనాడక యుండు
నాదిగుల్ నీవుగానైతి భావసంధ్యావార్షికాబ్ద!
నీదు చిత్తము నాదు భాగ్య మాసర్జనీభూతమతిధు
రాదీప్త! నందమూర్నిలయ! విశ్వేశ్వరా! కులస్వామి! 34

ఒక్క చైతన్య మన్వస్తువుగొంచు నుర్విని మింటఁ
బెక్కులు జీవకోట్లను సృజించుట ప్రియమైన నీకు
ఒక్క రక్షించుమన్మాటకు శతోక్తు లొప్పవుగాదె
యక్కట నందమూర్తినిలయ! విశ్వేశ్వరా! కులస్వామి 35

నీవు నా యెదనుండి వెడలిపోయితి నిజమిద్ది శూన్య
దేవాలయంబుగాఁ దోచు ఘంటారుతియు ధూప దీప
నైవేద్యములు మంత్ర పుష్పమాది విన్పడక దివాంధ
రావమై నందమూర్తినిలయ! విశ్వేశ్వరా! కులస్వామి! 36

ఒక వేయి విధముల నెడ తెఱపిలేక యుండగ నిన్నుఁ
జికిలి వెల్గుగఁ గోల వెల్గు లేర్పడ్డ ఛిన్నారి లింగ
మకృతాకృతిగ ధ్యాతృబుద్ధి నూహింతుఁ జూపునకంద
వకలంక నందమూర్తినిలయ! విశ్వేశ్వరా! కులస్వామి! 37

నామీఁద నీకింత కోపమొప్ప నున్నది హేతు శతము
స్వామి! నీయందుఁ జూపించినాడ నశ్రద్ధ యింతయుగ
నేమో ప్రసన్నత లేని సుజన ధీవ్రాతనైజ మృదుత
రా మింతు నందమూర్తినిలయ! విశ్వేశ్వరా! కులస్వామి! 38

నీ యీ శరీరముల్ నడుమ మనసు వంతెన కట్టియుండె
నా యీ మనస్సుతో రాకపోకలు నడచుచునుండె
నాయయ్యా నన్ను నీ కడకు లాగుక నడిమి వంతెనను
రాయించు నందమూర్నిలయ! విశ్వేశ్వరా! కులస్వామి! 39

సంసారమును వీడకుండ నెట్లైన సాధింతునా! రి
రంసామతింగాక యుండ నిన్ను నారాధింతునా! ప్ర
శంసా పథంబైన జనకరాజ లక్షణమందు నటవె
హంస శ్రీ నందమూర్నిలయ! విశ్వేశ్వరా! కులస్వామి! 40

అసమాధిగతుడైన యోగియైనను వ్యవహృతి లోక
నుసమాహితుండేమొ యన్నయట్లుగాఁ జూపట్టునట్లు
కుసుమింప నీవె యీ దేహ యష్టిని కుంభిహా! సంవి
దసమాన! నందమూర్నిలయ! విశ్వేశ్వరా! కులస్వామి! 41

అడవిలో నున్నట్టులున్నదియు కాని యాకలిదప్పు
లుడుగక యున్నవి నడుమనడుమ దుష్టాగ్ని సంపర్క
మడుగు తొక్కినయట్టు లున్నదియు దీని యాలోచనమున
నడలెత్తు నందమూర్నిలయ! విశ్వేశ్వరా! కులస్వామి! 42

మరణ మేవేళనో తెలియదాయె నుమా ప్రాణనాథ
మరణమే తేరకమున్న గొక దారి మరలించుమయ్య
పరమ! యింకొక జన్మమైన సంస్కృతి బలమున సాగు
టరుదా నె నందమూర్నిలయ! విశ్వేశ్వరా! కులస్వామి! 43

ఇది నాకు నాకె చిత్రమ్ము తెలిసిన యీ వృథామైన
బ్రదుకును బ్రదుకుచు నుంటి బ్రదుకఁ దప్పదు ప్రాణనాథ!
పదివేల్ దివాకరుల్ నీవు పదివేల్ విభావరుల్ నేను
నదయుడ! నందమూర్నిలయ! విశ్వేశ్వరా! కులస్వామి! 44

కాని కామక్రోధములయి గాటంబుగా నెంత బ్రతికి
నానో తానంతగాఁ దెలిసి లోకంబు నా మనస్సూపు
తో నీట మొసలిగాఁ దిరుగు నింతియ తొల్లిటి లోఁతు
రానిది నందమూర్నిలయ! విశ్వేశ్వరా! కులస్వామి! 45

కంపనపడ్డ కాకివలె లోకమ్ము కామమ్ము కొఱకు
వెంపరలాడెడు నిన్నుఁబొందెడు విధమెట్లో యంచుఁ
గంపరమెత్తను దాని కటుగాక కలదయ్య విడుపు
ఊపిల్లి నందమూర్నిలయ! విశ్వేశ్వరా! కులస్వామి! 46

నీకృప యొక్కొక్క యప్పు డొక్కొక్క నీతిగావచ్చు
తేఁకువఁగను మూసినంతలోన జ్యోతిర్లింగ మట్టు
లై కానిపించుఁ జూడా ప్రదేశమ్ము నహి ఫణాచ్ఛత్రి
తాకృతి నందమూర్నిలయ! విశ్వేశ్వరా! కులస్వామి! 47.

అలుపంపు విషయముల్ తెలియు నధికంబు లర్థమ్ము కావు
తలపులోఁ గదలిక కలుగుఁ గలుగదు తన గుండెకదల
దల గుండెలో నెంతలోతు నందుండి హర! నన్ను నింత
యలయింతు నందమూర్నిలయ! విశ్వేశ్వరా! కులస్వామి! 48

సర్వజ్ఞతా ముద్ర నభినయించెడి జనుడు నాకంటె
నుర్విలేఁడెట్లు రక్షింతో నాయంది దొక్కఁడే గుణము
శర్వుఁడా! నీవు లేవంచు దిక్కుల సాహస మొప్ప
నార్వను నందమూర్నిలయ! విశ్వేశ్వరా! కులస్వామి! 49

నాయందు నీ కింతయైన దయలేని నాళ్ళలో నభవ!
వాయి నొవ్వఁగఁ బిల్చుచుంటి నా స్వామి పరశివా! హరహ
రా! యో మహాదేవ! గిరిశ! శంభో! శివా! శంకరా! ధు
రాయాజ్య! నందమూర్నిలయ! విశ్వేశ్వరా! కులస్వామి! 50

నన్ను గాదనుటకు వీలులేదు రన్నా లోకమందు
నెన్ని దుర్గుణముల వుండవలయుఁ దండ్రి యన్నియుండి
అన్నిటికిందల కట్టుగా నున్నదయ్య పట్టుదల
యన్నలా! నందమూర్నిలయ! విశ్వేశ్వరా! కులస్వామి! 51

పదికాదు మరి పది జన్మలను నేలఁబడవేసి యీాడ్వు
మది నీదు పదముల పట్టు వదలుట యన్నదిలేదు
వదరుట యొక్కటి యాపైన సంకెళ్ళవలెఁ గాళ్ళయందు
నదవద నందమూర్నిలయ! విశ్వేశ్వరా! కులస్వామి! 52

సరియెదో సామెత చెప్పుదురు సుమీ శని పట్టెనేని
పరగంగ నేడేండ్లు తాను పట్టినఁ బలునాలుగేండ్లు
పరమేశ! నను స్వీకరించి యీా పీడ వదలించుకొమ్ము
హరహరా! నందమూర్నిలయ! విశ్వేశ్వరా! కులస్వామి! 53

కడు బాధ తప్పెడు నొక యుపాయము కలదు చెప్పెదను
వడి వీనికిని ముక్తి యిత్తమన్నట్టి వగపు లేదేని
మృడ! జీవగతభవదూహ సంస్కారమిది తొలగింపు
మడలకు నందమూర్నిలయ! విశ్వేశ్వరా! కులస్వామి! 54

సడలును దానితోఁ పాటె మత్సర్య సంస్కారములును
వడి నీకు నేమి నష్టమ్ము చెడు నీకు బాధ నావలన
పెడచేను పండునంచుఁ దనదిమఁరగఁ బెట్టుకొందురటె
యడుగంట నందమూర్నిలయ! విశ్వేశ్వరా! కులస్వామి! 55

అవ్వారి గాగనై తనది దమ్మిడీ వ్యయము లేకుండ
నెవ్వారికో చెప్పిపెట్టుమన్నట్టు లిది సేగి కాదు
కవ్వివ్వన యిందిరియఁ పటలి సడలించుకో సాయపడుము
రవ్వంత నందమూర్నిలయ! విశ్వేశ్వరా! కులస్వామి! 56

నా భాగధేయమ్ము నాదు ప్రకృతియు నా తనూస్థితియు
ధీభారమై గ్రహాచార వశమని తెలిసికొన్నాను
ఈ భూమి యీ మిన్ను నాకోస మేకమైతిరో! హ
రా! భవ! నందమూర్నిలయ! విశ్వేశ్వరా! కులస్వామి! 57

చచ్చిపోయినవారిఁ గూర్చి యేమి యోజన చేసినాను
ఇచ్చట వార్లేక యేమి? యిచ్చట నేనుండి యేమి?
యిచ్చట నిది యంచుఁ దెలియుఁ దెలియరాదిచట నదేమొ
యచ్చట నందమూర్నిలయ! విశ్వేశ్వరా! కులస్వామి! 58

అదియెంత యూహ సేసినను చనిపోవు నా ప్రియులెందు
మెదలుదురో యేమియౌదురో యెఱుగమియె బిట్టు దుఃఖ
పదమయ్యె నవి రెండు కాక యజ్ఞానపథ మేద్పు పథము
నది యొండు నందమూర్నిలయ! విశ్వేశ్వరా! కులస్వామి! 59

వారి యీ దేహముతోడి యిచ్చటి భావి మా యందు
నేరీతి నారీతి లేదటంచు మా యీ దుఃఖ మభవ
వారి తద్భూతము గూర్చి మాకు సంబంధమ్ము లేద
యౌరౌర నందమూర్నిలయ! విశ్వేశ్వరా! కులస్వామి! 60

మరియెల్ల యిచటిదా బ్రదుకు మాకు సంబంధించి నంత
వరకును వృద్ధులై యపుడు చనిపోవవచ్చును, వలయుఁ
అరయ మా కభిమతమద్ది వట్టి దుఃఖాభావ మసలు
హారుసంబు నందమూర్నిలయ! విశ్వేశ్వరా! కులస్వామి! 61

వగవేని దొక్క డేమాట పుట్టిన ప్రతిజీవి ముసలి
యగుదాక నెట్టులో యటుల బ్రతికి తానపుడుచా నిమ్ము
ఒగిని బల్లెత్తుమాట నిను ననము నీ యూసెత్తుకోము
హర! నాథ! నందమూర్నిలయ! విశ్వేశ్వరా! కులస్వామి! 62

ఎవ్వఁడో జనియించు బ్రదుకు నెవ్వఁడో యెవ్వఁడో చచ్చు
నెవ్వఁడో యనుమాట తర్క నిర్ణయమిది ఋషిప్రోక్త
మవ్వల నివ్వల దాని కనుబంధమగు పొడిగింపు
లవ్వారి నందమూర్నిలయ విశ్వేశ్వరా! కులస్వామి! 63

మానసంబున నూహ చేసినకొలంది మరి యేమి లేద
కాని యోజించుట మానివేసినఁ గ్రమ్ము దుఃఖమ్ము
తానిది పశు లక్షణమ్ము పశుపతీ! దమియించు చిద్ఘ
నానంద నందమూర్నిలయ! విశ్వేశ్వరా! కులస్వామి! 64

ఇంకొక్కఁడు కలదు శైలపతి చమత్కృతి సృష్టిలోన
జంకి నిరంత యోజన పౌనర్వంగ సాధ్యంబుకాదు
వంకరటింకరల్ తెరువునంజను బండి యీ మేన
హంకేళి నందమూర్నిలయ! విశ్వేశ్వరా! కులస్వామి! 65

సర్వ మీలోకమే యయినవారికి, జగమున సగము
పర్విన వైరాగ్య మైనవారికిఁ, బడ దూహలందు
బర్వు తేలిక ఛాత్రి పీరలకు, సమపాళమ్ము వారి
కార్వగా నందమూర్నిలయ! విశ్వేశ్వరా! కులస్వామి! 66

ఏవానికో భవత్పాద జలజ సాహిత్య రమ్యంబు
భావంబు, పాపము! దేవా మిందిరీతు పరిణయమై యుండు
ఈవు కృపాదృష్టిఁ జూడకున్నచోఁ గృభరింబు వాని
కావల నందమూర్నిలయ! విశ్వేశ్వరా! కులస్వామి! 67

ఇది యేమొ తపమని నేను మరియు నీ వేమనుకొనెదొ
కొడువ నేఁ గాదని నీవ యవుననుకొన్నచో మేలె
కొదుకక నేనవుకొనియుఁ గాదనుకొన్నచో నీవు
నది వృథా నందమూర్నిలయ! విశ్వేశ్వరా! కులస్వామి! 68

ఎన్నివిధాలుగా జగము లోక సంస్కృతి బద్ధమగునొ
అన్నివిధాలు నింకన్ని విధములు నమరించినావు
నిన్నుఁ బొందగ నెంచు వానికింకన్ని, నీ పరియోగమ్ము
లన్నలా! నందమూర్నిలయ! విశ్వేశ్వరా! కులస్వామి! 69

నన్ను నీ వడిగిన, వాని వాని జన్మనుబట్టి యేరు
కొన్నట్టి దైవముల్ గాగ జనమేచి కొందురు నేను
చిన్నికొన్నెల తల చేరచుంగ్గైన శివు నేరికొంటి
నన్నాను నందమూర్నిలయ! విశ్వేశ్వరా! కులస్వామి! 70

ఎవడేరుకొన్న దైవమ్ము వానికి నీ విశ్వనాథు
డవుర! నీ పేరె విశ్వేశ్వరుండు నేనది పెట్టలేదు
ఎవడో మహాభిమాని యిడెనందునా! యే మహాఘంబు
రవులునో నందమూర్నిలయ! విశ్వేశ్వరా! కులస్వామి! 71

పంచభూతమ్ములు సూర్య చంద్రులు పరమ చైతన్య
మంచన నీ విశ్వమన్న దెల్ల నీ యాకార మిద్ది
పంచాస్త్రవైరి! విశ్వేశ్వరుఁడని యాపై నెవండు మన
నాంచిత! నందమూర్నిలయ! విశ్వేశ్వరా! కులస్వామి! 72

ఆ లక్షణంబు లెవ్వానికో కల వనేటది వేఱు
ఆ లక్షణంబులే యైన నీ వస్మ దారాధ్యమైతి
హాలాహల నిపాన సమయ వృత్త నాట్యారంభదోర్హ
ళా లింగ్య! నందమూర్నిలయ! విశ్వేశ్వరా! కులస్వామి! 73

రసవృత్తులము మేము నీవువచ్చి మా ప్రాంగణమ్మందు
వసియింప నడుగము విప్రలంభంబె వరము వాంఛితము
ముసరెడు శోకంబె మాకు నిద్ర, నీమూర్తి భావనయె
గ్రసనంబు నందమూర్నిలయ! విశ్వేశ్వరా! కులస్వామి! 74

చిక్కిన తనుయష్టి పాలిపోయిన చెక్కిళ్లు దప్పు
నెక్కొన్న చూపులు గలిగిన విరహిణీ జనులంద
మెక్కడో చూచితి నుండవలయునదెల్ల నాయందు
నక్కజైె నందమూర్నిలయ! విశ్వేశ్వరా! కులస్వామి! 75

తెలిసికోలేనిది నేను, తండ్రి నీ దివ్యమౌ తేజు
కెలనంబుగాద, యీ మనసుపెట్టెడు గిరిగింతలివ్వి
తెలిసికోలేకుండనుంటి గొంతులోఁ డెమడగాఁ జుట్టి
యలయించు నందమూర్నిలయ! విశ్వేశ్వరా! కులస్వామి! 76

నా తపంబుననుండి లేవవగ్నులు నలినాక్షమిత్రి!
శీతలంబులు లేచు మందమృదు మందశీకర వితతి
ప్రీతిరసారామ సంస్థితుఁ నిన్ను స్పృశియించు శార
దా తిథి! నందమూర్నిలయ! విశ్వేశ్వరా! కులస్వామి! 77

దిరిసెన చెట్టాకువోలెఁ బ్రతిరోజు తీక్ష్ణాంశు డస్త
గిరిమీఁద వ్రాలు నప్పటికి శిథిలతాకృతిఁ బొందుచుంటెఁ
బరమేశ! యీ గాలులెల్ల నీ ముద్రి పట్టునో సంజ
లరుదేర! నందమూర్నిలయ! విశ్వేశ్వరా! కులస్వామి! 78

ప్రభు! లోకమందు మోహమ్ము లేనట్టి వారిచే నేల
ప్రభవంబు నందింతు మరల లోకాన వడి మేలిమూదు
ప్రభువైన పొన్నారివోలె, మేలిమివలదు లోకాని
శభవుడా! నందమూర్నిలయ! విశ్వేశ్వరా! కులస్వామి! 79

కోసఫలమెల్ల నీ చేతిలోఁ బెట్టికొంటి వ్యాపార
మసమర్థుఁడగు నన్నుఁ జేయుమంటి నాకది చేతకాదు
కుసులేది యేటికి లాగ నేనది కోటికి లాగు
నసిశూల! నందమూర్నిలయ! విశ్వేశ్వరా! కులస్వామి! 80

నీవెదో నెత్తికిఁ దెచ్చినప్పుడు నిండైన దుఃఖ
భావంబు పొందుదుఁ గాని తరువాతఁ బరిసిపోయెడిని
జీవునకీ జగదల్ప సుఖబుద్ధి చెడదు మా స్వామి!
రావేమి నందమూర్నిలయ! విశ్వేశ్వరా! కులస్వామి! 81

ఎంతయా క్షణిక జీవితము చేసితి వీ మేలు కీళ్ళు
నంతలో సుఖములు నంతలోన దుఃఖావిలంబులును
అంతకంటె సుఖంబు లేద దుఃఖమ్ము లే దంతకంటెను స్మ
రాంతక నందమూర్నిలయ! విశ్వేశ్వరా! కులస్వామి! 82

మొదలును తుదలేని యట్టి దుఃఖంపు ముసురు లౌకికము
కదియింప నగుట, నీ సృష్టిచేయు లోకంబునలేదు
అది పిల్లిపిసరంత లౌకిక సుఖంబె యంత తీపి యిక
నదియెట్లు నందమూర్నిలయ! విశ్వేశ్వరా! కులస్వామి! 83

త్రొక్కిళ్ళుగా మారి మసంగియా యూరు తుడుచుకపోయెఁ
దక్కిన యూళ్ళవారలకుఁ బెద్ద వార్తగ నయ్యె నద్ది
యెక్కడి బ్రదుకన్న యూహ ఘటియిల్లనే ఘటియిల్ల
దక్కటా! నందమూర్నిలయ! విశ్వేశ్వరా! కులస్వామి! 84

ఒకబిడ్డ చనిపోయి యేడ్చుచుండె నింకొకబిడ్డ కింత
యొక యేదో గీరుకపోయి చిఱునెత్తు రుబుకగా, నెంత
వికలత, యారాటమెంత, యిది యెప్డు విడపోవరామి
ప్రకటమై నందమూర్నిలయ! విశ్వేశ్వరా! కులస్వామి! 85

పిల్లిపై నెలుకను నెలుక పైనను బిల్లిని బెట్టి
యెల్లకాలమ్మును బ్రదికి పిల్లిపై నెలుక నెక్కింపఁ
జెల్లమి నెక్కించిపెట్టుమంచు నీ సేవ చేయుటయు
నల్లరై నందమూర్నిలయ! విశ్వేశ్వరా! కులస్వామి! 86

ప్రసవబాణుని నీవు చంపఁగలవును బ్రదికింపఁగలవు
విసమును మెక్కఁగాఁగలవు తలమీఁద విధుఁ దాల్చఁగలవు
కిసరుగా, దానికి దీనికిని దేనికింగాక యురక
రసియింతు నందమూర్నిలయ విశ్వేశ్వరా! కులస్వామి! 87

తనకైన నెందుకుం బనికిరా నొక్కదానికిఁ దప్ప
కనకనలాడు నిప్పులను ద్రోయుము కాలెడు కట్టె
నినుస్మరించుట మాత్రముడుగదు నీ యిష్టమేమి
యనఁబోను నందమూర్నిలయ! విశ్వేశ్వరా! కులస్వామి! 88

నన్ను నీవు గ్రహింప వేను చనిపోయి నా జీవమచట
మిన్నులో హరహరా! శివ! మహాదేవ! మృడ! శంభు! కటక్ష
వున్నాగ! శంకరా! యంచుఁదిరుగుళ్ళ పొందుచుండుఁ
బ్రిన్నన నందమూర్నిలయ! విశ్వేశ్వరా! కులస్వామి! 89

అకట! సదా కోటి జీవులందున నభవ నేననుచు
నొకడ నున్నానని యేమి యజ నీకు నురగకేయూర!
కొకిబికి నడకలై యెన్ని చొచ్చును గోళ్ళబ్ధిలోన
నకృతులు నందమూర్నిలయ! విశ్వేశ్వరా! కులస్వామి! 90

కవ్వడి యంతవానికని బోయలు క్రిమ్మినవేళ
నవ్వారి నొక్క యస్త్రముస్ఫురించలే దటుగాక మృత్యు
వొవ్వమిరా నీదు స్ఫురణ ఘటియించకుండఁ జేయకు వె
యవ్వల నందమూర్నిలయ! విశ్వేశ్వరా! కులస్వామి! 91

మనసులోపలఁ బాలు త్రావునప్పుడు మరి వెండిగిన్న
పనియేమి పైడి గిన్నెయె ఘటింతును బ్రహ్మ భావనయె
నినుగూర్చి చేసెద మౌళి జాబిల్లి నెమిలి పించియము
లనియేల నందమూర్నిలయ! విశ్వేశ్వరా! కులస్వామి! 92

అయయొ తేలికగఁ జంపుటకు నున్న వెన్నైన మార్గములు
దయలేక యొక్కొక్క ముక్కగా బ్రతిరోజు తరుగుటయేల
వియదగ్రి కోటికోటీర! ప్రాణాలు విరియవు విరియు
నయమూల నందమూర్నిలయ! విశ్వేశ్వరా! కులస్వామి! 93

బొట్టు కాటుక పెట్టి నీవు పిలిచిన పోలుపేమి లేదు
పట్టి నాయంత నే నిన్నుఁ బట్టుక ప్రాకులాడెదన
యిట్టి నా సరిగ పొమ్మన్నఁ జేసెడి దేనియు లేద
రట్టును నందమూర్నిలయ! విశ్వేశ్వరా! కులస్వామి! 94

ఒడలెల్ల నమలుచునుండెఁ గమలుచునుండెఁ బ్రాణములు
గడితప్పి కుములుచు నుండె జీవంబు కాలకూట గళ!
వడదెబ్బ తగిలినట్లుగను నా యున్కి వాడిపోయెడిని
యడుగడ్గు నందమూర్నిలయ! విశ్వేశ్వరా! కులస్వామి! 95

ఒదిగియుండి యెటేని మనుచు వద్దు మొఱ్ఱోయన్న నీవు
నిది తీసికొనక తప్పదని బలవంత మేలరా యన్న!
వదలించుమిీా జన్మబాధ హర! నీకుఁ బదివేలు జోత
లడనున నందమూర్నిలయ! విశ్వేశ్వరా! కులస్వామి! 96

మాట దురుసుచేసినావు చేసితి మనసు మెత్తనగ
బాట తప్పించితి బ్రిదుకు, పుట్టెడు ప్రతిభ నిచ్చితివి
కోటి శత్రుల గూర్చినావు కూర్చుంటి గుండియలోన
నాటగా నందమూర్నిలయ! విశ్వేశ్వరా! కులస్వామి! 97

గుండిగ సిద్ధముగాగ నున్నది కూర్చుండ రమ్మి
వండి వార్చితిమి నీకోసమే దొరా వడ్డించినాము
మొండి! పోరా! యనఁబోకువే! నీదు పుణ్యమాయెను. పి
యాండారి! నందమూర్నిలయ! విశ్వేశ్వరా! కులస్వామి! 98

చిన్నతంగెడు చెట్టువోలిక సమూలసేవ్యుడ వీవు
చెన్నగు మూలంబు వదలి యాకులు సేవింపనేల
పొన్నకాయ విధాన జనుడు నును పెక్కఁ బో దాదిరోగ
మన్నది నందమూర్నిలయ! విశ్వేశ్వరా! కులస్వామి! 99

గుండెలో లింగమై నీవు స్వామివై కూర్చుండినావు
దండిగాఁ గనుమాయ నెదుట హరివయి తారాడినావు
పండె మీ తత్త్వము నాకు ఫలియించెఁ బాటిత పద్మ
జాండ! శ్రీనందమూర్నిలయ! విశ్వేశ్వరా! కులస్వామి! 100

ఇంతటి వ్యర్థమైనట్టి దేహమ్ము నిచ్చి, నానోగ్రి
సంతాపములతోడ నేను బ్రిదికి నీ సన్నిధిఁ జేర
నంత తపంబు సేయంగనైన నీ యాజ్ఞ నా యాత్మ
ప్రాంతమా! నందమూర్నిలయ! విశ్వేశ్వరా! కులస్వామి! 101

# విశ్వనాథ మధ్యాక్కఱలు

# శేషాద్రి శతకము

శ్రీపయోధర సమాశ్లేష రేఖా పరిమళామృతధు
నీ పోషితాశ్రిత క్షేత్రభూత, మనీషార్ద్రవలయ
పాలితస్వీయభూధరశిఖాక సద్భక్తభావ కల
కర్పూర మలయజా వేంకటేశ్వరా! శేషాద్రి నిలయ! 1

పదియేడులును రాకమున్నె నన్ను నీ పర్వతంబులకు
కదలించుకొని వచ్చినాడు మా తండ్రి కన్నాను నాడె
అది మొదల్ నీవు నా గుండె పూమొక్క కధికారివౌచు
చిదుముకుంటివి పూలు వేంకటేశ్వరా! శేషాద్రి నిలయ! 2

కున్నతై జనము శుక్తిమతిలోపల గులకరాళ్ళేరు
కొన్నట్లు వ్యాధులు పాపికోను-నీ కొండకు వత్తు
రన్నలా! జని మృతి యాధి పాపికో నరుదేర రెంత
చిన్నారి బుద్ధులు వేంకటేశ్వరా! శేషాద్రి నిలయ! ౩

వేనికిఁబుట్టిన బిడ్డరా వెక్కి వెక్కి యేడ్చెడిని
నానాప్త లోకమ్ము కోర్కులను ఆమ్మునం గట్టికొని, ర
మానాథ! యీడుచున్నావు గాన సంబరము సాగు, నత
సీ నటత్సవమాంగ! వేంకటేశ్వరా! శేషాద్రి నిలయ! 4

నీకన్న మాయానాథు వేఱొక్కనిం జూపుమయ్యా
లోకంబులోని మానవుల కోరికలు ఘటించుటకు నె
యాకృతినూనిన యట్టులుంటి మోక్షాశ రానీక
నేకొని పనిగాగ వేంకటేశ్వరా! శేషాద్రి నిలయ! 5

శివునకు నీకును నేను భేదంబు చేసితి నేని
తవులు నా పాపాన నాదు నాయువు తగ్గునుగాక
శివుఁడు శివుఁడటంచు నీవు నీవంచుఁ జిత్తాన నాకు
సివమెత్తఁ బోదయ్య! వేంకటేశ్వరా! శేషాద్రినిలయ! 6

నా హృదంతరమందు మాయ కప్పియున్నది యది దాని
బాహిరింపింపగా మిమ్ము నిద్దఱఁ బ్రార్థించుచుంటి
శ్రీహరీ! వీరెక్కువంచు ననుసంత చేఁయే లేదు
సేవకునకు న్నాకు వేంకటేశ్వరా! శేషాద్రి నిలయ! 7

కొన్ని వాక్యంబుల నిన్ను, నాయనఁ గొన్ని వాక్యములఁ
గొన్నింట నన్నును విడిచివిడిచి యెక్కువఁగాఁగఁ జెప్పి
యున్న వేదముల తాత్పర్యమో స్వామి! యొగి మీరునన్నుఁ
జిన్నపుచ్చగరాని వేంకటేశ్వరా! శేషాద్రి నిలయ! 8

ఏది కవ్వడికినిఁ జెప్పినావో మున్నెప్పుడో మనువు
నాది చెప్పితి నంటిగాదె యప్పుడె ట్లున్నావు, మూర్తి
వాదంబు లేదిందు నీద్వైత పరమాత్మ వాదంబు గాక
శ్రీ దీప్తి జలరాశి వేంకటేశ్వరా! శేషాద్రి నిలయ 9

పరమ వైష్ణవ మూర్తులగుచు వైకుంఠ పురమున నున్న
నిరత జీవులను గాదనుట కాదిది నేను నా త్రోవ
నరణి నీకును విన్నవించు కొనుచుంటి జాలి క్రొంజదుల
సిరి వరగింపవే వేంకటేశ్వరా! శేషాద్రి నిలయ! 10

మీరు జగంబు పైన నధికారులు. మిమ్ముఁ గాదనుట
యేరీతి నాకధికార మక్కఱయే లేదు నేను
కోరిన నది రాద కోట్లు వత్సరాల్ కూర్చుండి తపము
చేరి చేయను లేద వేంకటేశ్వరా! శేషాద్రి నిలయ! 11

ఫల దాతలను మిమ్ముఁ గాదనంగ వ్యాపారమ్ము వదల
వలఁతినో దానికే గోల మీరు కృపాదృష్టిఁ జూడ
వలయున యిట్టి వ్యాపార భావ మావలఁ బెట్టి నాకు
సిలుగులు పాపవే! వేంకటేశ్వరా! శేషాద్రి నిలయ! 12

ఏ పేరు పెట్టిన నేమి యది యది యేకదా! నామ
రూపాలు తమ కనురూపమైనట్లు రూపించుకొందురి
ఆపేరు మొదలైనవి వ్యవహార సమానన్నములవి
శ్రీపతీ కరుణింపు వేంకటేశ్వరా! శేషాద్రి నిలయ! 13

మృతి కల్గు నన్న దానికి భయంపడ నేనింతయైన,
మృతి వేళలో భయంపడుదునో యన్నదే భయంబయ్యె
మృతియెన్ని పూర్వ జన్మముల యందునయ్యె నోయలవాటు
శ్రితరక్ష! కాలేదా! వేంకటేశ్వరా! శేషాద్రి నిలయ! 14

బ్రతుకు కెట్లో యన్న యట్టిదే సర్వ భయము లోకమున
నది మృతి గల్గునో యన్న భీతికే యన్యమౌ పేరు
ఇది భీతి యొక్క తత్వంబు లేదు నాకిది యనరాదె
శ్రితరక్ష! యేమందు వేంకటేశ్వరా! శేషాద్రి నిలయ! 15

ఒక పెద్దపులియు నోరెత్తి ఱచి వచ్చినదొక పెద్ద పాము
ప్రకటితంబుగ నష్టమైన దేమియా భయము జీవనము
నకు భంగమైన దన్నదియ మృత్యువన్నదియ నాకిట్టి
సెకలు తూలించవే వేంకటేశ్వరా! శేషాద్రి నిలయ! 16

ఏదయెల్లైన దానద్ది యట్లు కానిమ్మన్న ధైర్య
మూది యుంటిన మృతిఁ గూర్చి యట్టులే యుంటిన కాని
లోదిగుల్ కలద యావేశకున్ మదిలోలమై చనునో
శ్రీదార! యంచును వేంకటేశ్వరా! శేషాద్రి నిలయ! 17

ఆవేళకుఁ నీకు కరుణ లేక యిల్లైన నిశ్చయము
భావంబునన్ నిల్ప త్రొక్కికొనలేకఁ బ్రమసితి నేని
తావృథా యిదియెల్ల వట్టి సంస్కారతకుఁ గూడఁగాదొ
శ్రీ వేంకటేశ్వరా! వేంకటేశ్వరా! శేషాద్రి నిలయ! 18

జీవుడీ మేనిలో గర్భమునఁ బ్రవేశించెడు వేళ
నో విభూ యెంతటి దా సుఖము నందెనో యిందునుండి
పోవు వేళకు నంతయైన దుఃఖము పొందగా నిన్ను
సేవించు టెఱుఁగక వేంకటేశ్వరా! శేషాద్రి నిలయ! 19

ఈ భీతిని గురించి యింత బిట్టుగా నెందుకు భావ
నాభరంబుగ నూహ సేయుచుంటి వన్న లోకమంద
హో భీతి చనిపోవు వారి కన్నుల నొప్పునవధిగ
శ్రీ భోగ సంవాస వేంకటేశ్వరా! శేషాద్రి నిలయ! 20

లక్ష చెప్పుము వేయి చెప్పు మొక్క వేళకు లోన బరమ
భక్తిక భావంబు నిముసమైనఁగన్పించదు నాకు
దక్షత నాల్కకుఁ గలదు వేయిపద్యంబులు వ్రాతు
శిక్షింపు నన్నును వేంకటేశ్వరా! శేషాద్రి నిలయ! 21

పుట్టిన నాఁడెట్లో యివ్వి యిపుడట్లె మోహ భావములు
తుప్పటిలు కట్టైను పిచ్చి కుదిరెను రోకలి తలకుఁ
జుట్టు మన్నట్లున్న దన్ని వదలితి నుంత పాలింపు
చిట్ట చివరి నాళ్లు వేంకటేశ్వరా! శేషాద్రి నిలయ! 22

తెరవాటుకాఁడుగా నింద్రియంబుల తెరువుల నన్నుఁ
దిరిగించి కత్తుకపైన గండ కత్తెర తెచ్చి పెట్టి
యిరుకునఁబెట్టెను నేను కోరినట్టిది జీవనంబు
సిరి జతగాఁ జేసి. వేంకటేశ్వరా! శేషాద్రి నిలయ! 23

ఈ నట్టయడవిలో నిల్లు కట్టించి హింస్ర మృగాళి
ప్రాణముల్ తీసినఁదీయనిమ్మన్న పాళ్ళమైనట్టి
జ్ఞానముండినను గుండేటికైనను జంపనేవలయు
జేనెడు పొట్టకై వేంకటేశ్వరా! శేషాద్రి నిలయ! 24

పైకిని దీయఁగా బ్రహ్మహత్యయుఁబరగ గోహత్య
చేకొని క్రిందికిఁ దీయఁగా నట్లు చేసితి బ్రదుకు
మూక భావము తాల్ప నాత్మ హత్య యిమ్మగవద్ది నీవు
నేకొందు ముక్తిగా వేంకటేశ్వరా! శేషాద్రి నిలయ! 25

ఇది గుండె వింధ్యాద్రి వోలె గగనాని కెగసి గ్రహాళి
కదలనీయక సూర్యకాంతి చిఱుతలా కాల్వల చినుకు
మెదలనీయద కుంభసంభవత, దీని మిట్టి పాటీవు
చిదుమగా నే వలె వేంకటేశ్వరా! శేషాద్రి నిలయ! 26

పుట్టెను బుట్టిన బుద్ధి పోవును బుడతల నంద్రు
కట్టివేల్పా! జన్మ జన్మకుం బుడతలదాఁక సల్లై
తొట్టి తొట్టిగనె యుండెడిని నీ దయతో చెడుదాఁక
చిట్టు ముట్టాడకు వేంకటేశ్వరా! శేషాద్రి నిలయ! 27

ప్రవహించు కాలువ నైనచో నెండవచ్చును స్వామి!
తవిలి గుండముపడి నీళ్లు నిలచెను తాడిలోఁతునను
యపుర సహస్రార్క తేజ! జాలి నీవార్పు నేవలయుఁ
జివరి పంకము తోడ వేంకటేశ్వరా! శేషాద్రి నిలయ! 28

నొచ్చుదు విచ్చుదు తలతిరిగి ముద్దనోటి లోనికిని
వచ్చుచు నున్నది యే పనిం జేయవలసి వచ్చినను
కచ్చె పూనిన యట్లుగాఁగ స్వామి నీకై గాదనియేమి
చిచ్చుమ్రింగుచునుంటి వేంకటేశ్వరా! శేషాద్రినిలయ! 29

నీ పరమ కృపచే నాల్గువ్రేళ్లు లోనికిఁ బోవుచున్న
వీ పది పదునేను వత్సరాలుగా నిప్పటి కరువ
దై దైన గడచె న్యాసంబు గననో సన్యాసంబు గననో
శ్రీపతీ! నీదయ వేంకటేశ్వరా! శేషాద్రి నిలయ! 30

ఇన్ని యుగాలుగా నిన్ని దేశాల నిన్ని గ్రామముల
నున్న యీ మానవుల్ పుట్టుచుం జచ్చుచున్నార యెందు
కన్నచో నెందుకో తెలియదాయె నీదైన యీగుట్టు
చిన్నమెత్తెఱుఁగను వేంకటేశ్వరా! శేషాద్రి నిలయ! 31

తాను పరమ మోహి, ఎరులకన్నట్లు తాపత్రయంబు
పూని యిచ్చటి యున్కి నిత్యమంచొల్కఁ బోసుక త్రావ
గానైన పేరాసయేఁచగా నైహికము నిత్యమంచుఁ
జీని తగవులేవు వేంకటేశ్వరా! శేషాద్రి నిలయ! 32

కానరానట్టి రోగంబు త్రిప్పకోఁ గలిగిన యట్టు
లేను లేదిది బుద్ధి నిల్వమిని మందు లిముడవు కరుణ
యైన యట్టిచటకాగాఁగ మాన్పిన నది నీవు మాన్ప
చేను వండించు కో వేంకటేశ్వరా! శేషాద్రి నిలయ! 33

ఒగిసి తనువున కోకోర్క యప్పుడోకోర్క భోగమ్ము
తగిలించుచుంటి నా మేను శిలవోలెఁ దనరారుచుండె
తగులదు మిగులదు నుంత సుఖము నా తనువున యంతు
సెగలే దిగములేదు వేంకటేశ్వరా! శేషాద్రి నిలయ! 34

ఒక్క విద్యలయందు సుఖము పొందుట యుడుగదు నాకు
తక్కిన వన్నియు నంతయును నన్నుఁ దాఁకుట లేదు
అక్కటా! యీ విద్యలెల్ల నీ దరహాసముల్ కానఁ
జిక్కితి వీనికి వేంకటేశ్వరా! శేషాద్రి నిలయ! 35

చచ్చిన వెల్లఁదొల్లింటి కోర్కులు చావ వా రెండు
చచ్చి యేమీ మరి చావ కేమి యీ చచ్చు కోరికలు
మచ్చు చల్లుట కేమొ నన్ను మురిపించి మరపించుటేమొ
చిచ్చు చూపించవే వేంకటేశ్వరా! శేషాద్రి నిలయ! 36

రెక్కని సాగించుచున్న యట్టి యీ సృష్టి సంకల్ప
మొక్కటి కారణహీనమై తోచుచున్నది స్వామి!
పక్క వాటేగెదు కార్యకారణ భావమ్మునకును
చిక్కనిమార్గాన వేంకటేశ్వరా! శేషాద్రి నిలయ! 37

ఇన్నాళ్ళు వెక్కిరింపులుగఁ జూచితి విష్ణుఁడు జాలి
కొన్నట్లు చూచుచునుంటి నావంక గురవమై స్వామి!
పన్నుగాఁ దుదకు రక్షింతువని యాశపడుచుంటి నన్నుఁ
జిన్నబుచ్చకువె శ్రీ వేంకటేశ్వరా! శేషాద్రి నిలయ! 38

వేదధర్మమ్ములు దొంగిలించిన విధముగా నుంటి
నీదుచున్నాను మోహాబ్ధిలోపల నెడ పెడగాఁగ
నాది మత్స్యాకృతి వగుచు నో స్వామి యరుదెంచినన్ను
ఛేదింపవలయున వేంకటేశ్వరా! శేషాద్రి నిలయ! 39

దిగఁబడి పోవుచున్నాను మోహావార్ధి యధఃప్రదేశ
ముగ మట్టమున నుండి యుబుకు బుడగలై బునబుసలగుచు
బిగువైన నీవీపుడిప్ప కీలించి పెకలింపఁ జూడు
చిగురుమెత్తని కృప వేంకటేశ్వరా! శేషాద్రి నిలయ! 40

మంటి భావంబులు మింటి భావముల్ మధియింపఁబడుచుఁ
గంటి హాలహాలంబు కష్ట దుఃఖ నికాయంబునఁదెఱ
గంటిచానలు కృతుల్ కల్పవృక్షంబు జ్ఞానామృతంపు
ఝంటి పూయింపవే వేంకటేశ్వరా! శేషాద్రి నిలయ! 41

నేల సర్వంబును జాపఁగాఁజుట్టి నెత్తిన పెట్టు
కోలేక కాని యా ఆస యెద తెచ్చికోలేక కాదు
వీలని చీఁకటి మబ్బు కోర్కుల వెక్కసంబైన
సీల వదల్పవే వేంకటేశ్వరా! శేషాద్రి నిలయ! 42

ఇమ్మెయి యీ సృష్టి సూర్యచంద్రులు నీ కాలమును న
ఘమ్ము పుణ్యంబును వేదధర్మముల్ కానట్టి యిరులు
క్రమ్మిన ప్రళయాబ్ధిలోనఁ జొచ్చితిఁ గోఱవాటుగను
జిమ్మవే నన్నును వేంకటేశ్వరా! శేషాద్రి నిలయ! 43

దాహమ్ము తుదలేని గుండె చెర్వులో దరిదిబ్బలందు
నా హృదయంబు నం గానిపించు చున్నాడు పిక్కటిలి
మోహాభావంబులన్ తుంగము స్తైల ముట్టెఁ ద్రోచుచును
శ్రీహరి కిటిరాజు వేంకటేశ్వరా! శేషాద్రి నిలయ! 44

గుండెలోఁ బ్రేవులుతీయు మాట నిక్కవము నీయందు
మెండుగా సార్థక్యమైనమాట స్వామీ! నారసింహా!
గుండెతోఁ బ్రోవులువడ్డ మోహంబు గూళ్ళనుగూడఁ
జెండవే దయపేర్మి వేంకటేశ్వరా! శేషాద్రి నిలయ! 45

నీవు లేవన లేవటంచు వాదించు నిర్భయ దైత్య
భావంబె మేలనిపించు నీవు కన్పడుట నిశ్చయము
భావించి యున్నావటంచు మేమేమి బావుకొన్నాము
సేవోరుమతి దక్క వేంకటేశ్వరా! శేషాద్రి నిలయ! 46

ఎంచి నీ విట్టులుందువని యంచును నిచ్చోటనుందు
వంచును నియమంబు లేనియపుడు లేవనినఁ దప్పేమి
వంచన యెవరికి? కొలువులోని కంబము చీల్చి గుండె
చించిరా నీ పని వేంకటేశ్వరా! శేషాద్రి నిలయ! 47

ఐదేండ్ల పసివాని వెన్కవేసుక యసుర లోకేశు
పాదులు పెల్లగించితివి మరియు నిన్ బట్టి పుత్రికులు
వాదనే వాదన తండ్రి నెదిరింపవచ్చును పాడి
చేదుకో వచ్చును వేంకటేశ్వరా! శేషాద్రి నిలయ! 48

మొట్టమొదట బలిదైత్యు యాచింపఁబోయినవేళ
బొట్టనవేలంత లేవు తెగ నుబ్బిపోయితి మిన్ను
పట్టక దాత యనంగ నొక్కడే బలి, పీలమొక్కఁ
జెట్టుచేసెను నిన్ను వేంకటేశ్వరా! శేషాద్రి నిలయ! 49

ఔను దానమ్మది నీవు చెప్పినయట్టి వేదముల
లోనిదేగద, ధర్మమద్ది చేయుట లోపమైపోయెఁ
బూని నీ కిటుకేమొ సుంత తెలియగఁ బోవదు మాకి
సీ! నీకుఁ దెలియదో వేంకటేశ్వరా! శేషాద్రి నిలయ! 50

జన్మముల్ ధ్వంసము సేయలేదు తా జన్మముల్ సేసె
నిన్నుఁగాదన్నది లేదు బలిదైత్యు, నీవేల మిన్ను
మన్ను కాకుండఁ జేసితివి ధర్మపు మతిలేదు సురల
చెన్ను పాలింతువో వేంకటేశ్వరా! శేషాద్రి నిలయ! 51

నిన్నుఁ బొమ్మనలేదు బలియుఁ బ్రహ్లాదుని మనుమడతడు
నిన్నును దన తాతముల్లియ యనుకొనెన్ మొగమాట
మన్నది నీకు లేదని యెఱుంగడ యన్నాఁడు నిన్నుఁ
జిన్నపుచ్చఁగనేల వేంకటేశ్వరా! శేషాద్రి నిలయ! 52

ముల్లోకములలోన నిండియుండి యెప్పుడు తృప్తిలేక
ముల్లోకముల బైటగూడ మరి నిండిపోవు పేరాస
చెల్లించుకొనఁగాక యేమి బలిచేసెఁ జేసినదీవు
చిల్లర యూహను వేంకటేశ్వరా! శేషాద్రి నిలయ! 53

బ్రాహ్మణజాతి సత్త్వంబుమాని దుర్జన వృత్తులగుచును
బ్రహ్మ బంధువులాట కీవ యంకురార్పణ చేసినావు
బ్రాహ్మపథేతర వృత్తముంబూని భార్గవరామ!
జిహ్మచరణధామ! వేంకటేశ్వరా! శేషాద్రి నిలయ! 54

వాఁడెవఁడో తప్పుచేసె నది వాని వర్ణమందఱను
గాడినపెట్టి నరుకను నిజముగాఁ గారణమగున
త్రోడు తల్లియుఁగాని నీకుఁ బెఱలైనఁ ద్రుంచివేయుదువు
చీడ పట్టినచోట వేంకటేశ్వరా! శేషాద్రి నిలయ! 55

అండజపతివాహ! మధ్యమధ్య నీ కావేశమెత్తు
చుండున యప్పుడు, సుంత తరువాత, నున్నవారికిని
పండిన పంట, యీ నడుమ మనియెడివారి దుర్జనులు
చెందుచున్నారయ్య! వేంకటేశ్వరా! శేషాద్రి నిలయ! 56

అవుర! నీ భార్గవ రాముఁడైనట్టి యవతార మొక్క-
డు విశిష్టతం దాల్చి యుండె నొక్కొక్కఁడు కుజనుడైన
రివరివకేమి? యొక్కొక్క వర్ణమారీతి పేరెత్తి
సివమెత్తుట భరంబు వేంకటేశ్వరా! శేషాద్రి నిలయ! 57

జపహోమ మంత్రాది నియమ సమితి నిన్ సాధింపనైన
విపులత లేని నీ కొన్ని యవతార విభవముల్ కలవ
యెపుడుఁ జెప్పక తప్పదాయె నిఁక జెప్పుచీ వీనిగూడఁ
జెప్పుమ యీ మర్మంబు వేంకటేశ్వరా! శేషాద్రినిలయ! 58

గొడ్డలిపూని తిరుగరు సమిధలకోస మెవ్వరును
గొడ్డలియెందు కెవ్వరినొ నరుకుటకోసమే కాదె
దొడ్డబుద్ధి యనాదిది కృతవీర్యుడు దొరికెఁ జెడ్డకును
జెడ్డ యేమున్నది వేంకటేశ్వరా! శేషాద్రి నిలయ! 59

ఎన్న నిన్ నీవయెఱుఁగని యవతారమెత్త నెంచితివి
నిన్ను నీ వెఱిఁగిన దానికన్నఁ బండితి రామచంద్ర
సన్నుతమూర్తిగా నింకఁ బదియెత్తు స్వామి! శ్రీరాము
చిన్నెలు తేలేవు వేంకటేశ్వరా! శేషాద్రి నిలయ! 60

అచ్చమైనట్టి సాత్త్వికపు మర్యాదయై నట్టివాడు
అచ్చమౌ గుండెకు మిక్కిలిగ దగ్గరైనట్టివాడు
పచ్చని మైదాలువాడు శ్రీరామ భద్రుడై నీవు
చెచ్చెర రావయ్య వేంకటేశ్వరా! శేషాద్రి నిలయ! 61

సకల వేదమ్ములు నుపనిషత్తులు సకలాగమములు
నొకయెత్తు,నాస్వామి! రామ యనునామ మొకయెత్తు,రత్న
శకలమ్ము రఘుపతి, చీఁకటి నెఱుక చాలమియును ని
శికిఁ జందమామ శ్రీవేంకటేశ్వరా! శేషాద్రి నిలయ! 62

బుజమున విల్లున్న నందమును గొల్చిపోసెడు స్వామి!
నిజమున కప్పీయఁ గలుగు తత్త్వాంబునిధి రఘుపతియు-
రజనిపతి మనోజ్ఞ వదనుడు, వసంత రమ్యాకృతి, మన
సిజ రమ్యతరమూర్తి వేంకటేశ్వరా! శేషాద్రి నిలయ! 63

ఎన్ని మహాయుగంబుల తపస్సు వ్యయించితో రాము
డన్నట్టి యవతారము పడయ నఖండమైన కాలమ్ము
జన్నియావై పిండు పాలజున్నైన చక్కని రాము
చెన్ను వహించితి వేంకటేశ్వరా! శేషాద్రి నిలయ! 64

మనుజులీరీతిగా నడువవలయు నన్మాటలు చెప్ప
మనుజులు లక్షలు కోట్లు నడిచిన మనిసి నడ్పించు
మనిసి లేడొక్క శ్రీరాఘవుడు తక్క మహితమగా సృష్టిఁ
జిననాటినుండియు వేంకటేశ్వరా! శేషాద్రి నిలయ! 65

మానవజాతి కంతకును నవ దీపమణియైన రాము
డైనావు రాముడుఁ బరమనాగరు డచ్చమగా మనిసి
వాని మేలిమిచూపి సరకు విడుదల వరతువీ సృష్టి
శ్రీ నీరజాతాక్ష వేంకటేశ్వరా! శేషాద్రి నిలయ! 66

నూఱు తప్పులు సైచవచ్చును నూటిపై నొకటి
యోరువరాదేమి? యోర్చుకొన్నచో నోర్వనువచ్చు
నూరేమి పదివేలు, నందులోన, ననుఁగు మేనమఱఁది
శ్రీ రమాపతి కృష్ణ వేంకటేశ్వరా! శేషాద్రి నిలయ! 67

పళ్లెమ్ము విసరిన గొంతు నరుకగాఁ బడుట చిత్రమ్ము
పళ్లెమ్ముఁ జేయించితట్లు దీనికై ప్రత్యేకముగను
తుళ్లి భారత యుద్ధమునకు నాంది నెత్తురు చేసినావు
చిళ్ళలా మతితోడ వేంకటేశ్వరా! శేషాద్రి నిలయ! 68

మొదట నిద్దఱికయి రెండు నవతారములు, పైననొకటి
తుదకును శిశుపాల దంతవక్త్రులఁ దునుమనే కాద
యుదయించినది దైత్యశక్తి పలుచనై యుడిగి నీవల్లె
చిదుముచున్న కొలంది వేంకటేశ్వరా! శేషాద్రి నిలయ! 69

ఒక్క దాసికి మై కొంకిబికి సరిచేయుటొక గొప్పగాదు
కక్కసించిన సుయోధనుని మనసు వంకర తీర్చలేదె
ఒక్కడా! నావెద వేయిమంది దుర్యోధనుల్ కలరు
చిక్కించుకోరాదె వేంకటేశ్వరా! శేషాద్రి నిలయ! 70

వేరికిజూపి ప్రయోజనము లేదో విశ్వరూపంబు
వారికిఁ జూపితి కౌరవ సభలో భయపడినట్లు
ఔరా! పరమ నిష్ప్రయోజనమ్ముగ నాచరించుటను
జేరి క్రొత్తయె లేద వేంకటేశ్వరా! శేషాద్రి నిలయ! 71

కాయ మొదలో విత్తు మొదలో యనుప్రశ్నగానైన సృష్టి
కే యాదిలేదు నీకువలె, భేదమో యిది ఖండఖండ
మాయె నఖండమౌ జ్యోతివీవు నీవా సంతఁజేసి
శ్రీయుతుడైనావు వేంకటేశ్వరా! శేషాద్రి నిలయ! 72

ఎత్తక తప్పక చేసి జన్మరాహిత్యంబు గీత
లోఁజెప్పితి తొల్త జన్మలే యెత్తకుండఁగఁ జేయ
వొత్తి యేడ్పించి లాలించు లక్షణమో నాగ నీకు
చిత్తమ్ము సాగించు వేంకటేశ్వరా! శేషాద్రి నిలయ! 73

ఆయన కొంపయు గోడి నాగలి యాయన గోల
యాయన పడుచుండ మోసికొంచు నేలంతయు నీవు
రాయిడిలేకుండ లోక మెన్నికల్ రాజ్యాలు బెట్టు
చేయుచునుంటివి వేంకటేశ్వరా! శేషాద్రి నిలయ! 74

మానసమును సృష్టిచేయు నజు తెల్విమాట చెప్పవలెఁ
గాని నీ దేమున్నది యజకృతమనః కల్పనమంది
పూని త్రిపురవైరి యొక్క పనిమీద బుద్ధుండవైతి
శ్రీ నీరధి శయాన! వేంకటేశ్వరా! శేషాద్రి నిలయ! 75

ఈ సృష్టియంతయుఁ జూడ నొకయెత్తు నీ మనో వికృతి
భాసంబును వివేకమంచు వెలయించు పని యొకయెత్తు
దాసాత్వికమ్ము లన్యములు బుద్ధావతారమ్ము మనసు
చేసిన కల్పన వేంకటేశ్వరా! శేషాద్రి నిలయ! 76

నీవు లేవని చెప్ప నన్ని వాదనల్ నేర్వంగవలయు
నీవె నేర్పితి వన్ని వెదకికొన్నైన నీతియే లేక
ఆ వేదము ప్రమాణమంటి మరలఁగాదంటి బుద్ధుఁడయి
సేవానభిముఖుడ శ్రీ వేంకటేశ్వరా! శేషాద్రి నిలయ! 77

యుగములుగఁ దపస్సుచేయు వారలకే దిక్కు లేదు
పగళులు పది కన్నుమూసి నీవు కన్పడవంచు లేచి
తెగఁబడి నీవు లేవన్నఁ దనవెంట దిగినారు జనము
సిగలు కత్తెర వెట్టి వేంకటేశ్వరా! శేషాద్రి నిలయ! 78

తెలివిమాలినవారి సంఖ్య యెంత వృద్ధిపొనర్తు వంత
పలుకఁగ కూర్చుండవచ్చు నంతయుఁ బని లేకయుండ
నలఘ సౌఖ్యము చూచికొంటి నాస్తికశూరుఁడై జనుల
సిలుగులకేమిలే వేంకటేశ్వరా! శేషాద్రి నిలయ! 79

సామాన్య మనుజ ధర్మములు మాలిన జనసంఘమునకు
సామాన్య మనుజ ధర్మములు చెప్పిన జనుఁడేఁ దైవమ్ము
సామాన్య ధర్మముల్ వార లాచరించరు కాని గొప్ప
శ్రీ మహితో నుండె వేంకటేశ్వరా! శేషాద్రి నిలయ! 80

ఎత్తక యెత్తక నేటికీ జన్మ యెత్తితిమాయెఁ
గత్తిరింపులుగ ధర్మమ్ము పేర సుఖంబులు సాగు
నెత్తకము న్నెట్లొ అల్లె కారాదొ యెత్తి యేమిటికిఁ
జిత్తొట యందురో వేంకటేశ్వరా! శేషాద్రి నిలయ! 81

ఎన్నిమతాలైనఁగాని మింటిలో నేమానటన్న
దెన్నగా నిప్పుడే అక్కడెక్కడో యేమియు లేద!
మన్నులో నెంత మొగ్గయినఁ దానంత మతముల గొప్ప
చిన్నారి బుద్ధుడా! వేంకటేశ్వరా! శేషాద్రి నిలయ! 82

పరమును నిహమును గలిపిచేసిన భావన వేఱు
పరమును వదలి యిహమ్ముఁగూర్చిన భావన వేఱు
పరుఁడవు నీవయి వట్టి యిహమును భావనసేతు
చెఱుపయ్యెనో స్వామి! వేంకటేశ్వరా! శేషాద్రి నిలయ! 83

మరియు నాల్గున్నర లక్షలైన సంవత్సరములకు
ధరఁ గల్కివై పుట్టుదట వె యప్పటి ధాత్రి యెట్లుండు
నరయ నిప్పటి స్థితి బట్టి లేదూహకందుట మరియుఁ
జిరుగులు చిరుగులా! వేంకటేశ్వరా! శేషాద్రి నిలయ! 84

అప్పుడెవ్వఁడో బ్రాహ్మణునకు జన్మింతువని వ్రాసినారు
అప్పటి కైనను బ్రాహ్మణులటంచు నవని నుందురటె
యిప్పటి స్థితిఁబట్టి నమ్మకము లేద యీ దశమంబు
చెప్పి ఫలము లేదు వేంకటేశ్వరా! శేషాద్రి నిలయ! 85

అప్పటికెందుకు పుట్టుటో తెలియదు వేదము లివి
అప్పటికెప్పుడో పూర్వమే లుప్తమైయుండు,వట్టి
గొప్పకు నేఁ గల్కినంచుఁ దెల్లని గుఱ్ఱమ్ము నెక్కి
చెప్పిరో రావలె వేంకటేశ్వరా! శేషాద్రినిలయ! 86

సాక్షివి నీవు నీకు యుగధర్మముల్ సాగించు నంత
దీక్ష యున్నట్లుగాఁ బాపపుణ్యముల్ దిద్దెదు నంత
దీక్షతోఁ చదు, యుగాను సరణమ్ముగాఁ దిరుగనిచ్చెదవు
శిక్షించవే మమ్ము వేంకటేశ్వరా! శేషాద్రి నిలయ! 87

నన్నడిగినయెడ ధాత్రియంతయు నాటికి ఛిన్న
భిన్నమైపోవును వచ్చి యదుకులు పెట్టెదో యేమొ
కన్నన నీ చేతి కత్తి యది యయస్కాంతమై ధాత్రి
చిన్నిన్నముక్కలై వేంకటేశ్వరా! శేషాద్రి నిలయ! 88

యుగములు సాగించుచుందుఁ బెరిగించుచుందు పాపమ్ము
తెగ సాగనిచ్చి యొక్క యవతారమై దిగెదవు నీవు
తెగరాని యీ సృష్టి యెందుకెందుకీ తిప్పలు పట్టి
సిగపట్ల గోత్రమ్ము వేంకటేశ్వరా! శేషాద్రి నిలయ! 89

దున్నుకొనగ నెక్కి తిరుగను నాదేని తోలికొనగను
నెన్నగ యంత్రాల మీఁదనే గుఱ్ఱమే యుండదపుడు
అన్నాడు గుఱ్ఱమ్ము నెక్కి వచ్చెద వనగ మా తెల్వి
చిన్నవుచ్చుటకేమి వేంకటేశ్వరా! శేషాద్రి నిలయ! 90

మరియును నొకమాట శతవిధాల శ్రమంబంత నీకుఁ
బొరయకుండెడు నట్టి మార్గానఁ బోవుచున్నాము
పరమాణు మారణాయుధముల౯ నీవువచ్చి పాపములఁ
జెరగ నక్కర లేదు వేంకటేశ్వరా! శేషాద్రి నిలయ! 91

లేదేని నొక్క యూహ పొనరింపవలెన్ కృతయుగ
మాదిలో నిన్ని దేశాలు లే వంతమందుఁ గలితుది
నీ దేశములు నుండఁ వొక్క భారతమే యుండునపుడు
ఛేదింతు వఘుమును వేంకటేశ్వరా! శేషాద్రి నిలయ! 92

అంతయల్పంపు సంఖ్యగలుగు సృష్టి యాద్యంతంబులందు
పంతమ్ము మీఱగాఁ బెద్ద చేవరూపంబును గల్కి
వింత రాతును నాటకేసి నడిపట్టు విడిలించ వెపుడు
చింతిత ఫలదుఁడై వేంకటేశ్వరా! శేషాద్రి నిలయ! 93

యుద్ధాలు భూకంపములు సముద్రమ్ము లుబుకుట యొకట
వృద్ధి మరొక్కచో క్షయము చూడ నిదెల్లను కాల
పద్ధతి కాలమ్ము గ్రహగతిం జను భావింప నీ వ్రి
సిద్ధి కాలమయమ్ము వేంకటేశ్వరా! శేషాద్రి నిలయ! 94

క్రన్నన నిచట బ్రదుకుటకే యహంకారమ్ము చంపు
కొన్నఁగానీ తేలదాయె నిన్నుఁ గన్గొనగను జెప్ప
మన్నావటే యింక నేనటన్న మోహంబు సర్వంపు
చిన్నపోవలెఁగాక వేంకటేశ్వరా! శేషాద్రి నిలయ! 95

మ్రొక్కుబళ్ళకును బ్రసన్నత నీవు పొందినయట్లు
చిక్కని భావనా వితతికిక మరి చిక్కవో యేమొ
అక్కటా! అప్పుల మున్గియున్న నీ యాశ్రయమేమి
చిక్కులు తీర్చునో వేంకటేశ్వరా! శేషాద్రి నిలయ! 96

వాఁడెటువంటివాడైనను సరే జవంబున వచ్చి
యేడుకొండలు నీవి చేదుకొమ్మంచు నెక్కి, కొట్టించి
బోడి, నిన్ మ్రొక్కిన వాన దృష్టమ్ము పుచ్చిపోయినదె
జీడి నిక వదలడు వేంకటేశ్వరా! శేషాద్రి నిలయ! 97

మరి 'కలా వేంకట నాయకో' యన్నమాట కర్థమ్ము
పరమేశ తెలిసెను పుణ్య పాపముల్ పట్టించుకోవు
గిరికివచ్చుట, నిల్వు దోపు, తలబోడి, కేల్మోడి కట్టు,
చిఱుమేళ్లు కలిగింతు వేంకటేశ్వరా! శేషాద్రి నిలయ! 9

మది దైవమంచును నిన్ను నమ్మినమాదిరి యిదియొ
యెద నిన్ను నిల్పుటలేద, నమ్మని యెవరినో పట్టి
పదరుచు నుంటిన యిద్ది నాదైన భక్తియో వట్టి
చిదురుబోతు తనంబా! వేంకటేశ్వరా! శేషాద్రినిలయ! 99

సాద సుదర్శన మది చేత వాసుకి చుట్టుకొన్నట్లె
విదిత శంఖము వినాయకుని నెమ్మోము విరిసినయట్లు
వదనూర్ధ్వ పుండ్రమ్ము లవి త్రిశూలంబు పగిది రెండుగను
చెదరక రావయ్య వేంకటేశ్వరా! శేషాద్రి నిలయ! 100

శ్రీపయోధర సమాశ్లేష రేఖా పరిమళామృతధు
నీ పోషితా శ్రితక్షేత్రభూత మనీషార్ద్రవలయ
ప్రాపిత స్వీయ భూధర శిఖాక నద్భక్తభావ కల
శీ పూరమలయజా! వేంకటేశ్వరా! శేషాద్రి నిలయ! 101

# విశ్వనాథ మధ్యాక్కఱలు

# ద్రాక్షారామ శతకము

# విశ్వనాథ మధ్యాక్కరలు
# దాక్షారామ శతకము

శ్రీ సప్త గోదావరాంబు నిత్యాభిషిక్త రమ్యాంగ
వ్యాస సన్నుతి రంగ సప్త ఋషి మండలార్చిత లింగ
ప్రాసాద శేఖరోన్నత వృషభ రాజ రాజత్తురంగ
శాసితానంగ భీమేశలింగ! దాక్షారామ సంగ! 1

కూడిన నీ సృష్టికంటె గిజిగాని గూడైన మేలు
మోడిగా నొక్కొక్క దారమాదారముగఁ దీయవచ్చు
నాడిక నెచటచ్చటికిఁ దునాతున్కలై సాగనీయ
కాడింతు మనము భీమేశలింగ! దాక్షారామసంగ! 2

కోరి కోరి యొకింతయైనను బెగుల్చుకోరాక యుంటి
సారమ్ము లేదని యెఱిఁగి కూడ సంసారమ్ము నుండి
అర రాని కృపావిశేష మొప్ప నీవరుదేవ యేని
కారాకు నగుదు భీమేశ లింగ! దాక్షారామసంగ! 3

మాడు పట్టునఁ బెద్ద బరువుగా నుండి మన్నించు చుండి
వేడికన్నుల యందుఁ జంద్రశేఖర భిక్షువై యుండి
యాడికలయ్యె నా బ్రదుకిహ పరంబులందునఁ జెడిన
జాడగా నయ్యె భీమేశ లింగ! ద్రాక్షారామ సంగ! 4

ఏ తపూవా విభవంబు నన్ను నీ దృక్కువీంద్రిగా జేసె
ఆ తపూవా లక్షణంబింత నిలువక యుభవ! చంచలత
పాయని మనసుతో నీవయిక నిలం బడ్డట్టె మనసు
చాయకుఁ దేదు భీమేశ లింగ! దాక్షారామ సంగ! 5

బాదరబందీ లివి తలమున్కలై బాధించు చున్నఁ
బాదముల్ నీయని నేను త్యజియింపఁ బాల్పడే నన్న
నీ దెస భక్తియో యిద్ది వ్యాధియో నిగిడి పద్యములు
గాదెలు త్రవ్వ భీమేశ లింగ! దాక్షారామ సంగ! 6

పరములై నీ స్థితింగన్న నీ యాత్మ భక్తుల యొక్క
చరితముల్ విన్న నా గుండియను దిగఁ జారిపోయెదను
మరచి పోవలె వారి నీవు నావంటి మానిసిఁ బ్రోవఁ
గరుణ దెచ్చికొని భీమేశ లింగ! దాక్షారామ సంగ! 7

బూదిలోఁ బోసిన యట్టి పన్నీరు పోలిక నయ్యె
నో దేవ! నా జపమెల్ల మనసిది యొక యింత నిల్వ
కాదిలో నీ తనూయష్టి నిర్మితి యందేమి కలదో
చాదిన కిసరు భీమేశ లింగ! దాక్షారామ సంగ! 8

పది మాటలకు నొక్క మాట బదులుగాఁబలుకంగ వచ్చు
నది యెంత బిగిసిన నైన వ్రతము గా నాడవో యేమొ
పది పదుల్ వందలు గాగ వ్రాసిన పద్యాలకైన
నది దిక్కు లేద భీమేశ లింగ! దాక్షారామ సంగ 9

పట్టిన దిశ లింగమట్లు నీవు రావచ్చును మాలిఁ
గట్ట నక్కఱ లేదు సన్న నెల వంకఁ గమ్మని చెవులఁ
బెట్ట నక్కఱ లేదు పాపపోగులు బిచ్చగాడీవు
నట్టులే నేనును భీమేశ లింగ! దాక్షారామ సంగ! 10

పాపమా దక్షుని దైన వీఁడు పాద్వొరచితి వంత
కోపాన వారసుఁడైతి వచ్చుటఁ గూర్చుంటి పోయి
ఆ పని సప్తర్షులైన మెచ్చిరీ వాడిన దాట
సైపోవుచుండు భీమేశ లింగ! దాక్షారామ సంగ! 11

నున్నని రాతివ యరుగఁ దీసి పొందుగఁ బూసి కొంద
మన్నను నూఱుక విసముగా విసువై తాత్రివి కొంద
మన్నను రావ నీనునుపు పాత్రిణంబు లాఁ కట్టు మెలచి
కన్నుల వెలుగు భీమేశ లింగ! దాక్షారామ సంగ! 12

ఆదికాలము నుండి భక్తజనుల హస్తామలకమవు
సాదు బోనవుఁ బాత్రఁతయుసిరి కాయు పచ్చడివలెఁ బథ్య
మాదను కొంచుండఁజింతపులుపెక్కకభవ! నా యిది,యు
నాదిదా వ్యాధి భీమేశలింగ! దాక్షారామ సంగ! 13

నీ పునాది కనంగ నేరమే గాని నీ శిరస్సది! యు
మాపతీ! పూజా సుమములతో ఫణామండిత శేషు
డై పట్టి గొడుగును చూచు చుంటిన, యబ్జభువు, భృత
కాపి సోమరియ భీమేశ లింగ! దాక్షారామ సంగ! 14

భక్తుల పలువ దనంబు నీకంటెఁ బాలించు నెవడు
ముక్తి యెందుకు? నీవు వచ్చి తన ద్వారమున నిల్వుమనిన
తిక్త వాక్యము నీకుఁ దీపి, నేను సాత్త్వికి భక్తియంద
శక్తుడఁ స్వామి! భీమేశ లింగ! దాక్షారామ సంగ! 15

పెంచితి పెరిగిన బిడ్డ నింగి నా సొంత చేరితివి
తుంచి యుద్యోగమ్మునకును మరి నీళ్లు తోడి యెడంద
నెంచికొంటివి, ప్రాణములును గొనిపో,యిటెవ్వాడు వలద
టంచు నన్నాడు భీమేశ లింగ! దాక్షారామ సంగ! 16

ఏది యొట్లైన నాకేమి నీకేమి యీ మేను గలుగఁ
గాదని యుపవాస ఘటన కలుగఁగాఁ గలుగును గాని
నీ దయ కోసమై యెదురు చూతు నా నిముస మెప్పుడని
గాదిలి స్వామి! భీమేశ లింగ! దాక్షారామ సంగ! 17

కరిమ్మిన నీ వెల్గు దూర దూరమై కౌపీన రక్ష
ణమ్మున నీ పటాటోపమన్నట్లు నా స్వామి జీవి
తమ్ము సాగు కొలంది బ్రదుకు కృషి విడుదల లేదు మొగిలు
కరిమ్ముచు నుండు భీమేశలింగ! దాక్షారామ సంగ! 18

నీ వెలుంగుదువు తండ్రీ భవద్ధ్యాన నిభృత వేళలను
పూవుటోవరి కట్టి గుండెలోన నిన్ బూజింతు నంచు
పూవుటంచుల మంచు నేత్ర యుగమునఁ బోకార్తు నంచు
హోవళి పడుచు భీమేశ లింగ! దాక్షారామ సంగ! 19

మన యిద్దఱకు సిగ్గులేదు తలచి నంతన మన్నింతు వీవు
నను వ్రాత్యుడంచు నెంచకయ, నా నా దుష్ట భావ
సునిశిత బుద్ధినై నీ మర్మ్ము చొచ్చెద, తేజు
గని! సరిపోయె భీమేశ లింగ! దాక్షారామ సంగ! 20

నేననుకొందును దేహ బలమున నెగడు నిదంచు
తాను నీవనుకొందు విద్ది తప్పని తద్దిన మంచు
పూని మెత్తని వానిఁ బట్టికొని మొత్త బుద్ధియు నగున
కాన యొత్తెదను భీమేశ లింగ! దాక్షారామ సంగ! 21

పైకి శిలా కఠినుండ వయ్యును భావమ్ము లోన
నాక నివాసుల యన్నముం బోని నాజూకు కలవు
పైకి వేషాడంబరములు పెఱలు, లోఁ బట్టుదలల్ చి
కాకు దైవములు భీమేశ లింగ! దాక్షారామ సంగ! 22

నా స్థితి యిది యెట్టిదో మహేశ్వర! నాకే తెలియదు
ఆస్థయేమియు లేద యనుము మరి లేని యందునఁ, జాల
యాస్థ తత్త్వమ యాభిమంగంబు నందునఁ బొలుచు
స్వస్థత మాలి, భీమేశ లిం౯! దాక్షారామ సం౯! 23

ఈ విలక్షణమైన దేహము న్నాకు నిచ్చితి నేను
నీ వెంటఁ బడి వచ్చు వేళ నన్ను క్షమింపఁగా నేమొ
దైవమా! దూఁకి రావచ్చు మరి యడ్డదారులుఁ గలవు
కావలె నన్ను భీమేశ లిం౯! దాక్షారామ సం౯! 24

ఫణిరాజు నీ తలపైన నెప్పుడు పడగ విప్పికొన్న
గణనాథపిత! నీవు మూర్తి కట్టిన గానంబవేమొ
అణిమాదులకు పైన నీవు ప్రభు! హాని ఉపాధి మంచుంది
కణిక ముగ్ధాంగ భీమేశ లిం౯! దాక్షారామ సం౯! 25

నాలోఁ బ్రభూ! నీవు మెల్లనాడుచున్నావని తెలియు
నా లీల మెలికలు తిరుగు పామో! సుధార్ద్ర వానెలుగా
కాలాకృతిం బూనివట్టి క్షణములు గడపుటో తెలియ
ఛాలి కల్పించి భీమేశ లిం౯! దాక్షారామ సం౯! 26

నీ వెలుంగుదువు తండ్రీ భవద్ధ్యాన నిభృత వేళలను
పూవుటోవరి కట్టి గుండెలోన నిన్ బూజింతు నంచు
పూవుటంచుల మంచు నేత్ర యుగమునం బోకార్తు నంచు
హోవళి పడుచు భీమేశ లింగ! దాక్షారామ సంగ! 19

మన యిద్దఱకు సిగ్గులేదు తలచి నంతన మన్నింతు వీవు
నను వాత్స్యుడంచు నెంచకయ, నా నా దుష్ట భావ
సునిశిత బుద్ధినై నీ మర్వ్వ చొచ్చెద, తేజు
గని! సరిపోయె భీమేశ లింగ! దాక్షారామ సంగ! 20

నేననుకొందును దేహ బలమున నెగడు నిదంచు
తాను నీవనుకొందు విద్ది తప్పని తద్దిన మంచు
పూని మెత్తని వానిం బట్టికొని మొత్త బుద్ధియు నగున
కాన యొత్తెదను భీమేశ లింగ! దాక్షారామ సంగ! 21

పైకి శిలా కఠినుండ వయ్యును భావమ్ము లోన
నాక నివాసుల యన్నముం బోని నాజూకు కలవు
పైకి వేషాడంబరములు పెఱలు, లోం బట్టుదలల్ చి
కాకు దైవములు భీమేశ లింగ! దాక్షారామ సంగ! 22

నా స్థితి యిది యెట్టిదో మహేశ్వర! నాకే తెలియదు
ఆస్థయేమియు లేద యనుము మరిదేని యందునఁ, జాల
యాస్థ తత్త్వ్వప యాభిమంగంబు నందునఁ బొలుచు
స్వస్థత మాలి, భీమేశ లింగ! దాక్షారామ సంగ! 23

ఈ విలక్షణమైన దేహము న్నాకు నిచ్చితి నేను
నీ వెంటఁ బడి వచ్చు వేళ నన్ను క్షణింపఁగా నేమొ
దైవమా! దూఁకి రావచ్చు మరి యడ్డదారులుఁ గలవు
కావలె నన్ను భీమేశ లింగ! దాక్షారామ సంగ! 24

ఫణిరాజు నీ తలపైన నెప్పుడు పడగ విప్పికొన్న
గణనాథపిత! నీవు మూర్తి కట్టిన గానంబవేమొ
అణిమాదులకు పైన నీవు ప్రభు! హాళి ఉహాళిఉ మంచుండు
కణిశ ముగ్ధాంగ భీమేశ లింగ! దాక్షారామ సంగ! 25

నాలోఁ బ్రభూ! నీవు మెల్లనాడుచున్నావని తెలియు
నా లీల మెలికలు తిరుగు పామో! సుధార్ద్ర మానెలుగొ
కాలాకృతిం బూనివట్టి క్షణములు గడపుటో తెలియ
ఛాలి కల్పించి భీమేశ లింగ! దాక్షారామ సంగ! 26

దారియు డొంకయు లేవు స్వప్న పథంబున యూహా
లారుట యెన్నడు లేద మేల్కొన్న యప్పుడే నిన్ను
నోరగాఁ దలచిన దానికే ఫలమొసగ వే నిద్ది
యారుట లేద భీమేశ లింగ! ద్రాక్షారామ సంగ! 27

తుంచినచోఁ దోన తుంచి కొని పొమ్ము తోరంపు బత్తి
పెంచినచోఁ దోన, పట్టరానంత పెంచుము కాని
కొంచెమ్ము కాదు కాదెక్కువయుఁ ద్రిశంకు స్వర్గముగ, హి
మాంచదపాంగ, భీమేశ లింగ! ద్రాక్షారామ సంగ! 28

ఎంచవే యేకాంత మందు నన్ను మహేశ్వర! పరిగ
ణించవే నా దీనమైన చరితంబు నీ తేజ సవద
రించవే నాయందుఁ బాపము పరిహరించవే హృద్ర
సాంచిత రూప, భీమేశ లింగ! ద్రాక్షారామ సంగ! 29

నా నెత్తిపై కెక్కి పిండి కొట్టుచున్నావు నా గుండె
లో నుండి గగ్గోలు చేయుచున్నావు లింగమై పోతిఁ
గానిమ్ము విశ్రాంతి సుంత లేకుండగా నేను నేను
కానంత దాఁక భీమేశ లింగ! ద్రాక్షారామ సంగ! 30

ఇంతకంటెను గూడ చెట్టదినములే నెట్టులో గడపి
తంతయో యింతయో యిప్పుడున్నది యీ బాధ లేద
చింత యేమియు లేద నన్ను నీలోనఁ జేర్చుకో వచ్చు
శాంతమహస్క !భీమేశ లింగ! ద్రాక్షారామ సంగ! 31

ఊహలో నుంటివా లేక ప్రాణమందుంటివా లేక
మోహమ్ము లేనట్టి చోట నుంటివా మూసిన కనులు
బాహిరింపించిన దోర వెలుగుల పరిణాహ సీమ
నాహరించితివ భీమేశలింగ! ద్రాక్షారామ సంగ! 32

నికరమ్ముగాలోన నెంత త్రిప్పుచూడినఁ జెమ్మరావ
మకొని యేమయ్యె నీకంటెఁ బలనాటి నూతులు మేలు
ఒకజాలి పెనుచట్టు పగిలి నల్లనీళ్ళుబుకగా వచ్చుఁ
గకవికలాడు భీమేశ లింగ! ద్రాక్షారామ సంగ! 33

అచ్చెరువయ్యెడు నాకు నీవు వేళావేళలుగను
వచ్చెదు వచ్చిన యపుడు చిత్రికపట్టెదు గుండె
నిచ్చోటు నెఱుగనే యెఱుగవన్నట్టు లెసగెదొక్కపుడు
తచ్చనలాడి భీమేశ లింగ! ద్రాక్షారామ సంగ! 34

‑పరమకృపామూర్తి వంచు నిను నవ్యవహితముగ హర
హర మహాదేవ! శంభో యటంచు నే నాడుచుంట హర
హర మహాదేవ! శంభో వృథాయౌాట యవునటయ్యా! పుర
హర మహాదేవ! భీమేశ లింగ! దాక్షారామసంగ! 35

అంత పట్టనిచుట్లు దూరదూరాని కరిగెడువాడ
వంతగా నొక్కనా డరుగుదెంచి యేలాశ పెట్టితివి
చెంతకుఁ జేరలాగి చివరకు మొండిచేయి చూపించు
సంతకు కాకు భీమేశలింగ! దాక్షారామ సంగ! 36

నీ కిష్టమైనప్పు నా ప్రియత్నమ్ము నెగడకుండగ నె
నా కనుమూఁత తోత్రివల విచిత్ర చంద్రజ్యోత్స్న వగుదు
నీ కిష్టమింతైన లేనియప్పుడు నే మన్నుతింటఁ
గాక నిష్ఫలము భీమేశలింగ! దాక్షారామసంగ! 37

నీ లింగమునకు నుంచిన విభూతి పుండ్రక మూఁతలయిన
నా లోచనద్వయీ మధ్యభాగాన ననగు త్రిస్రోత
నీ లోకమునఁ జూచి యెఱుగని వెలుంగు లింత మెర్పించి
యాలోనఁ దోలగు భీమేశ లింగ! దాక్షారామ సంగ! 38

అంత కోపంబేల యింత హాస్యమేలా! జగద్గురువ
వింతగాఁ జూతు నావంక నాశ్రితు వెక్కిరించెదవు
నింతటి సృష్టిలో నందరు వివేకులే యుందురటవె
యంత కాంతకుడ భీమేశ లింగ! దాక్షారామ సంగ! 39

అయ్యయ్యో నా స్వామి! నిపథ యోగ్యుడనని చెప్పలేదె
కొయ్యతనంబులు చేసినాడ నెక్కువగా నె యనుము
తియ్యవిల్కాని దహించినాడ వా తిగకంటి సెగలె
కయ్యలువార్చు భీమేశ లింగ! దాక్షారామ సంగ! 40

కుమ్మి పరివాహంబు చారగ నిమిడించుకొని యాగియాగి
గుమ్మ నీళ్లలు కురిక్కుతూమువలె నాదు గుండియ నిన్ను
చిమ్ముచున్నది యక్క అయుగ నో దయాసింధు! నింపి హృద
యమ్ము చీల్పఁగదె భీమేశ లింగ! దాక్షారామ సంగ! 41

అది యేమియో యుండియుండి నామీద నధికమా ప్రేమ
పొదలు నీ కనిపించుచుండు గుండె విప్పాదల ఘటించి
కుదుపలై నవ్వు నా పెదవిపై వచ్చి కూర్చుండి యనకు
మది కాదటంచు భీమేశ లింగ! దాక్షారామ సంగ! 42

అమ్మో! మహాదేవ! మీకు నా బ్రతుకంతయు సంకి
తమ్ముగాఁ జేసితి హారతిచ్చితి దాశరథికిని
క్రిమ్మిన మీకును వచ్చి బానిసనంటి నైతమ్మ
హమ్ము దించికొని భీమేశ లింగ! దాక్షారామ సంగ! 43

ఈయొక్క చీఁకటిముద్ద నానుండి యే యుపాయముఁ
బాయునో తెలియకయుండి నీ దివ్య పాద యుగ్మమున
దోయిలించుచునుంటి పోకువే నన్ను దులపరించికొని
కైయండ యీక భీమేశ లింగ! దాక్షారామ సంగ! 44

నీ యనుగ్రహమది కల్లలేదని నే నేడ్చుచుండ
నా యక్షులందునఁ గట్టుచున్న మంధరము కన్నీరు
నీ యెదలో నిప్పఁదాకి చుంయి చుంయి మనుచున్నదన
యా, యెదచిముడ, భీమేశలింగ! దాక్షారామసంగ! 45

కనిలోన రాహువు నాలుగేండ్లపైఁ జనుదెంచు నతడు
ఘన భుజంగము నీవు వో మహా భుజంగ విభూషణుడవు
కనుకని నా వెన్నుపాము గాఁగను గదలించి కరువు
మనుము మాడునను, భీమేశలింగ! దాక్షారామసంగ! 46

మరణంబు, తీవ్రంబులైన రుజలును, మనుజుల దుఃఖ
భరమును, జూచిన యపుడు వేదాంత భావంబు, నిలుచు
టరిదిగా నున్నది స్వామి యీ తెల్వియన్నది కాని
సరణి యన్నంత భీమేశ లింగ! దాక్షారామ సంగ! 47

ఎవఁడైనఁదా నోచును దనబాధ యెంతేని సహించు
నవ్వర యాప్తుల బాధ కని సహించుట యధిక కష్టంబు
అవనిలో నున్న కిటుకిది మోహమన్నట్టిది దీని
నవియించిపెట్టు భీమేశ లింగ! దాక్షారామ సంగ! 48

ఏ దినమ్మున కాదినమ్మె తెలవారు నిదె పొద్దుక్రుంకు
లోదగుల్ వాయద యెందుకీ పనులో యెందుకీ య
నాది సంసార బాధానుభూతియో నాకే తెలియద
యాడుకోవయ్యా భీమేశ లింగ! దాక్షారామ సంగ! 49

నన్ను వేధింపగా వందమంది యున్నారు నాకేల
యన్నన్న యీ గోల యంచు నే నేడ్వనా వందమంది
నన్నుఁబట్టికొని యేడ్చెదర సర్వమైనవియు నీ యేడ్పు
లన్న! నాకేల! భీమేశలింగ! దాక్షారామ సంగ! 50

విక్షుతమహా మింట మొయిలు గుమ్ముల వెనుకటి కృష్ణ
పక్షపు పూర్ణిమా చంద్రువోలిక భాసిల్లెదీవు
మక్షికంబునుబోలె నేల నెగురుచు మసలుచుంటిన, య
నక్షరాత్ముఁడను భీమేశ లింగ! ద్రాక్షారామ సంగ! 51

పట్టి యుదర పోషణకు జగత్తు, గొప్పగ సూదిదెచ్చి
కట్టిన దూలాన గ్రుచ్చి మోసిన కరణి వర్తించు
ఇట్టి యాగడమేల నాకు శివ! వినువెత్తును నిన్ను
గట్టిగఁ బిలుతు భీమేశ లింగ! ద్రాక్షారామ సంగ! 52

గవమెక్కి యంబతోఁ గలిసిరావు నూకల కేడ్చి యేడ్చి
తవుటి కేడ్చినయట్లు స్వామి! మీ దివ్య దర్శనాశ చెడి
యవుర! గుండ్రనిరోల రాతివే యయ్యొ నగుపడవంచు
నవిసి పోయెదన భీమేశ లింగ! ద్రాక్షారామ సంగ! 53

చిన్నారి జాబిల్లి యెడఁద జాలికి చిన్నగా వ్రాలి
నున్నంత, తొలినాళ్ళ భక్తజనముల నురక ప్రోచినది
విన్నంత, తలఁచిన కొలఁది వివృతమహా విభవంబు నీది
కన్నంత నిజము భీమేశ లింగ! ద్రాక్షారామ సంగ! 54

పట్టుచిక్కని యట్టి నున్న గుండ్రాయివలె నున్న నిన్నుఁ
బట్టుక వ్రేలాడు టెట్లు తొల్లిటి భక్త జనమ్ము
లిట్టి నీలో నెట్టి పట్టు చూచిరో యెఱుఁగన నీవు
పట్టు నందించు భీమేశ లింగ! ద్రాక్షారామసంగ! 55

నీరోగమగువేళ నవిరతంబుగ నిన్నెంచుచుంట
భారమ్ముగా లేదుగాని యొడలనే వ్యాధియో పుట్టి
యూరక తెగపోట్లు పొడుచుచుండ నయ్యో యగునో శి
వా! రావె యగునో భీమేశలింగ! ద్రాక్షారామ సంగ! 56

ఇది యిల్లె వచ్చెను దీని దారిన యిది యిల్లె పోవు
ముదుకండ్రి లెక్కయేమి పసిబాలురే పోవుచుండంగ
నదనున నే తెల్వి యూడుచున్నదో యా తెల్వి నిన్ను
గదియించుకోవె భీమేశలింగ! ద్రాక్షారామసంగ! 57

ఈ జగద్వైయర్థ్య మల్లతొలినాటి ఋషులకు భక్త
రాజికి నెంతగాఁ దెలియునో నాకుఁ బ్రభు! అంత తెలియు
యోజనయున్నది లేసిదేమన్న నుల్లంపు లోతు
గాజరల్ క్రమ్మె భీమేశ లింగ! ద్రాక్షారామ సంగ! 58

గాదిలి స్వామి! దైవమవె కాని కలికాలమగుట
మాది మాకిచ్చుట యెంతో యిచ్చుట మడిమాన్యములను
అది నే నేమాడునో యది ఘటింపుమయ్య! యెక్కువగ
నాడుకొమ్మనవె భీమేశ లింగ! దాక్షారామ సంగ! 59

ఇది సజ్జనాళికిఁ బంచి వినిపింతు నీ యాత్రి వారి
యెదలలో నీవుందు వెచట నచ్చునో యెఱుఁగనుగాని
యది వదివేలు నా కథవ! నీవు మహాకారమున వి
శదమయియుందు భీమేశ లింగ! దాక్షారామ సంగ! 60

ఇంటిలో నాల్గు మూలలను దిరిగెద నెచటఁ గన్పడవు
కంటికిఁ, గంటిలో నుండి కంటికిఁ గన్పించువాడ
వంట నిక్కమ్మ యన్నింటివలె వేలినాడి కన్పడవు
కంటిలో రావె భీమేశ లింగ! దాక్షారామ సంగ! 61

అరయ వానుకి చుట్టికొన్న చుట్టలు నందులో లింగ
మును మాళివయి విప్పిపట్టు వడగయునోయి స్వామి హర
హర! మహాదేవ! శంభో యనగనైన యక్షరాకృతిగ
సరణించు నాకు భీమేశ లింగ! దాక్షారామ సంగ! 62

ఏమియు మక్కువలేక యున్నట్టి యీ మేనొకండు
స్వామి నీ భావనచేయు కొఱకుఁ బోషణ చేయుచున్న
గోముగాఁ గన్పించు నితర కార్యముల్ కొసరు బేరములు
సామజదమన! భీమేశ లింగ! దాక్షారామ సంగ! 63

ఈ మేను కలదన్న యూహయే లేక యెన్నఁ గొంచుండ
నామది నిన్నుఁ దానిద్ది దేహమున్నాననుచుండె
ఈ మై గురుతులేని యట్లుగాఁ జేయు మేర్పాటు మనకు
నామెయిఁ బొసగు భీమేశ లింగ! దాక్షారామ సంగ! 64

నీ చుట్టు మెలికలు తిరిగి కడుపులో నిన్నుఁ బెట్టుకొని
వే చందిరుని బలెఁ మణికల పడగ విప్పక మాళిఁ
దాఁచెంత పున్నెంపు జీవియో చారితార్థ్యంబు తెచ్చు
కాఁచిన యెడఁద భీమేశ లింగ! దాక్షారామ సంగ! 65

పాపంపు వేళయో పుణ్యవేళయో భావనాపరత
నీ పేరె యనుచుండు నెడద నిన్నె ధ్యానించుచుండెదన
నాపాలి దైవమా! యిదొక గుదిబండ నా నెంచుకొనుమ
యా! పాండులింగ! భీమేశ లింగ! దాక్షారామ సంగ! 66

భావనా రూపమై నట్టి దగు భక్తి పచరింతు నేను
భావనా రూపమైనట్టి దోషంబు పచరింతు నేని
భావనా రూపమైనట్టి దగు శిక్ష పచరింతు నాకు
పాళవళి తెచ్చి భీమేశలింగ! దాక్షారామ సంగ! 67

మనసులో నొకసారి వచ్చు భావంబు మఱచిపోనైన
మనసులోనే తోచు సర్వ భావముల్ మఱచిపోవచ్చు
నను సర్వ సంస్మృతి విషయమగు భావనా విస్మరణము
గను నేలికోవె భీమేశ లింగ! దాక్షారామ సంగ! 68

వసుధ మానవుఁడయి జన్మమెత్తినవానికి నెన్ని
వ్యసనముల్ సిలుగులు దుఃఖములు చేయవలయునో అన్ని
పొసగించితివి నా కిదొక్కటే మేలు పొగడగా నిన్ను
పసినాల్క కలిమి భీమేశ లింగ! దాక్షారామ సంగ! 69

ఇది యొండెయాశగా నున్నయది జన్మలెత్తుట యింకఁ
దుదకు వచ్చినదేమొ ప్రాక్తకర్మల దుష్ఫలితాలు
గుదిగుచ్చి యొక్కసారిగను నా మాళి గుప్పించితివొ
యుదయత మీఱ భీమేశ లింగ! దాక్షారామసంగ! 70

పిచ్చి కుదిరి గాని పెండ్లికాదది పెండ్లైనగాని
పిచ్చియుఁ గుదురదు నీవుగాని కన్పించిన, మనసు
చొచ్చి చూచును, నీవు కన్పడవు చొచ్చిచూడదు హృద్వి
యచ్చర మూర్తి భీమేశ లింగ' దాక్షారామ సంగ! 71

ఏజన్మ యెత్తిన యప్పుడా జన్మయే సుఖ మొప్పఁ
గా జరుగను వలె నయ్యె జీవుఁడెక్కడి కక్కడికి వృ
థా జాల్మ బుద్ధియై, నాకు నీ పరితపన మాన్పవె గ
జాజిన ధారి! భీమేశలింగ!దాక్షారామ సంగ 72

ధృతి నన్ని కోర్కులు నీ శరీరాపతితములు గాగ
మతి నిశ్చయంబు చేసిన నను నీవు మన్నించవేని
గతిలేదు మతిలేదు వట్టి జడమైన కాలంబు యొక్క
గతి యనవలయు భీమేశలింగ! దాక్షారామ సంగ! 73

దినములు మాసముల్ సమలు యుగములు తెగి మహా యుగము
లనుగతి మన్వంతరములు వ్రాళయమ్ము లంతట సృష్టి
కననంతు వంతు లేనట్టి యీ వింత కథ యెందుకు విశ
సనము ఘోషణము భీమేశ లింగ! దాక్షారామసంగ! 74

క్రొత్త యన్పించుట యొక్కఁడే గాని కొసరు, నిక్కముగ
క్రొత్త యేమియు లేని జగతి నెవఁడో మూర్ఛించు రమించు
మొత్తము చైతన్యమందు కొంత యీ మూర్ఛత దెసకు
సత్తమిల్లుటయు భీమేశ లింగ! దాక్షారామ సంగ! 75

బగిఁ బూలలోఁ బెట్టి నీది నీకిచ్చుచున్నాను నన్ను
నగుబాట్ల పాల్సేసి నీవు నా యది నాకిచ్చు చుంటి
జగముల కధికారి వౌట నీకిట్లు నాగుకల మరి
యగచాట్లు నాకు భీమేశ లింగ! దాక్షారామ సంగ! 76

కలలోనఁ జెప్పినదానికిఁ మేలు కనినప్పు డిట్టు
లులికించుదానికి నేమి సంబంధ మున్నది స్వామి
నిలవరించుద మన్న మెఱసి నంతలో నిబిడాంధకార
మలవరించెదవు భీమేశ లింగ! దాక్షారామ సంగ! 77

నిజమా! మనోజాత దమన! మనసులో నెఱి పీనికింత
హాజమా యటంచు నెంచెదవో హర హర హర మహాదేవ
యజ వంద్య! నేనింక బ్రిదికి బయటఁ బడ్డట్లు నిన్ గొల్చి
యజ పజ లేక భీమేశ లింగ! దాక్షారామ సంగ! 78

కాలికి వ్రేసినన్ వ్రేలికి మహేశ! కాలికి మరియు
వ్రేలికి వేసిన లాగు చున్నావు వెస లెక్కకు జప
మాలాగత మతియొ ప్రాణ నియతిఁ బద్మాసన మతియొ •
కాలుట యయ్యొ భీమేశ లింగ! ద్రాక్షారామ సంగ! 79

ఇన్ని మన్వంతరమ్ములును నాపైని నింతటి ప్రళయ
మన్నన్న నన్నిట్లె యుంచ నెంతువొ యట్లు చేయుము వె
మన్నద్దు కొందు నీకాలిది నొసంట మౌళిదిక్సముప
సన్నహిమాంశు! భీమేశ లింగ! ద్రాక్షారామ సంగ! 80

తొలుత నాంతాకాశ మందు గోళాకృతులుగను సృష్టి
ఫలియింపఁ జేయుటే వెఱఁగు దానిని బట్టి యెంతైన
నలువంపు సృష్టి చేయంగ వచ్చున యాడించ వచ్చు
నలనట లేక భీమేశ లింగ! ద్రాక్షారామ సంగ! 81

అన్నింటి కన్న నాశ్చర్యమేమన నాకస మందు
నిన్ను నీవే తారకలుగఁ బొడిచి కొంటివి మనుజులయు
తెన్నున నేలపై దిగితివి యిదింత తికమక లగుచుఁ
జన్నట్టి మెలిక భీమేశలింగ! ద్రాక్షారామ సంగ! 82.

లోకమ్మిదీ రీతి గాగ జరుగుటలోఁ గొంత నియమ
మాకట్టి కొంచును జరుగుచున్నది యిది పౌరుషముగ
లేకి మూక జమ కట్టి కొనుచున్నది లీలా విచిత్ర
తాకార! శర్వ! భీమేశలింగ! దాక్షారామ సంగ! 83

తన యింటఁ దాఁ జావవలయుఁ గొలువగా దగ్గరివారు
తన చావు సైతము భోగ మన్నట్లు తలచును జనుడు
జనుల యీ భోగాశ యెంత దవ్వుగా జనినది స్వామి
యనిభృత బుద్ధి భీమేశ లింగ! దాక్షారామ సంగ! 84

మఱులిప్త నిష్కారణముగఁ జావచ్చు మఱి పాదముంచి
మరణించ వచ్చుచు దేశ కాలముల్ మఱి మఱిఁ గ్రమ్మి
తెరిపి యిచ్చుచు నుంటి గాక యాయువు తీరు దాఁక హర
హర మహా దేవ! భీమేశ లింగ! ద్రాక్షారామ సంగ! 85

నీవు నాలో నున్న యప్పుడు దేహంబు నిస్సార మగుట
భావింపఁ జిత్ర మయ్యెడి జగత్సార పరమార్థ రూప!
నీవున్న చోట నిస్సారమైనది నిస్సార మగునా
యావులు దేరి భీమేశ లింగ! ద్రాక్షారామ సంగ! 86

నీ కిటుకంతయు నాకుఁ దెలిసెను నిండి దేహాన
నీ కాష్ఠమున నన్ను సూక్ష్మతమముగా నెసఁగించి నీకుఁ
గాకుండఁ జేసెదు స్వామి! యనుటెందుకా! కుండ వ్రిస్సి
చాకుండఁ జేతో భీమేశ లింగ! ద్రాక్షారామ సంగ! 87

చాకుండఁ జేతునో దానికీవును జాల వాపదలు
రాకుండఁ జేతువో నిన్నుఁ దలచము రానిచో, జన్మ
లేకుండఁ జేయుము దాని కీవు చాలెదవును గరుణ
సాకుకోవయ్యా భీమేశ లింగ! ద్రాక్షారామ సంగ! 88

ఇది భార్య, బిడ్డలు వీరు, బంధువులీ యెల్ల వారు
కదలెడు మేను లియ్యవియు నెందాకఁ గలుగు నందాక
కదలని కాష్ఠముల్ పెంచి వింతగాఁ గదలించు చేమి
యదయత కలవు భీమేశ లింగ! ద్రాక్షారామ సంగ! 89

వారు వారెవ్వరో నాకుఁ దెలియదు వారు పూనిన శ
రీరాలతోఁ జుట్టఱికము నా యీ శరీరంబునకు, శ
రీరమ్ము నేనా! యిదేల ననుఁ బ్రతారింతు మాయా వి
కారదత్వమున భీమేశ లింగ! ద్రాక్షారామ సంగ! 90

నే నెవ్వరో కూడ నాకుఁ దెలియదు. నిజ శరీరాభి
మానంబు పూనుట లోనఁ దప్పేమి? మనసా శ్రయించఁ
గా చేనా వలయు; నాశ్రయింతును గన్నడు నీవు
కానిది వదలి భీమేశ లింగ! ద్రాక్షారామ సంగ! 91

నిన్ను సేవించిన యట్టి వారికి సిద్ధు లిచ్చినావు
మున్ను విద్యాధరాధిపులఁ జేసితి భోగి రాడ్భూష!
నిన్నొక్క రాగి దమ్మిడియు నడుగను నీ నా కగపడు
టన్నది చాలు భీమేశ లింగ! ద్రాక్షారామ సంగ! 92

కడు వారి వారి కర్మాను రూపంబుగా నాకు బ్రదుక
జడుఁడనై నా భార్య యంచు నాదైన సంతాన మంచు
విడువని మోహాగా బ్రతుకు చుంటి విశ్వేశ్వర! తోడి
జడువుగా నతము భీమేశలింగ! ద్రాక్షారామ సంగ! 93

ఎంత చూచిన నైన స్త్రీలఁ బొందుట, పృథ్వి నేలుటయు
నింతకా భోగాలవేవియో యనుభవించుట యయ్యో
కొంతకుఁ గొంతైన విసుగు కల్గుటకును నీ మహాన్స
సంతన పడక భీమేశలింగ! ద్రాక్షారామ సంగ! 94

మఱియు నిజంబుగాఁ బ్రిభువ! పోయిన మమత నీ మేను
బరువయి పోవుచున్నదియు నట్లయ్యుఁ బ్రాంత వాసనలు
తిరుగు చున్నవి వీని నెట్లైనఁ దెగఁ గోయుటకును
హర! హాయ సడవె భీమేశ లింగ! ద్రాక్షారామ సంగ!25

పుట్టుట పెరుగుట చావు భేదమీ మూటితో మనకు
పుట్టించకయ యున్న రెండు నవి మాసి పోయిన యట్లె
నట్టేట ముంచకు నన్ను నిన్నిన్ని నాళ్లు సేవించి
గట్టు నెక్కించు భీమేశ లింగ! ద్రాక్షారామ సంగ! 96

కడచిన, రాఁబోవు, వేల జన్మలఁ గలిగెడు బాధ
పడుచుంటి శివ! యణిమాది సిద్ధులు వలదు విద్యా ధ-
రుఁడు కాను వలదు, భోగములు వలదు, తరుణులంతకంటె,
నడగింపు మాయ భీమేశ లింగ! ద్రాక్షారామ సంగ! 97

పట్టిన కూర్చుండి నిన్ను ధ్యానించు వరకఁ గన్నీరు
పుట్టించి సంతలో నేఁడదలో దిగుల్ పొడిపించి సంత
నట్టి ల్లలుక గానె పంతుగై నదా! నా స్వామి యాట
కట్టించు మిచట భీమేశ లింగ! ద్రాక్షారామ సంగ! 98

నీ పెఱ రూపైన రామచంద్రుని నిందైన కథను
మా పతీ! వ్రాయించి కొంచు నాదు జన్మకు సార్థకతను
ప్రాపింపఁ జేసి తంచనక నింత కృపా బుద్ధి గుండె
కాపుంటి వచ్చి భీమేశ లింగ! ద్రాక్షారామ సంగ! 99

పాపి ననాచారు డను దురాశాతి పాతకుడనుఁ ద్రి
పా పరిణతుఁడను సజ్జనుల్ లేని వగిదిని వెదకి
యీ పల్లమునయందు గొంతు కూర్చుండ నేతెంచు టబ్రి
మై పొల్పు నభవ! భీమేశ లింగ! ద్రాక్షారామ సంగ! 100

శ్రీ సప్త గోదావరాంబు నిత్యాభిషిక్త సర్వాంగ !
వ్యాస సన్నుతి రంగ సప్త ఋషి మండలార్చిత లింగ !
ప్రాసాద శేఖరోన్నత వృషభ రాజ రాజత్తురంగ !
శాసితానంగ! భీమేశలింగ! ద్రాక్షారామ సంగ !

ఆలోచనము చేయ నునువు తేరి నదవు ముడి సరకు
గా లోన ననునేన తెలిసికొంటిని కాళియ దమన!
లోలముల్ పదములఁ ద్రొక్క నాల్క వెళ్ళుకొనియ వచ్చు
వేళగా నందమూర్నిలయ! సంతాన వేణుగోపాల! 3

నిజ మేమిజన్మ యెత్తించి నావొకానీ! ముకుంద! గజ
బిజయైన జన్మ, నాచేత నుక్కిరిబిక్కిర య్యెదన
యజనాభ! యిన్నాళ్ళు సరియ వృద్ధుఁడ నైతినే యేమి
వృజినంబు నందమూర్నిలయ! సంతాన వేణుగోపాల! 4

వడిగ నిజంబుగా నేను నీవు నగ బాలింపుమనుచు
నడుగుట న్యాయమో కాదో తెలియన,యస్మాదృశు లిటు
లడుగుట యున్నది, నీకు నాకు నీ యూ యెల్ల బాధ
విడనది నందమూర్నిలయ! సంతాన వేణుగోపాల! 5

ఇక్షువై పట్టరానంతగా విసు వెత్తించు నట్టి
లక్షణమున్నది దీనిలోఁ బండ్లు లాగుట, నమలు
టక్షులు బెదర, గీరుకొని పోవుట యాఖలంబు పెద్ద
విక్షతి నందమూర్నిలయ! సంతాన వేణుగోపాల! 6

కంటిగా నీకు పెట్టుకొని కూర్చున్న యీ [illegible] కామ
[illegible] [illegible]త్మినకొమున సమసిపోయెడునో
[illegible]లో [illegible]లిపోవలయు వేణుగాన ధారలకు
[illegible]తలై [illegible]నందమూర్తిలయ! సంతాన వేణుగోపాల! 7

మనసులోఁ గట్టిన మూర్తిగా నీవు మన్నింతువెపుడు
కనులకుఁ గట్టిన మూర్తిగా నీవు కన్పింపవెపుడు
మనసునుండి కనుల వరకు వ్యాపించి మన్నింపవయ్యా
[illegible]వయ్యా! నందమూర్తిలయ! సంతాన వేణుగోపాల! 8

మున్నంగిలో నున్న వేణుగోపాల మూర్తి సన్నుతులు
నిన్ను మనస్సులోఁ బెట్టుకొని యవి నిర్గమించినవి
మున్ను [illegible]ష్నముతోఁ జేయు వాగ్దానమును జేసి పెట్టు
విన్నది నందమూర్తిలయ! సంతాన వేణుగోపాల! 9

ఈ తనూనిర్మితి తలచిన కొలంది నేవమ్ము కలుగు
చేతమ్మునందుఁ దాత్కాలికము వాంఛచేత నిద్దానఁ
బ్రీతి ఘటిల్లెడు మరియు నంతలో భీతి ఘటిల్లు
వీతార్తి! నందమూర్తిలయ! సంతాన వేణుగోపాల! 10

విషయమ్ములం గూర్చి సృష్టిఁ గరణ ప్రవృత్తి ఘటిల్లు
విషయమ్ము లేకుండ నాకుఁ గరణ ప్రవృత్తి ఘటిల్లు
విషమమ్ముగా నున్న దిద్ది సంతాన వేణుగోపాల!
విషయినై నందమూర్ధ్నిలయ! సంతాన వేణుగోపాల! 11

తెలివినాఁజను వస్తువునకు రూపమే తీరునఁ గలుగు
తెలివికిఁ దన్నుఁ దాఁ దెలిసికొనియెడి తీరును గలదె
తెలివికిఁ ద్వైలంబులేని కాఁగడా తీరగు కాంతి
వెలయునే నందమూర్ధ్నిలయ! సంతాన వేణుగోపాల! 12

ఇది యింక నాకు నున్నదట గ్రహాబలమిట్లు చేయించు
వదలవచ్చును నేను దీని నేటికి వదలగా వలయు
వదలుదు వదలి పైనేమి చేయఁగావలె నిను గుండె
వెదనాటి నందమూర్ధ్నిలయ! సంతాన వేణుగోపాల! 13

నను నేన రక్షించుకొనుజాలను నా తనూజులను
వనితను రక్షింప నెంచెదను భాగ్యవంతుఁడ వీవు
నినుఁగూడ రక్షింప నెంచఁ జేతకాని తనంబు నెవుడు
వినినావా నందమూర్ధ్నిలయ! సంతాన వేణుగోపాల! 14

మును వశిష్ఠ మహర్షి సూర్యమండలమున కేగినాడు
తనర నే దెవ్వాడో చంద్రమండలాంతము పోవగలడు
కనుకని నా కబ్బురమ్ము లేదు నిన్ గాంచెడు కోర్కి
పెనవడి నందమూర్నిలయ! సంతాన వేణుగోపాల! 15

సర్వథా చచ్చెడివారు సర్వదా చచ్చుచున్నారు
ఉర్వియు మిగిలిన వారి దన్న యట్లున్నది స్వామి!
గర్వాది ముఖ్యమ్ముగాని మృత్యువు కాదు గర్వములు
వేర్వేఱు నందమూర్నిలయ! సంతాన వేణుగోపాల! 16

ఈ పేరుతో నున్న ఈ శరీరము నిది యొక వ్యక్తి
ఆపదయో సౌఖ్యమో ప్రతిష్ఠయో యప్రతిష్ఠయొ దు
రాపమౌ భోగమో శత్రువులో నా కివన్ని యేలా గ
పీ పాల! నందమూర్నిలయ! సంతాన వేణుగోపాల! 17

ఒగి నా శరీరమ్ము కట్టెవలె పోవుచున్నది గాని
సెగలేని యూహాలు మాత్రమెప్పుడు చేయుచున్నదియ
సెగ చంపితిని దీనియందు నితరవహ్ని సెగ తాకకుండ
బిగియింపు నందమూర్నిలయ! సంతాన వేణుగోపాల! 18

ఎలుక తా నెంతసేపటికిఁ దన దెసకే త్రివ్వుకొనును
తలచి దానిని దీని నీ కృపయని యర్థము చెప్పికొందు
నిలుపవే యర్థమ్ము దీనజనుల మన్నించు పనికిది
వెలికాదు నందమూర్నిలయ! సంతాన వేణుగోపాల! 23

తిరిపమ్మునకు గాని నా ప్రభూ! మూఁడు దివ్వెటీలేల
భరముగా జరిగించుచుంటి నాదైన బ్రిదుకు నీలాంబు
ధర చిక్కణావ ఘనా! దృశాంశు సౌదామనీ కాంతి
బెరకయ నందమూర్నిలయ! సంతాన వేణుగోపాల! 24

గోపాల! యెప్పుడో ప్రాణతతి చెప్పకుండగా లేచి
వే పోవు నెందుకో యెచటికో లేచి వెళ్లువెచ్చటికో
చాపుదేరి శతవిధాల వెళ్లెడి స్థలము కావలయు
వే ప్రవల్లె నందమూర్నిలయ! సంతాన వేణుగోపాల 25

నిను వేయి మార్గాల మనసులోపల నిలుప యత్నింతు
నను పు కాకుండెదు నిన్ను బలవంతమని చేయరాదో
దానవోలె నెప్పుడో దిగు హఠాత్తుగా దూఁకి వచ్చెనన
వినువాక నందమూర్నిలయ! సంతాన వేణుగోపాల! 26

చిత్తంబు కలలోనఁ గ్రొత్తగా నూహచేయను గలదొ
వృత్తంబు పూర్వంబు నూరక ప్రతిబింబించుచుండెడినొ
క్రొత్తగా భావి సూచనయు, జేసినఁ గొంత విజ్ఞాన
విత్తగు నందమూర్నిలయ! సంతాన వేణుగోపాల! 27

తరి బావి లోఁతుగాఁ ద్రవ్వి జలపడ్డ తరువాత నొడ్డు
విరిగి పడ్డట్టుగా నున్నదయ్యా నా విధము గోపాల!
మరల నంతటి లోఁతు త్రవ్వఁగాఁ గనంబడు జల యింత
వెరవేఁది నందమూర్నిలయ! సంతాన వేణుగోపాల! 28

నీ పేర యది స్వతస్సిద్ధముగఁ దియ్యని పదార్థమగున
వాపోవు బిడ్డల యేడ్పుడుపు జోల పాట గదయ్య
నీ పాలి వాడను బాలముంతువా నీట ముంతువా గ
పీ పాల! నందమూర్నిలయ! సంతాన వేణుగోపాల! 29

అనుభవింపగను గల శక్తియుండి తా ననుభవింపనగు
దినుసు లేకుండిన నున్నఁ గోరిక తీరైన మాట
అనుభవించెడి శక్తి లేదు కోరిక యున్నదెందులకు
పెనగొను నందమూర్నిలయ! సంతాన వేణుగోపాల! 30

తెలిసిన మూర్ఖులంచున్న యెడల ధాత్రిని నన్ను మించుఁ
గలుగరు మనసు నీపైనను నిలుపఁగా క్షణంబేని
కలుగను మూర్ఖత దీనికంటెను గలుగునా వేణు
విలసన! నందమూర్తిలయా! సంతాన వేణుగోపాల! 31

వెలఁదిపై బిడ్డపై కోర్కె వలను జీవికి నంచు నాకుఁ
దెలిపితి వొక భార్యఁ జంపి యొకఁ బిడ్డఁ దీసుకపోయి
తెలిసికోలేక పోయినను నీవెట్లు తెలిపెదు వట్టి
వెలుఁగవై నందమూర్తిలయా! నంతాన వేణుగోపాల! 32

తెలియని నాళ్ళలోఁ గొన్నిఁటిని జేసితిని వాని బాధ
తెలిసిన నాళ్ళలో ననుభవానికిఁ దెచ్చెదు నన్నుఁ
దెలివి తక్కువవానిఁజేసి యాశించితివి యింతగాఁగ
వెలిపెట్టి నందమూర్తిలయా! నంతాన వేణుగోపాల! 33

బొచ్చెడు మోహంబు వేయి యూహాలు పుట్టించు దాని
వుచ్చిన వ్యర్థత యొక్కసారిగా మొగమునఁ గొట్టు
విచ్చిపోయిన యట్టి మోహ వారిధి వీచిలో నీవు
విచ్చెదు నందమూర్తిలయా! నంతాన వేణుగోపాల! 34

ఉట్టికి నాలుగుచేర్లు తెగి కూరుచున్నాను నేను
ఉట్టికెక్కఁగ పనిలేదు పెన్న నీ ప్రేమకో స్వామి!
ఉట్టిచేర్లున్నచో నుండ నీవే! ప్రభూ! పని యిద్ది
పెట్టుకో నందమూర్తినిలయ! సంతాన వేణుగోపాల! ౩౫

అల్పదుఃఖములకు నల్పసుఖముల కడి యేర్చి నన్ను
నల్పవుఁ బనిలేదు జన్మ మెత్తిన యందు కేర్పడను
నిల్పోపరాకుండఁ జేయుచుంటివి నిముస నిముసము
వేల్పవై నందమూర్తినిలయ! సంతాన వేణుగోపాల! 36

నా సామి! మనసులో మరచిపోవుచున్నానయ్య నిన్ను
మోసగించెదు నీవు నన్ను నీ పెద్ద బొందలో డింపి
మానవశక్తిమైన యీ మాయ యెడఁదలో మరలించుకొంచు
వేసార, నందమూర్తినిలయ! సంతాన వేణుగోపాల! 37

చచ్చెను మానిసి యెప్పుడైనను జచ్చెడి దాఁకఁ
బచ్చియారదు జీవి నీ విశేష కృపాస్పర్శ లేక
అచ్చపు జీవి, తా, లోనఁ బరిపక్వమగు నీదు వెలుఁగు
వెచ్చన నందమూర్తినిలయ! సంతాన వేణుగోపాల! ౩౮

అలుపంబులందున మరియు నలుపంపు టధికారమునకుఁ
దల తిరిగించిన నేను యన, నీదు దయ యనవలెనె
అలయించి కికురించి తటపటాయించి యలమాయ తుదకు
నెలయింతు నందమూర్నిలయ! సంతాన వేణుగోపాల! 39

కలలోన నేదియో పెద్దయాపద కలిగి, నీ స్మరణఁ
దలఁగి పోవునయేని నద్దికూడ నీ దయయన్న, దయయె
కలలోనఁ గూడ నీస్మరణ భయముతోఁ గలసియుండెడిని
నెలకట్టి నందమూర్నిలయ! సంతాన వేణుగోపాల! 40

పున్నెంబులని వేఱకలవె నీధ్యానమునఁ గూడి యున్కి
నన్నియుఁ బున్నెంబులగున యటుగాక నన్ని పాపములె
నిన్నాశ్రయించి యున్నది యఖిల కర్మ నిచయంబు నన్ను
నెన్నంటి నందమూర్నిలయ! సంతాన వేణుగోపాల! 41

వానికి నెందుకో అంతమైన కోపమ్ము నామీఁద
నేను నిన్నాశ్రయించితి ననుచు నాశ్రయించుట పూర్వు
లైన ఋషుల్ చెప్పినట్టి మార్గాన నని, క్షమణా న
వీనుడు నందమూర్నిలయ! సంతాన వేణుగోపాల! 42

దేశమ్ము కాలమ్ము కలసి బుద్ధికిఁ దెచ్చు నజ్ఞాన
లేశముల్ కొండంత లేసి చేసి తూలెదఁ దూలనీకు
దేశకాలానవచ్ఛిన్నతయును నాదెసకొగ్గఁ గరుణ
వేశంత! నందమూర్నిలయ! సంతాన వేణుగోపాల! 43

సంపూర్ణముగ నీయనుగ్రహము నాకు సమకూడుచున్న
వెంపరలాడి లాభమ్ము లేమిచే వెక్కసంబయ్యె
తంపట వేసినయట్లుగా నయ్యెఁ దమకు నావిన్న
వింపులు నందమూర్నిలయ! సంతాన వేణుగోపాల! 44

ప్రొద్దు ప్రుంకుచునుండె మరలఁ దూర్పునఁ బొడుచుచునుండె
నిద్దుర పోవుచునుంటిఁ బవలు తిండి తినుచునుంటి
కొద్దిగానైన నీకరుణ కలదనుకొనరాద యేమి
విద్దియ నందమూర్నిలయ! సంతాన వేణుగోపాల! 45

ఇందు రమించుచు నుంటినో లేదొ యెఱుఁగను బిట్టు
క్రిందైన యలవాటు కొలఁది బ్రతుకుదుఁగాని నిత్యముగఁ
గందన కాయలో నీవు మసలుట కలదన్న తృప్తి
విందవై నందమూర్నిలయ! సంతాన వేణుగోపాల! 46

మొదలు తుదల్ లేక సాగుచుండిన భూమి జంతువుల
పొదలికయును మృత్యుధారకును గట్టిపోయెఁగాఁజాలు
పదయుడు లేనె లేడవధి లేకుండఁ జను జీవకోటి
బెదరుగా నందమూర్నిలయ! సంతాన వేణుగోపాల! 47

ఏచీమ కాచీమ బ్రతుకు చుండుట యింకొక్కఁడైన
యేచీమ తన ముక్కు చివరఁగల నూక కెగఁబడి పోరు
నో చెట్టు బెదరుగా నిముసమా బ్రతుకఁగాడ నూర్మి
వీచిగా నందమూర్నిలయ! సంతాన వేణుగోపాల! 48

ఎన్నగా వ్యర్థమైనట్టి దీనికై యెన్ని వేదములు
నెన్ని శాస్త్రంబులు నెన్ని విద్యలు నేర్పాటు జరిగె
మన్నుం దినెడు జీవి యెడఁద లోపల మత్సరంబెంతో
విన్నావా నందమూర్నిలయ! సంతాన వేణుగోపాల' 49

నన్నుగాని పరిత్యజించి పోవుచున్నావీవు స్వామి
కన్నాకుగా నిల్పఁబెట్టి నినుసేన గదలింప నెంతు
మన్ను వ్రాలగ నీకు నిలుము మారాకుగా లంచమెసఁద
వెన్నగా నందమూర్నిలయ! సంతాన వేణుగోపాల! 50

నా యేడ్పు నా యేడ్పు గానె యుండగా నను పీడిపోకు
మోయయ్య! యిదియొక క్రొత్తయేడ్పుగా నోయి గోపాల!
యీ యూరునకుఁ దెచ్చినదియు నను పీడి యేగుటకా న
పేయాంశు! నందమూర్నిలయ! సంతాన వేణుగోపాల! 51

పిల్లల కాట వస్తువు లొసఁగి బువిపించిన యట్లు
మొల్లము వచ్చెడు త్రోవ చూపి నన్ మోసగించెదవు
చిల్లర జేరమ్ముగాని నాచేతఁ జేయించఁబోకు
పెల్లుగా నందమూర్నిలయ! సంతాన వేణుగోపాల! 52

ఈ మేను కలిగినన్నాళ్లు తప్పద యీ పాడు సంత
ఏ మేను కలిగిన యేని యీ సంత యెపుడు తప్పదును
ఏ మేను లేకుండఁ జేయవే మరి యేమఱకుండ
వేమాఱు నందమూర్నిలయ! సంతాన వేణుగోపాల! 53

ఒక యాతనా శరీరమ్ము కలదేని ఉండనీ! లేని
సుకములు సుకములు గాఁగఁ గల్లగాఁ జూపించుమదీని
నకట గోరనుగాక నీదు గుండెలో నంతగాఁ గరుణ
వికటింప నందమూర్నిలయ! సంతాన వేణుగోపాల! 54

మనిసిపై నా యెత్తు కుమ్మరించి నల్ల మన్ను, లోలోన
మనిసి తా నటునిటు కొట్టుకొనరాద, మనలను రాద
తనువున నేదారిఁ బ్రాణములు పోవు, దారి యద్రింధ్రి
వినతమ్మా నందమూర్నిలయ! సంతాన వేణుగోపాల! 55

ఈ శరీరమ్మిది జీవునకు నహంకృతి పూను పీఠ
దేశమ్ము దేహము వీడి యెచ్చటఁ దిరుగు నేమౌను
లేశమ్ము గూడ నా జీవుని స్థితి తెలియదు, యెట్లో వి
వేశమ్ము నందమూర్నిలయ! సంతాన వేణుగోపాల! 56

పర్వతం బొక్కండు పైనఁ బడి చావఁ బ్రాణముల్ పోవఁ
బర్వత భేదంబు చేసి జీవుఁడు పయనింపఁగలడో
పర్వతాణువులందున నతనికి నభివ్యాప్తి కల్గెడునో
వేర్వేర నందమూర్నిలయ! సంతాన వేణుగోపాల! 57

జీవుఁడన్నది గాలియా! ప్రకాశమా! చిల్లేశమా! సు
ధీ వేదమైనట్టి బ్రహ్మ యుండేక దేశమా! యెందు
కో వాఁడు నేకాకియై చరించెడు నురక యెందులకో
వేవిళ్ళు నందమూర్నిలయ! సంతాన వేణుగోపాల! 58

వ్రికట తైజస శరీరములు పయనించుఁ బాంచభౌతికము
నకె గాని యిబ్బంది, గాలిలో గగనంబు నందునను
నకట! జీవున కచ్ఛమైన వానికి నాకృతి కలదె
వికృతమై సందమూర్నిలయ! సంతాన వేణుగోపాల! 59

ఆకాశముంగూడఁ బంచభూతమ్ములందున గలదు
ఆకాశ మాకార మగుచు నుండునా యతఁడు జీవుండు
ఆకాశమందేక దేశమై యుండునా వాడు వట్టి
వీకాశి నందమూర్నిలయ! సంతాన వేణుగోపాల! 60

కడలియుఁ బొంగుగా వచ్చినదియు వెన్కకుఁ దగ్గినదియు
పడియుగా నొకచోట నిల్చెఁ బల్లానఁబడియ కానయ్యెఁ
గడు తెల్పై నేసంచుఁ బొంగె జీవుండుగా నిల్చిపోయె
వెడఁగయి నందమూర్నిలయ! సంతాన వేణుగోపాల: 61

పల్లమ్ములో వచ్చి పడిన యంతలోఁ బడియ కానేల
నల్లనై నీరమ్ము, పుట్టి వాసన, నాచును, నత్తె
గుల్లలేర్పడ నేల, కడలి యెవుడు పొంగుగవచ్చు మరలఁ
బెల్లుగా నందమూర్నిలయ! సంతాన వేణుగోపాల! 62

ఉన్నది యెచ్చటఁబడిన నచటనే యుంటి నంచు నను
కొన్నది, యనుకొన్న యంతలో నొక్క కోణ మేర్పఱచు
కొన్నది, యింకఁ జెప్పితివా వట్టిన గుబ్బినలాట
వెన్నుఁడా! నందమూర్నిలయ! సంతాన వేణుగోపాల! 63

ఆనతమయి భావమైన యట్టిది యాత్మయు దివ్య
మైనట్టిది శరీరమగుట పరికింప న్యాయము మాయ
మైనది భావమే యది శరీర మెట్లయ్యె జీవునకు
వీన గ! నందమూర్నిలయ! సంతాన వేణుగోపాల! 64

నిన్ను నాలోచించిన కొలఁదిగ నవనీతమ్ము లూవా
లిన్నిన్ని వచ్చెడు దీని హేతువు నెఱిఁగితి నేను
మున్ను వే జన్మలందునను నీ భావమున మన్కి, వచ్చు
వెన్నంటి! నందమూర్నిలయ! సంతాన వేణుగోపాల! 65

నా జాతకంబులోఁ బ్రిబలమాచు నున్నది యెవ్వరు? గ్రహ
రాజియో! హరిహా రాఖ్యంబు వెలుఁగు సారమ్మో ముకుంద!
నే జెల్ల నా మానసంబో బృందావనీ వ్రిపాలిత గ
పీజాల! నందమూర్నిలయ! సంతాన వేణుగోపాల! 66

నా మనోవృత్తిఁ జూచినను వేయి జన్మల కైనఁగాని
యీ మోహము తొలంగి పోవునను నాశ యింతయులేద
యే మూలనో నీవ యంటికొంచు దహింపనోఁ జెప్ప
వే మరి! నందమూర్నిలయా! సంతాన వేణుగోపాల! 67

మనసు భ్రమించుచు నున్కి మంచికి మరలించుచున్కి
చన వ్యర్థవాదంబులు శంఖముల సార్లు జరిగియుఁ బాయు
టను జెప్పఁగా రాద యిట్టి వట్టి టూఠాలకుఁ గాదు
వినతము నందమూర్నిలయా! సంతాన వేణుగోపాల! 68

మొదలు తుదయు లేని కష్టములు దుఃఖములు పూర్వ భక్త
లెదఁగోరి రనుమాట యర్థ మిప్పటి కెఱుఁగ వచ్చెడిని
పది పిచ్చికలు చేతిలోన నాడ నీ పై మరుల్ సన్న
పిరిది లెదు నందమూర్నిలయా! సంతాన వేణుగోపాల! 69

నీ మంచితనమును నిజముగా సాగనీయను నేను
స్వామి నా చెట్టతనమును మరి నీవు సాగనీవలయు
నామముల్ మొలిచెనా నాకు మొలిచె ని న్నమ్మితిఁ గానఁ
బ్రోఖించి నందమూర్నిలయా! సంతాన వేణుగోపాల! 70

కురియుచోఁ బైనుండి మన్ను వూడిపోకుండఁ గట్టడిన
యుగయంగ నెంత గాలికిని బ్రాణము లాడగావచ్చు
నుకువ్రులౌ ఘామముల్ దివ్యములునైన యూహా లీకీలఁ
జెరసెడు నందమూర్నిలయ! సంతాన వేణుగోపాల! 71

నినుఁగూర్చి చదివితిఁ దెలియవచ్చెను నీ స్వరూపంబు
ఘనులైన పెద్దలవలన విన్నాను గడగి యన్యులకు
వినిపింప వలఁతిని గూడ, ననుభూతి విభవంబు లేదు
కనుకొని నందమూర్నిలయ! సంతాన వేణుగోపాల! 72

హరి నా జపంబంతయును బటాటోపమునకుఁ జేయుకువె
యరయ నంతస్తాపమునకుఁ గాక నా యత్నీ మధ్యమున
శిరసునఁ బింఛమ్ములోని యొక యీక చిన్నారి కన్ను
విరియవే నందమూర్నిలయ! సంతాన వేణుగోపాల! 73

వినుటయు నర్థమాటయును నురల జ్ఞప్తిని దవ్వుల్కొనుట
మననంబు మనసు నిల్పుటయు గుండెలో మాగుట వదలి
మననలేక యుండుట యదియ యాటగా మన్నింపు నీదు
వినుకలి నందమూర్నిలయ! సంతాన వేణుగోపాల! 74

నా కోపమునను దపించి పోవుచున్నావేమొ నా ప్రి
భూ! కామమున కిలకఱచుకొని పోవుచుంటివో! రసధు
నీ కేళి నొకటి మండించు నొకటి యెండించున వల్ల
నీ కృష్ణ! నందమూర్ధ్నిలయ! సంతాన వేణుగోపాల! 75

పోయెడునది దాని దారిఁబడి నది పోవుచు నుండ
మాయురే కూర్చుండి దాని కొక్క నమస్కార మనుచుఁ
జేయను వలెఁగాక నే నొకింతయుఁ జేయను జాలఁ
బ్రియమై నందమూర్ధ్నిలయ! సంతాన వేణుగోపాల! 76

అంతయు రెడ్డివచ్చె మొదలాడుమన్నట్లుగా నుండె
వింతమై నా కథ నీ యెడఁద జాలి పీసంబు లేక
యింతగా నా ధ్యాన మెపుడు నా ధ్యానమే కోర్కులు విడి
పింతువా! నందమూర్ధ్నిలయ! సంతాన వేణుగోపాల! 77

వంద విధాలుగాఁ జూచినంగాని వ్యర్థతా వధిగ
సందీపితంబగు నీ జగంబెల్ల సౌందర్య మంచుఁ
దందానతాన పాడెదరు మోహా సందానితాత్మాంశు
బృందంబు నందమూర్ధ్నిలయ! సంతాన వేణుగోపాల! 78

ఒక పెద్ద పొంగుగా వచ్చి నా గుండె నొక్కమట్టమ్ము
నకుఁదెచ్చి యాపెద వచట మరల నేనాటికో యింక
నొక పొంగు తెచ్చుట పొంగులారిన యున్నతాచ్ఛ వద
నికిఁ జేర్పు నందమూర్నిలయ! సంతాన వేణుగోపాల! 79

పొంగుగా నీ వచ్చినపుడు జీవితమునఁ జారితార్థ్య
సంగతి కనినట్లుండుఁ బొంగఱు సమయంబునందుఁ
గొంగ జపంబన్న యట్లుండుఁ గైకోక ముంగలయుఁ
బింగల నందమూర్నిలయ! సంతాన వేణుగోపాల! 80

ఆచారము లతిక్రమించుటకును బ్రహ్మజ్ఞాన బుద్ధి,
యాచరింప ధనాదికమ్ము వ్యవహార, మధికమౌ శ్రద్ధ
నా చెట్టతనము మన్నింపుమని భక్తి నటన, బృందా గ
వీ చార! నందమూర్నిలయ! సంతాన వేణుగోపాల! 81

లౌకికమ్ములయందు నా ప్రతీక్షా బలంబు సర్వమును
నీకోస మన్నట్లుగాఁగ నుండెడు నీవ స్ఫురించి
నీకుఁగానట్టి యీ కోర్కులేల మన్నింతునో యన్న
వేకమై నందమూర్నిలయ! సంతాన వేణుగోపాల! 82

అలుపమ్ములైన నాదు సుఖ దుఃఖమ్ములా సమయములు
నొలయు భాగ్యాభాగ్యములును రోగాదులొక కొంత నీవు
కలిసి యీ చిత్రమైనట్టి మేనుగాఁ గట్టితిట్లుగను
వెలసెడి నందమూర్నిలయ! సంతాన వేణుగోపాల! ౮౩

నీవుంటి వను నూహా లేక బ్రతుకగా నే నేల రాళ్ళు
లేవా వృక్షంబులు లేవా జంతువుల్ లేవా యీ నేను
నీవుంటివని విశ్లేషించి బ్రదుకుచుంటిని సుధాబోధ
వీవధా! నందమూర్నిలయ! సంతాన వేణుగోపాల! 84

బ్రదికే యుండియు నేనుదలఁచుచుంటిని బ్రదికి లేననుచు
బ్రదికియు బ్రదుకక కూడ నొక్కటే ఫలితమంచెంచి
నిదురలో నైతమ్ము సర్వవేళల నీ తత్త్వమునకు
వెదకుచు నందమూర్నిలయ! సంతాన వేణుగోపాల! ౮౫

ఎప్పటి కప్పుడు చూచుచుండిన నెచ్చటి కచటఁ
గప్పిన యుందంబు గాఁగఁ గనిపించుఁ గంటికి సృష్టి
చెప్పగా సంతయుఁ గలిపి యూహా సేసిన నిది వట్టి
పిప్పిరా నందమూర్నిలయ! సంతాన వేణుగోపాల! ౮౬

సృష్టి యిదంతయు లక్ష్మీదేవి చేసిన విలాసంబు
దృష్టిగాఁ జూపించి బిట్టు మోహంబు పుట్టించుచుండు
నష్టాదశ పురాణములును శ్రీస్తోత్ర మధురీకృత త్రి
విష్టప! నందమూర్నిలయ! సంతాన వేణుగోపాల! 87

సామాన్యముగ నేఁ బ్రయాణముం జేయు సమయంబునందు
నా ముఖంబునఁ గవితా సరస్వతి నాట్యమాడెడిని
స్వామి! నా తుది యాత్ర నిన్నుఁ బాడుచు సాగనీవే! గ
వి మార్గ! నందమూర్నిలయ! సంతాన వేణుగోపాల! 88

ఈ సృష్టిలోఁ గల నియతి సర్వదా యిది యథార్థమని
భాసింపఁ జేసెదుఁ బెద్ద మోసంబు పచరింతు వీవు
ఈ సృష్టికంటె మరేదో యున్నదంచెంచ నీవాయె
వీనంబు నందమూర్నిలయ! సంతాన వేణుగోపాల! 89

ఉన్నట్లు కనిపింపఁ జేయు నొక శక్తి యున్నది దాని
కన్నుల జవ్వాది పునుగు కస్తూరి కాటుక రేక
సన్నసన్న నగుళ్ళ వెలుఁగులో నిన్ను స్వామి! కన్నాను
విన్నాను నందమూర్నిలయ! సంతాన వేణుగోపాల! 90

నను నీవు పంద పుతాలు వేయుము నా దారి నాది
నినుఁ బూర్తిగా నమ్మియుంను నన్నది నే నమ్మఁజాల
మను, మిన్నుఁ బూయించు శశముసకును గొమ్ములు
మొలిపించు
వినినావె నందమూర్ని లయ! సంతాన వేణుగోపాల! 91

పరమ నాగరకముల్ వేదములు శాస్త్ర పటలియు వేద
శిరములు వదలి యాటవికు వోలిన శ్రీ రమారమణ!
యరయమి గొడ్డగా నిన్నుఁ దలఁచెద నారిపోవుగద
బిరుసెక్కె నందమూర్ని లయ! సంతాన వేణుగోపాల! 92

చివరకు నొక్కదానికిఁ గృతజ్ఞత చెందక తప్ప
దవురౌర! నీ యందు నే దురాచారమైనను నిన్ను
నవియింప మనను కష్టపడు నీ పచ్చియారక కరుణ
వివరింతు నందమూర్ని లయ! సంతాన వేణుగోపాల! 93

దిగులెప్పుడును విడరాక యుండ బాధించుచున్నావ
యిగమయి దినదిన గండ మిదియు నూరేండ్ల యాయుస్సు
సగము చచ్చినవాని నేల పట్టుక సాధింతు వెంత
వెగస్తైతి నందమూర్ని లయ! సంతాన వేణుగోపాల! 94

ఇప్పుడు కాకున్న నన్ను రక్షించు టెప్పుడో నీకుఁ
దప్పదంచును జెప్పుచుండె దోషజ్ఞతతి నాకుఁ గన్ను
కప్పెదు వానకు ముందుఁ జల్లని గాలి క్రొత్తగ
విప్పదా నందమూర్నిలయ! సంతాన వేణుగోపాల! 95

కొందఱు చేయునట్టి యుపకారము గుర్తుగా జరుగ
దందందు స్పృశియించుచుండి జీవితమంత పాలించు
నొంది నాయెద నిష్ఠా యెందుకో చిల్కుచుండు వైరాగ్య
బిందువుల్ నందమూర్నిలయ! సంతాన వేణుగోపాల! 96

సృష్టిలోపలఁ గల సర్వ మాధుర్య రేఖ సంగీత
యష్టిగాఁగ హిరణ్య గర్భు నాకారమైన వేణువును
ముష్టిఁగైకొని వచ్చినావు స్వామి! నా ముంగిలిలోఁ బ్ర
విష్టుడై నందమూర్నిలయ! సంతాన వేణుగోపాల! 97

ముక్కున నడ్డబాసయును నధరంబు ముంగల వేణు
వక్కట వేదశిఖా సరస్వతి యన వచ్చినావు
మ్రొక్కు నా జీవుని గడప ముంగిట ముగ్గులు తీర్చి
పెక్కులు నందమూర్నిలయ! సంతాన వేణుగోపాల! 98

నీయంతటఁ నీవు నా యెదుట వచ్చి నిలువవు బ్రహ్మ
మై యానిరాకారమై మదుజ్జ్వల మగు నూహా కల్ప
నాయత్త మూర్తివై వచ్చి నిలువక యదియౌను నీకు
పేరియుక్తై నందమూర్నిలయ! సంతాన వేణుగోపాల! 99

వచ్చిన నష్టమేమయ్యా నీకు గోపాలయ్యా నాదు
పుచ్చిన యూరుపు లగురు ధూపంబు పొందమ్మివోల
విచ్చిన యెడఁద నైవేద్య మర్ఘ్యమ్ము వెలలు బాష్పములు
వెచ్చనై నందమూర్నిలయ! సంతాన వేణుగోపాల! 100

శ్రీ పరిణామ రేఖా మనోహారస్మేర కపోల!
గోపీసిత కపోల కలితనఖర సంకుమద జంబాల!
చాపల్య రహిత ధీకృత సుధా గీతికాలోల! నవ గ
వీ పాల! నందమూర్నిలయ! సంతాన వేణుగోపాల! 101

# విశ్వనాథ మధ్యాక్కఱలు

# నెకరుకల్లు శతకము

# విశ్వనాథ మధ్యాక్కఱలు
# నెకరుకల్లు శతకము

శ్రీతమాలశ్యామలింగ! సిద్ధసంసేవిత లింగ!
హేతువాన సనాథ! అన్నపూర్ణా సహిత విశ్వనాథ
నీకామరధునీక జాటజూటా! మణి శశి కిరీట!
స్ఫీత వియన్మౌళి నెకరుకల్ ప్రాంత సిద్ధాబ్జహేళి! 1

స్వామి నీవు పరమ సూక్ష్మ సూక్ష్మ విషయములంగూడ
నామతించెదవు జాగ్రత్త, యిక మేమొ యధికంబులందె
ఏం మాయయో కాని సాగనిమ్ము పోనిమ్మందు మిదియ
సీమ నీకును మాకు నెకరుకల్ ప్రాంత సిద్ధాబ్జహేళి! 2

బలువైన గుదెబండ మెడకుఁ దగిలించి వంగరా దనుచు
నిలువాన పెట్టిన పగిది నా మాట నీ మాట వినని
కలుచ దేహంబిచ్చి పాపముల నంటఁ గట్టె నెంచెదవు
సిలుగుల దొరవాదు నెకరుకల్ ప్రాంత సిద్ధాబ్జహేళి! 3

నిదుర పట్టెడుదాఁక రాత్రులందున నిన్నే తలఁచుచు
నిదుర మెలంకువ వచ్చునంతలో నిన్నే తలఁచుచు
బ్రదుకు భావనలందుఁ దెలివిలో నిన్నె భావించుచుంటిఁ
జెదరనీకువె నన్ను నెకరుకల్ ప్రాంత సిద్ధాబ్జహేళి! 4

ఉదరంబులోనుండి పొంగులై యేడు పుబికి వచ్చెడిని
గదియించుకొనువేళ నిన్నుఁ దీవ్రంబుగా నెదలోన
నిది యోగి జనము నవ్వెదరో మరియు నీ వేమనుకొనెదో
చిద్రుపలు కానీకు నెకరుకల్ ప్రాంత సిద్ధాబ్జహేళి! 5

ఒక మంచి జరుగును దాని వెంబడి నొక చెడ్డ జరుగు
నొక సమమ్ముగఁ బోక యెగుడు దిగుడుగా నున్న దీ సృష్టి
యొకఁడవు సమముగా సాగువాడ వీ వొకడవే స్వామి
చికిలి క్రొవ్వెల్లవై నెకరుకల్ ప్రాంత సిద్ధాబ్జహేళి! 6

వలవల పుట్టుకల్ చావు లాసులోఎలి కండెవోలె
సిలుకులై తిరిగితిఁ గాని సుంత నేసిఁ బట్ట లేము
చలమొప్ప నేటికీమాత్రి నేఁతగా సాగెదు నిద్ది
జిలుగవో మన్నదో నెకరుకల్ ప్రాంత సిద్ధాబ్జహేళి! 7

రుసరుసలుగ నేమి బ్రిదుకు బ్రిదికింతు రూతు చింతనకు
వెనులుబాటింతయుఁ గలుగనీయవు వెక్కసంబడుచుఁ
గసరుటో ముక్తిపైని సగమాఁకలి గల జనంబును శ
శి సహిత కైశికా! నెకరుకల్ ప్రాంత సిద్ధాబ్జహేళి! 8

సుకముగాఁ జనిపోవుటన్న భయ మొకించుకయు లేదనుము
అకట యే ఘోరమైనట్టి చావో యటన్న భయంబె
నికరంబుగా నీవు గుండె లోపల నిల్చిన, వెఱపు
సెకలివ్వి నిల్వావు నెకరుకల్ ప్రాంత సిద్ధాబ్జహేళి! 9

ఒనరఁ దానొక వంప యిచ్చి కర్ణున కుద్దియా దాత
ననిపించుకొన నెంచు జనుని వోల్కి నూవాలు నీకు నిచ్చి
తనర నాత్మార్పణ చేయువాని చందావఁ గన వల
సినదని కోరెద నెకరుకల్ ప్రాంత సిద్ధాబ్జహేళి! 10

ఈ కోరికలు నీ భయంబులును మఱి యివి యొక్కటొకటి
వే కోయవలె నన్నుఁ జాలవు వేయి జన్మములు
నీ కంటి నిప్పుసెగ నిగిడించి మండించుమీ యెల్ల
శీకరాసారంబు నెకరుకల్ ప్రాంత సిద్ధాబ్జహేళి! 11

నిను బిట్టు వాంఛింతునాయె రక్షింపు! నెలతలు ధనము
తనువున రోగములేమి యధికారితయు సర్వమంచు
మనసున నెంచుచు బ్రతికినన్నాళ్ళు మనవచ్చు నట్టి
చెనఁటిని గాదాయె నెకరుకల్ ప్రాంత సిద్ధాబ్జహేళి! 12

ఏలాగు సాగింతో పరచఁ బెట్టి యీ యనంతమగు
కాలంబు, తలఁచిన గుండెలో భీతి కల్గెడు, నంతు
మాలిన యట్టి జన్మలును మృతులును మాలించు, కొట్టి
సీలను నెత్తిపై నెకరుకల్ ప్రాంత సిద్ధాబ్జహేళి! 13

విన్నించుచు జపంబుమీఁద నున్నప్డు నిశ్చింతముగ నె
యున్నది గాని జరుగుట యెట్టు లట్లున్నచో నెప్పుడు
అన్నలా! మేనుసఁ దేళ్ళు ప్రాకుచున్నట్లుండు జగము
చిన్నెలు చూచిన నెకరుకల్ ప్రాంత సిద్ధాబ్జహేళి! 14

అంతయును నశించిపోవునని యూషిమైనట్టి దాని
వింతలుచూచి రమించు నంత యోషిక లేదు నాకు
వింతలోవింత బ్రదుకుట తప్పని విధియు నీ వలె గ్రి
సింతు చేదును నేను నెకరుకల్ ప్రాంత సిద్ధాబ్జహేళీ! 15

అలవాటుగా దేహమన్న యీ కట్టె యూడుచునుండె
ఖిలమిలై బంధుగుల్ దీనియందు రమించుచున్నారు
తెలిసియు మృత్యువు గూర్చి తలచరు, తెలివి యశుభము
చిలుకవల్కుల జాతి నెకరుకల్ ప్రాంత సిద్ధాబ్జహేళీ! 16

చచ్చెడువారికిఁ దప్ప ముసలులై చచ్చెదరేని
క్రచ్చర మిగిలిన వారి కభ్యంతరమ్ము లేదిచటఁ
జచ్చెడువాఁడు నీకోసమై దానఁ జావంగవలయు
చిచ్చఱకను వేల్ప! నెకరుకల్ ప్రాంత సిద్ధాబ్జహేళీ! 17

కన్నులు మూసిన నెఱుపు కన్పించుఁ గన్పించు వలుపు
వెన్నెల కన్పించు దోఁ వెలుగు కన్పించుఁ గన్పించు
సన్నని బిందువు దూరదూరమ్ము చనుచు గన్పడవు
చిన్నారి లింగంబ! నెకరుకల్ ప్రాంత సిద్ధాబ్జహేళీ! 18

నొగలుపైఁ జర్మంబు బొమికె లోపల నొక్కిన చోట
ముసరుచు నున్నట్టి చూపు పరమార్థముగ నైనచోట
మసలుట మానిన యూహ సర్వము మన్నించుచో, వ
శి! సవదరింతువో నెకగుకల్ ప్రాంత సిద్ధాబ్జహేళి! 19

అలమాయ తనయంద మంతయు నమరించుకొంచు
నలయించలేక నిక జగతియందు రవ్వంత రవ్వంత
వెలఁదులందున నుంచి నీదు నంశల వెతపెట్టుఁ దేజ
చెలమ లెంకించును నెకరుకల్ ప్రాంత సిద్ధాబ్జహేళి! 20

వనివడి యారంపుజిలుగు తెలివిచే వాడియా బుద్ధి
నినుదిస్స మొలవాని మనసులోపల నిలువగా లేదు
కనికని నిలిపిన నైన నింగువ కట్టిన గుడ్డ
చినుగులై యేమాయె నెకరుకల్ ప్రాంత సిద్ధాబ్జహేళి! 21

సీలమండల లోఁతు వాగు నిన్నించు చిత్తంబు నాది
వాలు కామమ్ముగా నుండియుండి తాఁ బడబోసికొనెడు
తోలిన వరదలై యొంచటి దచ్చటఁ దుడిచి పెట్టెడిని
చేలు మట్టము చేసి నెకరుకల్ ప్రాంత సిద్ధాబహేళి! 22

ఏ నెఱుంగుదుఁ గథ లెన్నియో కల వెందుకుం బనికి
రానట్టి వారల మునిఁగి చన్నట్లు రక్షించిన యవి
ప్రాణముల్ నుడిగొని నిన్ను బతిమాలి బొమాలుకొలఁది
జేనెడై మూరెడై నెకరుకల్ ప్రాంత సిద్ధాబ్జహేళి! 23

తినుటకున్నది యింతె చాలు నెక్కువ తెచ్చిపెట్టనను
పనివడి తెచ్చెదు, దానికై కష్టపడునట్లు, నేమి
పని యిద్ది, నమ్మగానిట్లు చేయగా వలయు న, యిద్ది
చినచూపా పెదచూపా నెకరుకల్ ప్రాంత సిద్ధాబ్జహేళి! 24

చచ్చెద నన్నచోఁగాదు బ్రదుకుము, సరియన్లై నీవు
నిచ్చయనం గాదు చావుమనెద వట్లే యన్నఁ గాదు
చచ్చుచు బ్రతుకుమంచనెదు దానికి సరియు, దూఁకె దన
చిచ్చు దూఁకుమనంగ నెకరుకల్ ప్రాంత సిద్ధాబ్జహేళి! 25

నిన్నన్నఁ బనియేమి స్వామి పనియందు నీ తోడఁ జేసి
కొన్న వారికి మహాదేవ! అది చేసికొన్నంత తెలియు
మున్నిట్లు చేసిన స్వామి దర్శనము ఘటిల్లు నన్న
చిన్నలే యెఱుగనో నెకరుకల్ ప్రాంత సిద్ధాబ్జహేళి! 26

వడి నా యొడల్ మరినాకుఁ దెలియని పనులు చేసితిని
చెడి, నా యొడల్ నాకుఁ దెలియకుండెడి స్థితికి, నుమేశ
ఒడలు నాయది నేటికైన నా దగ్గరుండని యట్టి
చెడుత్రోవ పోనీకు నెకరుకల్ ప్రాంత సిద్ధాబ్జహేళి! 27

నిజముగా లేనిచో నాల్గు వ్రేళ్ళు లోనికిఁ బోవుటకును
ప్రజ వారివారివౌ కాళ్లు కడుపులు పట్టుకోవచ్చు
అజ! అప్పుడే లేద యిప్పుడేటికి నది నాకును మన
సిజ దహనా! శివా! నెకరుకల్ ప్రాంత సిద్ధాబ్జహేళి! 28

వైరాగ్య భావంబు కలిగి బ్రదికిన బ్రదుకు తేలికయు
వైరాగ్య లేశంబులేక బ్రదికెడు బ్రదుకు దుర్భరము
వైరాగ్య మననేమి నిన్నుఁ బండించు వ్యవసాయ మందు
జేరదీయు హాలిక! నెకరుకల్ ప్రాంత సిద్ధాబ్జహేళి! 29

అది యట్లు జరుగుచునుండె సాగెడు నంతకాలమ్ము
నది నిత్యమన్నట్లు తలఁచు లోకంబు, నది యనిత్యమని
మదిలో నెచటనో యెఱుంగమియు లేదు, మనము వంచించుఁ
జెదరిన తత్త్వమై నెకరుకల్ ప్రాంత సిద్ధాబ్జహేళి! 30

మనసిది యొక పాఱుబోతు గొడ్డు శ్రీమహిత! సహజము
గనె, కదలక యుండెఱుఁగదు పట్టుకోగా నెంతువేని
మొనసి డొంకలు బీళ్ళు కోళ్ళు తోపులు మోరెత్తిపఱచు
చెనటి ముండ్లకు నీడ్చు నెకరుకల్ప్రాంత సిద్ధాబ్జహేళి! 31

నా కొడల్ వంగదు పట్టుకొని యిద్ది నన్ను వేధించు
నాకంటె సోమరి యుండబోదు పినాకి! యిద్దెల్ల
నా కేల యొకచోటఁ గూరుచుండి ధ్యానము సేతు నిన్ను
చీకాకు పెట్టకు నెకరుకల్ ప్రాంత సిద్ధాబ్జహేళి! 32

తక్కిన నాలుగన్న మయకోశ మాధారమై కలవు
నెక్కఱ లేదన్న మాత్మ కున్న నా కన్నంబు విడదు
బక్క దేహమునకై భ్రాంతి యీ మహాభ్రాంతి మాన్పించు
చిక్కని దైవమై నెకరుకల్ ప్రాంత సిద్ధాబ్జహేళి! 33

ఇది నాది యని కూడఁగాదు నాస్వామి యిది నేను యనుట
ఇది యహంకృతికిని మొదటి రూపము యిది మాయలోఁతు
కదలించి పెట్టు పునాది పడఁద్రోతుఁ గట్టిన మేడ
చెదరని నేనుగా నెకరుకల్ ప్రాంత సిద్ధాబ్జహేళి! 34

ఊహాచే సిద్ధాంతపరచితిఁ దదాశయముఁ ద్యజించినాడ
యూహించు దానినిగూర్చి మరల నీ యూహించుటేలా
ఈహ వదలిపెట్టి, కూడ నూహించుటేటికో మరి యి
సీ !హారిద్వాసనా! నెకరుకల్ ప్రాంత సిద్ధాబ్జహేళి! 35

కట్టెలలో నన్నుఁ బెట్టినపుడైనఁ గాని కామమ్ము
కట్టుబడుట యున్నదా యనేకముల్ కడగి కోసితిని
అట్టడుగున నున్నదేమొ యీ వాంఛ యా వేరు త్రుంపు
చెట్టేది చచ్చును నెకరుకల్ ప్రాంత సిద్ధాబ్జహేళి! 36

నాయందు దయలేదు నీకు ననఁ గృతఘ్నపు మాట యవున
నాయందు దయయుండె నీకు ననుచు ననఁ మనసొప్ప
దోయయ్య దయయున్నఁ గన్నుగవ మధ్య నూగాడు వచ్చి
చేయెత్తి మ్రొక్కెద నెకరుకల్ వ్రాంత సిద్ధాబ్జహేళి! 37

అరయ స్వప్న కథాళి చూడఁ గోపమే యధికమన్పించు
మరియు జాగ్రద్వేళ కామ భావమే యధిక మన్పించు
వెరసి కామక్రోధములివి తక్కువై వెలయవ నుతులఁ
జెరిగిపోయుదు నిన్ను నెకరుకల్ ప్రాంత సిద్ధాబ్జహేళి! 38

నిక్కమ్ము నాయందు నీకు దయలేదని వచింపవలయు
నొక్కయెదో లౌకికంపు మేలు నా కొనగూర్చి నాకు
చిక్కని మనసును దాని నూహింపఁ జేసెను నీకుఁ
జిక్కని మనసును నెకరుకల్ పాలింత సిద్ధాబ్జహేళి! 39

కన్నది యనుభూతి సగము వచ్చి సగము దొరగాగ
నున్నది భోగవేళ నయితమ్ము నా యుల్లంబునందు
నున్నది నీవును, నురక కదలుచు నున్నది మేను
చెన్నుమాసిన మేను నెకరుకల్ పాలింత సిద్ధాబ్జహేళి

కీర్తి మర్యాదలయందు మనను లగించి యున్నానో
కీర్తి మర్యాదలయందు నీవు బిగించుచున్నావు
కీర్తి మర్యాదలు వలదు లే స్వామి కృతముల నెన్ని
చేర్తు నన్నింటను నెకరుకల్ పాలింత సిద్ధాబ్జహేళి! 41

యా దృశీ భావనాయత్ర సిద్ధిస్సమంజసా భవతి
తా దృశీ యన్నట్లు నన్ను పట్టి చైతన్యాకృతిఁ బ్రీతి
వాదించుటకు నేమొ మీర లెవ్వరు పలుకరు లేవు
సీదరింపులు కూడ నెకరుకల్ పాలింత సిద్ధాబ్జహేళి! 42

నేనన్నదే లేని యపుడు పాపముల్ నేనేమి సేతు
నేనేమి సేతుఁ బాపములు చేసితి నీ వన దేని
నే నన్న భ్రాంతి మాయించు నీవును నేను నదొక్క
చేనిలో పంటగా నెకరుకల్ ప్రాంత సిద్ధాబ్జహేళి! 43

అంతయు శూన్యంబుగాగఁ గనిపించినప్పుడు చాల
వింత, శూన్యము గాగఁ జూచిన యతండు నీఁడుండెఁగాదె
భ్రాంతి నేదో చిత్రపటము చూడఁ గావలెనని రూప
చింతనాహత బుద్ధి నెకరుకల్ ప్రాంత సిద్ధాబ్జహేళి! 44

మన్నిత్య భావనాధార! నేను కుమ్మరి పురుగువోలె
నున్నాను తాఁబేలువోలెఁ జేతగాకున్నది యున్కి
యున్నయున్కి యితరులకు నసహ్యమై యొగి బావి నీటి
చిన్న తీపెక్కక నెకరుకల్ ప్రాంత సిద్ధాబ్జహేళి! 45

నిగుడు, లోకము పైకి మనసు నిన్ను ధ్యానించెడువేళ
నిగుడు, లోక వ్యవహార వేళల నీయందె నిలుచు
తగముందు కల్లెము వెనుక వైపునఁ దగిలించినట్లు
సిగపట్లు మారిది నెకరుకల్ ప్రాంత సిద్ధాబ్జహేళి! 46

ఈ మేనితోఁగూడి యిచట నున్నవి యెన్నియో కలవు
ఈ మేను పాశ్రిద్ధ మొకఁడు బిట్టుగానేచి యేర్పడియె
సామి నీ వీ రెంటి నిచట నిచ్చలే సమయింపు! సామి
సీమంతినీమూర్తి! నెకరుకల్ పాంత సిద్ధాబ్జహేళి! 47

మును నిరర్థకమైన దాని సార్థకంబుగ నెంచుచుండి
కని నిరర్థక మైనదానిని నిరర్థకంబుగ నేడు
తనర నెల్లెంచియును గ్రియ మాత్రము తప్పుటలే ద
సినిశిత సుమహాస్య! నెకరుకల్ పాంత సిద్ధాబ్జహేళి! 48

ప్రశమిత తీవ్ర భావమగు వేళల భార్యయు బిడ్డ
లశనంబు పీనినిగూర్చి యూహాలాహతములై పొల్చు
నిశితంబుగా సర్వవేళలందున నిన్నెంచు వట్టి
శిశిర దృష్టులఁజూడు నెకరుకల్ పాంత సిద్ధాబ్జహేళి! 49

ఇవి హిరణ్యాక్షు వరములు కావుగనే మదేభాజి
న వసన! దానిచే దీనిచేఁ జావు నాకు వద్దనుచు
శివ! చావు కానట్టి చావు నాశింతు శివ! జగతికి న
శివకారి కాదిద్ది! నెకరుకల్ పాంత సిద్ధాబ్జహేళి! 50

నీముక్కు మొగము నేనెఱుఁగ శాస్త్రముల్ నినుఁగూర్చి చెప్పె
నీ మాదిరిగ నాశ్రయించి నట్ల ఫలియింతు వీవనుచు
సోమ కిరీట! నాడింతె మీర్మీరు చూచికోవలయు
సీమాంతములదాఁక నెకరుకల్ ప్రాంత సిద్ధాబ్జహేళి! 51

నను నమ్మెదేల యనంగ శాస్త్రముల్ ననుఁ గూర్చి చెప్పె
ననుగూర్చి చెప్పిన దెల్ల నిజమయ్యె నా యనుభవము
నను నిను గూర్చియు నిజమైనఁ గావలె నన్నిం దన వల
సిన దేమియును లేద! నెకరుకల్ ప్రాంత సిద్ధాబ్జహేళి! 52

ఎవ్వఁడో వీని నిందించెనని విని యెచటనో గాని
రవ్వంతయగు బాధ కలుగు చున్నదో రజత గిరీశ!
యెవ్వఁడో యెవనినో నిందచేసిన నీ నాకు నేల
చివ్వ రేపకు కేళి నెకరుకల్ ప్రాంత సిద్ధాబ్జహేళి! 53

నట్టు గాఁ గవనంబునకును నా కవినాభావమైన
యట్టి సంబంధంబు పెట్టికొని చెడి నట్టివాఁడేను
పుట్టి మునింగి పోయినదో యెందఱు పుట్టరు కవులు
చెట్టనై తిని గాని నెకరుకల్ ప్రాంత సిద్ధాబ్జహేళి! 54

మనిసితోడి యహంక్రియానుగతి కాక మనుజుఁడెవడు
తనయందుఁగల విద్యకోసమై పుట్టి దా నొక్కరుండె
యనయము 'లచ్చోపలచ్చ' లున్నా రహంకార పడగఁ
జెనటులు ననుఁబోలె నెకరుకల్ ప్రాంత సిద్ధాబ్జహేళి! 55

ఇన్నాళ్ళకైనను గన్ను తెఱపించి తీ మాత్రపుఁ గృప
మన్ననై తుదమన్ను లోనఁగలియని మహితమా వేళఁ
బన్ని నిన్ గెల్చుట వేరు నీ పీడ వదలుట వేరు
చెన్నుమాలిన పీడ నెకరుకల్ ప్రాంత సిద్ధాబ్జహేళి! 56

నిరుపాయుఁడై యదేపనిగ రాచుచుండిన రాయినైన
నరుగు నన్నట్లుగా నరుగుచున్నానయా విశ్వనాథ!
అరిగియఱిగి చిట్టచివరకీ లేని యట్లుగాఁ జేయు
సిరము గాలికిఁబోవ నెకరుకల్ ప్రాంత సిద్ధాబ్జహేళి! 57

వనరి యథార్థ వాక్యానకు వశుడనై వాక్చమత్కార
మునకును గాని తెచ్చికొంటిఁ గద దారిఁబోవు తద్దినము
లను వందలును వేలు నీదు కృప, నవే లాభించెడిని, వ
శిని జేయుటకు నన్ను నెకరుకల్ ప్రాంత సిద్ధాబ్జహేళి! 58

నా మనస్సే ప్రమాణమని యున్నాళ్లు నాకేలా పొగరు
స్వామి యేనో కాదో యెల్ల పాలింపవలసినదే మొ
త్తము, మీకేలేదు నాకు నేలకందకు లేని దురద
చేమకేటికి స్వామి! నెకరుకల్ ప్రాంత సిద్ధాబ్జహేళీ! 59

తెరచిన యెడఁద వెన్క హరహర మహాదేవ యన్నాంచు
నిరతంబు గాదీ యెడంద, మూయవే, నీలకంఠ! శివ
పరమ మౌనులవోలె నీదు నెడదలోఁ బాలింపు నన్ను
శిరము వాల్చగఁ జేసి నెకరుకల్ ప్రాంత సిద్ధాబ్జహేళీ! 60

మిలనము తొలికర్మఫలము కలిగి మీ మీసన్నిధాన
ములకును వచ్చి కూర్చుండి మీ జపమ్ములు చేసిచేసి
తొలఁచగాఁ బాపముల్ తలతు, నది యున్నదో లేదో నాకు
చిలువ నగల సామి! నెకరుకల్ ప్రాంత సిద్ధాబ్జహేళీ! 61

నా కీ జగతి నధికారములనఁ దృణప్రాయము లగుఁ
గాక, పిల్లల కేమియైన మిగులునో కాదననేల
నీ కృపావశమున మనసు నీ పైన నిలుచుచునుండె
శ్రీకంఠ! దయచూడు నెకరుకల్ ప్రాంత సిద్ధాబ్జహేళీ! 62

దినముల తరబడి నొక్కొక్కప్పుడు తీరని బ్రిదుకు
పనులపై నుండి సిరి దలచుటకు వీలుపడకుండ నుండు
మనసులో దిగులగుచుండు నీ ధ్యాన మహిత వస్త్రమునఁ
జినుగుపట్టినయట్లు నెకరుకల్ ప్రాంత సిద్ధాబ్జహేళి! 63

అపకార! యేదో నాకుఁ బెద్ద యొరిగించినట్లుగాఁ జూపి
చివరకుఁ డెంకాయ పిచ్చికొండ చేసెద వుమానాథ
వివరించి నీ మీఁదఁబెట్టుకొన్నాశ విషయంబునందు
చెవులు పిండకు తండ్రి నెకరుకల్ ప్రాంత సిద్ధాబ్జహేళి! 64

ఒకటి మేలనుకొందు నేను మరియు నీవొక డనుకొందు
నకట! మేలేదో కాదేదో యెఱిగిన యంత లేనాయె
ముకురంబులో నున్న నేను నేనో ప్రభూ! ద్రష్టనేనో
సెకతూలి మఱచితి నెకరుకల్ ప్రాంత సిద్ధాబ్జహేళి! 65

నీవేమి చేయఁగా వలయునో యది నీవు చేసితివి
భావజహర! యింక నేను చేయఁగా వలయుట మిగిలె
జీవితమ్మునయందు నింక నెంత శేషించి యున్నదిగొ
జీవిత పతి! చెప్పు నెకరుకల్ ప్రాంత సిద్ధాబ్జహేళి! 66

లక్ష చెప్పుము వేయిచెప్పు మొక యింత లాభంబులేదు
భిక్షుకుడంచు సన్న్యాసి యంచును బెట్టకు నాకు
దీక్షతో నిన్ను నాలోనఁ బరినిబంధితునిఁ జేయునటు
శిక్షింపు మన్నును నెకరుకల్ ప్రాంత సిద్ధాబ్జహేళి! 67

పదునాల్గు భువనముల్ నీవు కుక్షిలోపలఁ బెట్టికొంటి
విది యెంతవాఁడవో నీవు, నిన్ను నా యెడఁద నిముడ్తు
నది యెంతవాఁడనో నేను, నద్ది నా కనుభూతి తెమ్ము
చిదతీత సంస్థితీ! నెకరుకల్ ప్రాంత సిద్ధాబ్జహేళి! 68

నన్ను నేనే మోసగించుకొంచుంటె నాటక మాడు
చున్నట్టులున్నది ప్రేమ యన్నది యొరులపైఁ జచ్చె,
నున్నట్లు మాట్లాడుచుంటిఁ జరియించుచుంటి నీ పైని
చెన్నారు కోర్కెగా నెకరుకల్ ప్రాంత సిద్ధాబ్జహేళి! 69

ప్రీతి నిమేషమ్ము వాంఛయుఁ బ్రీతి నిమేష పరిహారణమ్ము
మతిలేని బ్రదుకయ్యె నొక్క యత్నము మాలిన యూహా
శితికంఠ! నీమీఁదఁదక్కఁ దక్కిన చేతంబు లోక
స్థితి వృత్తమెగఁబ్రాకు నెకరుకల్ ప్రాంత సిద్ధాబ్జహేళి! 70

బొజ్జికి సన్నాక్ష్మను తిండికేమొ లోపమ్ము రాదు
మదిలోన నీవేమొ వచ్చి నిత్యంబు మన్నింపవలయు
వతనుగా, నవ్వ కావలయు బువ్వ కావలయు నన్నట్లు
శివ మహాశివ లింగ! నెకరుకల్ ప్రాంత సిద్ధాబ్జహేళి! 71

ఇది మనుష్యున కాయువల్పముగ నిచ్చి యెప్పటప్పటికి
బ్రదుకుట యెట్లన్న ప్రశ్న యిందులోపల వచ్చి చచ్చె
డిది లేదు పైసవాశేరులోన జోడి పరాచికముగ
చెదరిన బ్రదుకునై నెకరుకల్ ప్రాంత సిద్ధాబ్జహేళి 72

చిన్ని బ్రదుకు తుదివాళ్ళఁ గైత పండింతుఁ బ్రాసంగు
పొన్ను ధాన్యపురాశి గాగ నా స్వామి పొడిపించి పెట్టు
నెన్నొసంటను నాకు గంగ తోణుకు నీ నెత్తిపై నున్న
చిన్ని చందురురేక నెకరుకల్ ప్రాంత సిద్ధాబ్జహేళి! 73

భావమ్ము భావమ్ముగాగ నున్నచో భయమేమి కలదు
భావమ్ము విస్మృతిని బడసినంత నే భయమెల్లఁగలుగు
భావమ్ము తన స్థితిఁ బొందునట్లుగాఁ బాలింపు కరుణా
సేవధి! శ్రీకంఠ! నెకరుకల్ ప్రాంత సిద్ధాబ్జహేళి! 74

దంతురమగు నూహ సేయఁగోలదిఁ బద్మప్రాణహామయినఁ
గొంత నయమ్ము మానవుల భావనా కుటిలత కంటె
వింతలై బంధుగుల్ సఖుల యూహాలే విప్పలేమాయె
చింత జేసియుఁగూడ నెకరుకల్ ప్రాంత సిద్ధాబ్జహేళి! 75

ఎంతటి యిరుకటం బవుచున్నది యిందైన బ్రిదుకు
సంతాప మొక్కటి విఱుగడైనను జాలును నాకు
ఎంత నాయుంపడ నెంతు వంత నేనెందుకుఁ గాను
చింత యిదేటికో నెకరుకల్ ప్రాంత సిద్ధాబ్జహేళి! 76

అయ్యో యీ మేనున్నదెట్లు తప్పనియట్లుగా నుండె
ముయ్యేరు తలమీఁదగల్లు సామి! యీ మొండి దేహంబు
వ్రియ్యాలై వ్యర్థ సంస్కృతిని మరి శరీరమ్ము కట్టకుము
చియ్యా పట్టను నేను నెకరుకల్ ప్రాంత సిద్ధాబ్జహేళి! 77

ఈ మేను నిజముగా నాది యైనచో నిది కాని యిష్ట
మేమొ దానిదిగాని, స్వామి, నా మాట యేమియు వినదె
కామమ్ము నాదియా యెవరిదేమి యీ కర్మలమెల్ల
శ్రీమద్వ్యాయస్మాళి నెకరుకల్ ప్రాంత సిద్ధాబ్జహేళి! 78

ఒకవేళఁ గానిమ్ము దీని భావింతు నొకవేళ నేమి
ఒక వేయివేళల నిన్ను భావించుచుంటిఁ గదయ్యా
నికరమ్ము కట్టి చూడఁగనె లెక్కకు నీవాడ నగుదుఁ
జికురార్పిత శశాంక! నెకరుకల్ ప్రాంత సిద్ధాబ్జహేళీ! 79

మనసుతో నిర్ణయించితిని గాని మది మది నిల్వనీవు
మనసునకును నిర్ణయంబునకును సంబంధంబు లేదా
మనసుతోనైన దోషంబు గెలుచుట మనసుతో నెట్లు
చినచూపు చూడకు నెకరుకల్ ప్రాంత సిద్ధాబ్జహేళీ! 80

మృతియనఁ బ్రాణముల్ నిలచిపోవుట, మృతివేళ జీవ
గతి యెట్టులుండునో తెలియఁ బ్రాణ సంఘమ్ము బిగించి
మతిఁజూడ నీవు నే నిద్దఱము చిత్సమాఖ్య నున్నాము
శితికంఠ! యిది నిల్పు నెకరుకల్ ప్రాంత సిద్ధాబ్జహేళీ! 81

నిన్ను మఱచిపోయి యొక్క గంట యుంటిన యేని, జగతి
నున్నట్టి మోహాన, మోహమది త్రప్పు నురగ లోకములు
వన్ని నిన్నందుకో మరల నెగఁబ్రాకవలయు నా మెత్తు
స్విన్న మానసుడనై నెకరుకల్ ప్రాంత సిద్ధాబ్జహేళీ! 82

ఆనందమును విస్మృతిం గనుట జీవిదైన లక్షణము
ఆనందమూలమ్ము మఱవడెట్లు నల్పాల్ప భోగావ
సానంబులందలి తృప్తి మఱచును క్షణములో జనుడు
శ్రీ నిరంతర తేజ! నెకరుకల్ ప్రాంత సిద్ధాబ్జహేళి! 83

విమల మహోదారమగు ప్రతిక్షణ విస్మృతి నేను
శ్రమ మెఱుంగని యట్టిదగు ప్రతిక్షణ జాగ్రత్త నీవు
ఉమతో సగము వేఱు నీవు మే మొకడె యిద్దఱము
చిమిడిన యాత్మలై నెకరుకల్ ప్రాంత సిద్ధాబ్జహేళి! 84

నాకు నీకు నభేదముగఁ దలంచుచున్నా నందుచేత
నా కంటి తుదలందు నీవు వచ్చి కన్పడవనుకొందు
నా కీ యభేదము నీవు చేయుచున్నది సుమీ నేను
శ్రీకంఠ నినుగొల్తు నెకరుకల్ ప్రాంత సిద్ధాబ్జహేళి! 85

ననుఁ బైకిఁ గొంచురావలయు నంచు నున్నది నీకు, నేను
కనులు మూసి మరింతలోని లోనికి గమియింప నెంచ
నను వచ్చి వెన్నానుకొంచు నిల్చెదు నా కన్నులందు
సెనగ బద్దంతయై నెకరుకల్ ప్రాంత సిద్ధాబ్జహేళి! 86

అవి యేమి వెల్గులో కంటియెదుట సమావిర్భవించు
శివములై షట్పరానంత యానంద సేవధులగుచు
శివ! బాధపడుచున్న మేనొకండు విస్మృతికిని రాదు
శివ! చంపు మిదికూడ నెకరుకల్ ప్రాంత సిద్ధాబ్జహేళి! 87

తన నొసంట నిమగ్నుడై పినాకల స్త్రకమును వంచి
కొని సహస్రారమ్ము లక్ష్యముం జేసి కొట్టుచున్నావా
నినుఁ గూరుచున్నవానిని వృషాకపీ నే నెరుంగుదును
సృణికల్పనారాచ! నెకరుకల్ ప్రాంత సిద్ధాబ్జహేళి! 88

నావంటి మానిసుల్ బ్రదుకుచుండుట నాతియు సుతులు
దైన్యంబు నెంచుచుండుటయుఁ జచ్చుట తక్క నేమాదు
రీవు కృపాదృష్టిఁ జూడ నెంచవ యేని యేమాదు
సేవాగత ప్రీతి నెకరుకల్ ప్రాంత సిద్ధాబ్జహేళి! 89

పొగడుచునుందురు మిత్రు లొక్క వైపునుండి జనునిఁ
దెగడుచు నుందురు శత్రు లింకొక దెసనుండి జనుని
జగతి వానికి నెంత నీవు వ్రాసితో సాగెడు నంతే
సిగమీఱి చనదెందు నెకరుకల్ ప్రాంత సిద్ధాబ్జహేళి! 90

ఒక్కప్పుడు నిజంబు నన్ను రక్షింతు వోగి జన్మ వితతి
చిక్కు తీరిన దనిపించు నోక్కప్డు చివరి క్షేమగునా
యక్కటా యనిపించు జీవితపుఁ బరమార్థమ్ము తెలియు
చిక్కు తీరదటంచు నెకరుకల్ ప్రాంత సిద్ధాబ్జహేళి! 91

ఎప్పటికప్పుడు నధికమో ధన మేమొ వచ్చునని
ఎప్పటికప్పుడు పెద్ద యుద్యోగమేదో వచ్చునని
రోప్పుచున్నది యాస సన్న్యసింపించు రోగమ్ము కుదురు
చిప్ప చేతికివచ్చు నెకరుకల్ ప్రాంత సిద్ధాబ్జహేళి! 92

ఇది యేమియును లేదటంచుఁ దెలిసియు నీ తనూవశత
బ్రదుకుట తప్పక మరల నిందులోపలఁ బ్రవేశించి
యుదయించు జ్ఞానంబు మరుగుపడి పోవుచున్నది నన్ను
జెదలు పట్టగ నీకు నెకరుకల్ ప్రాంత సిద్ధాబ్జహేళి! 93

భ్రూయుగంబునకును నడుమగా నిన్నుఁ బ్రోవుచేయంగఁ
జేయు యత్నములెల్ల సన్న మెఱుములై చిదిసిపోయెడిని
నా యెడందను బందిమైన నిన్ను నీ నాల్గు మెట్లెక్కఁ
జేయఁజాలకపోదు నెకరుకల్ ప్రాంత సిద్ధాబ్జహేళి! 94

బిడ్డను సరిదిద్ది మంచితోవను బెట్టుకోవలయు
చెడ్డమానిసినైన యోగమార్గానఁ జేదుకోవలయు
సడ్డగాఁ గలిలోన స్మరణమాత్రము చాలునన్నారు
జిడ్డయ్యె నీస్మృతి నెకరుకల్ ప్రాంత సిద్ధాబ్జహేళి! 95

భార్యపై బిడ్డలపైన మమత తప్పమరొక్కఁడగు న
మర్యాద లేదష్ట ఋద్ధి చాలవా మరియున్నచో న
స్వర్యాద లీ ధాత్రి లక్షలున్నవి మదినిలఁబెట్టు
జీర్యదాశాజ్యోతి నెకరుకల్ ప్రాంత సిద్ధాబ్జహేళి! 96

వేతును వేతున యెవరికైనను వినువెత్తుఁ దుదకు
బ్రాఁతిగ నేనేమొ యతినిగాక పోవచ్చునైన జల
పాతమ్ము లున్నవి చిన్న వాగులే వలదు నీ మాళి
శీతాద్రిసుత లేదా నెకరుకల్ ప్రాంత సిద్ధాబ్జహేళి! 97

తన తీరెఱుఁగు మప్పు పుచ్చుకొందును తలఁచికొన్నంత
వనితా సుతుల మీఁద మమత చెప్పిన భ్రాంతి పొందకుము
క్షణము పట్టదుసుమీ నాశనము సేయుగా నెంత తూలి
చిన మోహమైనను నెకరుకల్ ప్రాంత సిద్ధాబ్జహేళి! 98

నాకేమి యభ్యంతరమ్ము లేదయ్యా నాథ! ప్రారబ్ధ
మీ కేళిగా సాగునేని నీవు నా యెదనుండి పోకు
తేఁకువ దొంగవేషమ్ములను వేసితివ యేని చాల
చీకాకు సేసెద నెకరుకల్ ప్రాంత సిద్ధాబ్జహేళి! 99

తల మథించుటయేల గుండెపై నెక్కి దంచుటయేల
యెలయాక కడుపులో సుళ్ళు తిరుగుటయేల యెందుకివి
సులభమ్ముగా వచ్చి యాత్మలోన గూర్చుండక యెట్లు
శిలవైతి కదలక నెకరుకల్ ప్రాంత సిద్ధాబ్జహేళి! 100

శ్రీతమాలశ్యామలింగ! సిద్ధసంసేవిత లింగ!
హేతుహీన సనాథ! అన్నపూర్ణా సహిత విశ్వనాథ
నీతామరధునీక జాటజూటా! మణి శశి కిరీట!
స్మిత వియన్మౌళి నెకరుకల్ ప్రాంత సిద్ధాబ్జహేళి! 101

# విశ్వనాథ మధ్యాక్కఱలు

# ముప్పంగి శతకము

# విశ్వనాథ మధ్యాక్కఱలు
# మున్నంగి శతకము

శ్రీ పయోధర సిక్త పులక సస్యకాద్రి క్షేత్ర పాల!
దీపి తాధ్యాత్మిక వృత్తి సురలతా దీప్తాలవాల!
సావర్ణ్య నిర్ఝరిణీ ప్రసన్నాంబుజని పాదమూల!
ధీ పరివాహ నిర్మల మున్నంగి వేణు గోపాల! 1

బాల చంద్రికి ఫాల రుక్మిణీ సత్యభామా సమేత
హేలా! ప్రవాళాధరా ధర న్యస్త శృంగార వేణు
లోలా! ప్రసన్నార్తి భావ ఫలిత కల్లోల వారాశి
వేలా! మహాఘ నిర్మల! మున్నంగి వేణు గోపాల! 2

సజల జలద నీల దేహా! నిర్వ్వంచి జల రాశి గేహా!
భజన ఝర పరిణతోహా కారుణ్య పాటిత మోహా!
నిజ మహో వారాశి పూర్ణ చిత్త ధునీ పరిణాహా!
వృజిన వనీ దావ దాహా! మున్నంగి వేణుగోపాల! 3

తరుణ చంద్రాతప హాస! దర్పిత దానవ హ్రాస!
పరమ భక్త మనో విలాస! దుర్జన భావ నాయాస!
దర చక్ర చిహ్న సుందర పదాంక బృందావనీ ఘాస!
విరచిత దనుజ సంత్రాస! మున్నంగి వేణు గోపాల! 4

సందీపి తానంద నగర వీథికా సంచార సౌమ్య!
మందార పరిమళ సూక్ష్మ రేఖానమన్మూర్తి రమ్య!
ఇందిరా హృదయ సాహిత్య మృదుల సాహిత్య పారమ్య!
బృందారకానేక గమ్య! మున్నంగి వేణు గోపాల! 5

ప్రాణ సంస్రవణాది భూత చిత్కళా ప్రథమ స్వరూప!
రేణూ భవద్జో గుణ ధురా ధూమ రేఖా కలాప!
ప్రాణ సంయమ ధన ప్రచయ కృత ముక్తి భండార రూప!
వేణీ ధృత శిఖి కలాప! మున్నంగి వేణు గోపాల! 6

కారుణ్య రస సముద్రా! జగచ్ఛ్రేణి కళ్యాణ ముద్రా!
తారుణ్య గుణ సముద్రా! వ్రజ స్త్రీ జగన్మనో భద్రా!
సారలోకారిరుద్రా! లయాంభోధి శయ్యాత్త నిద్రా!
వీరతా రేఖాసమార్ద్రా! మున్నంగి వేణు గోపాల! 7

రుచిర రుచిర మందహాస రేఖా నిరూపిత తత్త్వా!
ప్రచుర ప్రచుర శౌర్య కార్య రేఖా ధురాదీప్త సత్త్వా!
నిచిత నిచిత సత్క్రియాత్త పుణ్య నిర్ణీత మహత్త్వా!
విచికిల పరిమళ స్వత్వా! మున్నంగి వేణు గోపాల! 8

ప్రశమిత పంచేంద్రియోగ్ర పరిణద్ధ వనరాశి దావా!
శశికళా కోటీర సదవినా భావ సంగత స్నేహా!
మశకాది బ్రహ్మ పర్యంత జీవ నిర్మాణ నిర్వ్యూహా!
నిశకలితాశర వ్యూహా! మున్నంగి వేణు గోపాల! 9

సాందీపని బ్రహ్మమర పరివృఢ పాఠశాలాగ్ర శిష్యా!
మందార భూజాభ దివిజ తారకా మండల శివ్యా!
వందారు భక్తజనైక రక్షభూత ఫల్గున ప్రేష్యా!
బృందావనీ కల్ప వృక్షా! మున్నంగి వేణుగోపాల! 10

మీయూరు వినలేదు మున్ను, కనలేదు మీ మూర్తి మున్ను
మాయురే నా మీదఁ నెంత ప్రేమ, యీ మాదిరి నీవు
వ్రాయించుచుంటి విల్లు శతకంబు నీ పైన నా చేత,
ప్రేరయో గుణవిశాలమూర్తి! మున్నంగి వేణు గోపాల! 11

ఆ యే పురా జనుర్వ్వేళ, నీదౌ పదాంభోజ పూజ
కై యున్నయే చిన్ని పూవు మొలచిన దైన యా నేల
లో యోగ్యసార మృత్కణమ నైతినో, లో గుండెలోన
వే యింత కరుణకు నీకు, మున్నంగి వేణు గోపాల! 12

మా యూర నీ పేరి స్వామి కలడు, కమ్మ కులాంబుధి శశి
పాయక కట్టించె దేవళము తా గూడవల్లి బ్రహ్మయ్య,
ఆయన వరుసకు మామ నాకుఁ, జిన్నప్పటినుండి
వే యెఱుంగుదు నిన్ను నేను, మున్నంగి వేణు గోపాల! 13

మా యూరి పెద్దలు మామ బ్రహ్మయ్య, మా తండ్రి; నాదు
నాయన విశ్వేశ్వరునకుఁ గట్టించినా డాలయమ్ము;
మీ యిద్దఱి నెఱుంగుదే ననాదిగా మేటి దైవముల,
పేయమైన సుధా కృతులను, మున్నంగి వేణుగోపాల! 14

తిరుపతి మంగళ సింహ భద్రాద్రి దేశంబు లందు
మఱియు నీ మున్నంగిలోన నచ్చట మయూరం గాశి
సిరిగిరిలో ద్రాక్షతోటం గాళహస్తిపురి మాయూర
వెరవుగా మీరును మీరె మున్నంగి వేణుగోపాల! 15

ఆయన మైన నీవైన నా హృదయ స్పందనంపు
ఛాయలు మూర్తి తాల్చితిరి, స్పందనచ్ఛాయ లివెల్ల
వేయి విధంబులై వరలు గాదయ్యా, విశ్వాంతరస్థ
పేరియ ఆకార! హృత్సార! మున్నంగి వేణు గోపాల! 16

అరయంగ నా గుండెయందు నే నెంత యార్తిం గుందెదను
పరగంగ నంత నాలోన నీవు రూపంబు గట్టెదవు
శరణాగత త్రాణుడంచు, లోక రక్షా శీలుడంచు-
బిరుదు మాటల కేమిలెమ్మి మున్నంగి వేణుగోపాల! 17

జడుడను నేను, నేత్రముల కింపైన స్వామివి నీవు
వడిగ నా కోటి కోరికల ఫలమిచ్చు స్వామివి నీవు;
బుడుతడ! నీ యంత యందగా డెందు పుట్టడు. నిన్ను
విడంద్రొక్కు కోరికల్లేవు; మున్నంగి వేణు గోపాల! 18

ప్రాణశక్తి యదంత పరమమా నీది, బాల గోపాల,
స్త్రైణంబు వేసకు వేల తోడి సంసారమ్ముతోడ
వేణు వూపిరి తిత్తు లెండఁబెట్టు నీ విద్య మానవును;
వీణ పనికిరాదా నీకు? మున్నంగి వేణు గోపాల! 19

స్వామి నీ కోవెలలోన గొనబైన సంపెంగ చెట్టు
కామన పరిమళ మెందు నలువైపు గమగమలార్చు
ఏమేమొ పిల్లల మయ్యె వెదకి యెంతెంతైన కనము
వే మమ్ము గికురింతు వీవు మున్నంగి వేణు గోపాల! 20

నా చిన్నతనములో వెండివా పంగనామాలతోడ,
మేచకాననముతోఁ గోసలా వెండి మీసాల తోడ,
లాచిన యందంపు కీవి తోడఁ, బిల్లనగ్రోవి తోడ,
వీచితి చిరమైన గాలి మున్నంగి వేణు గోపాల! 21

విచ్చేసి యిచట మున్నంగిలోపల వేంచేసి యున్న
చొచ్చిన దొరవీవు, నిన్నుఁ జూడక చూచినయట్లె
వచ్చని నా సామి కట్టితివి కంటి పట మింతగాగ
విచ్చిన సంపెగ వోలె; మున్నంగి వేణు గోపాల! 22

మచ్చిక యదియెంత, స్వామి! నాపైన మసలు లో నీకు
మచ్చరంపడవు లే, నేను శివ భక్తి మన్నింతు నంచు,
నిచ్చట నచ్చట నాకుఁ బ్రభు! భేద మింతైన లేదు;
పెచ్చు మీ కరుణ కావలయు మున్నంగి వేణుగోపాల! 23

కచ్చె పూనకుమోయి నాదు పైన, నీ కాలి లెంక వయి;
మచ్చరం పడవులే పడిన చో నిట్లు మధ్యార్క్క-ఆలకు
నిచ్చట పిలిపింతు వేల నన్ను, మీ యిద్దరి చూపు
విచ్చికచ్చినది గుండియను మున్నంగి వేణు గోపాల! 24

ముప్పేటగా నున్నదయ్యా నా స్థితి మున్నంగి దేవ
యెప్పటి జ్యోతియై యెఱుక చాలమి, యింద్రియావృతియు
మప్పికగా నీవు శివుడు సంజలై మధ్య భాగమున
విప్పవే యీ పురి నాకు మున్నంగి వేణుగోపాల! 25

మున్నెప్పుడో కోటి మంది నీ పైన మోహంబుజేసి
సన్నిధి నున్నట్టి కృష్ణలోపల స్నానంబు చేసి
రన్నారట గదయ్యా మునులు నీ పాద కంజాత యుగము
విన్నాను లేవయ్యా నేను మున్నంగి వేణు గోపాల! 26

నీకు మాకును మత్స్య భేద మింతె యో నీరజాతాక్ష
వాకలై సిరి, నీవు పొంగులయి బోర్ల పడుటయు లేదు
లేకున్న లోపలఁ గుమిలి చచ్చుటలేదు; తేజో స
చిత్కృత పరిశుద్ధతత్త్వ! మున్నంగి వేణుగోపాల! 27

భామిను లిద్దఱు నీకుఁ జెఱియొక్క ప్రక్కను గలదు
శ్రీ ముగ్ధ రవ సాధుమూర్తి వేణువు చేతిలోఁ గలద
యీ మూడు లోకముల్ నీకు మునిగిన నేమి, నీ పాట
ప్రేమయు నున్నచోఁ జాలు మున్నంగి వేణుగోపాల! 28

భగవంతుడవు నీవు కాదటన్నచో బాలగోపాల
భగవంతుడను నేను కాదటందువు ప్రౌఢ గోపాల
భగవంతుడవు నీవ యన్నచో నేన భగవంతు డందు
ఎగత భగవదహంకార మున్నంగి వేణు గోపాల! 29

నీవ స్వామి వటంచు నిన్ను ధ్యానించి నీ రూపు గనగ
నీవు స్వామివి కాదటంచు నిందించి నీ శిక్ష పొంద
తా వేడు వేడో పండిన తపస్సైన దైత్యతయైన
వేవిళ్లుగాగ రావలయు మున్నంగి వేణుగోపాల! 30

ఉభయ లోకమ్ముల తత్త్వ మొకచోట నురువుగాఁ గూడి
లభియింపఁగల యట్టిచోటు గానమ్ము. లావణ్యరాశి
ప్రభు! దీని వ్యాఖ్యగా రుక్మిణీ సత్యభామలు కొలువ
విభువేణువు ధరింతు వీవు మున్నంగి వేణుగోపాల! 31

అప్రర జ్యోతీరూపమైన నీ వెల్గు ధ్యానించి తెలియ
నప్రమైన తోవలోపలికిఁ జొచ్చి యీ సర్వమ్ము తొలఁచి
భువి మిన్ను దేశకాలములు గ్రహములు భూతముల్ కర్మ
వివరించి తెలియఁగా లేము మున్నంగి వేణుగోపాల! 32

పదిలమౌ చిరునవ్వు వెలుగు ప్రినవ శోభారాశిగాఁగ,
పదమలారుణ నూత్న సుమమ కుసుమ కేసర కాంతిగాఁగ
మృదు వేణురావమ్ము బంభరధ్వని రీతిగా, నీదు
పెదవిపై మధుమాస మొప్పు; మున్నంగి వేణుగోపాల! 33

నీపైన మధ్యాక్కఱలను వ్రాయుచు నిద్రింప నేను
స్వాపమ్ములోన నా స్వామి బంభర ధ్వానమ్ము వింటి;
శ్రీవతీ నీ వేణురావ సాంతత్య మృదు ధారవచ్చి
వీపున కంటుకపోయె మున్నంగి వేణుగోపాల! 34

కాళింది నీరమ్ము వెనుక తట్టున కాళియ భుజగ
మౌళీంద్ర మణికాంతి పాద దేశాన, మౌళిఁబింఛమ్ము
బాళిమై దెసలందు నీలమణి యక్షబాసల చెలువు
వేళా వియన్మూర్తి నీకు మున్నంగి వేణుగోపాల! 35

కిటకిటలాడెనో నాడు మున్నంగి కృష్ణాతటంబు
బటువైన నీ దేవళంబు తిరుగనప్పటి కోటి మునులు
జటలతోఁ గృష్ణాజినములతోఁ బీన జంఘులతోడ
పెటిలిన దృగ్వహ్నిసమితి మున్నంగి వేణు గోపాల! 36

నవ్వాలెండైన నా స్వామి యీలాటి నాణెంబు కలవా
జవ్వాది గమగమ మెరుపు పిండు పచ్చని సన్న సుషమ
కుఱిప్పిన సంసార మోహసంతతి కూరుపు విఱుపు
విప్పిన తొలి వెల్గు కలసి మున్నంగి వేణు గోపాల! 37

మునికోటి వచ్చి యానాడు నినుఁ గోటిపూలఁబూజించి
కనినప్డు నీదు గర్భాలయంబది గర్భాలయంబో?
సెనగ పూవులబోని నీదు చేడెల చికిలింతలైన
పెనగొన్న నవ్వులతోటా? మున్నంగి వేణుగోపాల! 38

కృతయుగంబునఁ బ్రతిష్ఠించిరో నిన్నుఁ గేవల మీవు
సతులతో ద్వాపరాంతమున మువ్వురు చనుదెంచి యిమ్ము
జతనుగాఁ బూజించుకొంచు ద్వారక చనినారో యేమొ
వితతాత్మ పూజానుకూల! మున్నంగి వేణు గోపాల! 39

శిరసున నుండి స్వర్గంగ దిగివచ్చి చెంతను నిలువ
గిరిరాజ దుహిత కోపమున నరమేని కేరింత వలద
గరళంపు మెడకాంతి మేన నల్లడఁ గ్రమ్మగా శివత
విరజిమ్మి వచ్చితో యిటకు మున్నంగి వేణు గోపాల! 40

నా హృదంతరమున యందు మృదు వేణునాదంబు కలదో
బాహిరిల్లిన యట్టి గేహ భామినీ భావంబుకలదో
మోహనాంభోధర స్నిగ్ధ వర్ణగ మోహంబు కలదో
చేహరమయ్యె నీతోడ, మున్నంగి వేణుగోపాల! 41

చందనాచల గంధవాహ బాలక సంస్పర్శ సుఖము
పొందుచున్నది గుండె వేణు మృదురవమ్మును సంస్మరించి
నందనందన, యెప్డు విన్నదిద్ది! మానస మాత్మ గడప
విందైన యపుడు విన్నదియో! మున్నంగి వేణు గోపాల! 42

చాలి యూ నిమరలో విన్నయట్టిది శంఖ రవమ్ము
పోలెనున్నదియు, లోకమ్ము దానితోఁ బోలి లేదయ్య;
లోలేతర ద్యుశాంత! దానవే నీలలోహితుఁ డనగ
వీలుగా నున్నది నిన్ను మున్నంగి వేణుగోపాల! 43

పరమేశ! అది వేణు రవము శంఖరవమ్మును గాను
పరితోభ్రమణ సేయుచున్న బంభర స్వానమ్ము స్వామి
అరయ జీవుడు సేయు షట్పదీస్వాన మట్టిది, తేనె
విరులను వెదకెడు వేళ; మున్నంగి వేణు గోపాల! 44

ఇంక నింవొక చిత్రమున్నదో స్వామి యే నీ విచిత్ర
పంకంబునం జొరంబడెడు వేళ జీవ విశిష్ట లక్ష
ణాంకంబు భ్రమరీ నినాద సాహిత్యమైతి నా స్థితియు
వేంకటపతి మేలు మరల మున్నంగి వేణు గోపాల! 45

నీరమ్ముచేత నల్లనిది కాళింది నీవామె వదలి
పేరునుబట్టి నల్లనిది యీ కృష్ణవేణి జేరితివి;
ఊరక నీ యొంట బుట్టిన గుణంబిది హైమాంగ లతలు
పేరిమి చేతురు నీకు మున్నంగి వేణు గోపాల! 46

ఇంత మాయాప్రియుండీవు నెందుకోయీ నీకు వలతు
రింతులు సత్త్వగుణాశ్రయుల్ రుక్మిణీందిరా సతులు
వంతులు వంతులుగాగ నీ కడ వచ్చి యే మనుభ
వింతురో తెలియదు స్వామి మున్నంగి వేణు గోపాల! 47

పైకి నెంతో ప్రేమయున్న యట్టులు ప్రకటింతు, లోన
నీకంటె శుద్ధ బోధ స్వరూపుండు నిర్గుణుం డెవండు?
నీకయి వగవగా స్వామి నావంటి నిర్భాగ్యుం డొకడు
నేంకిపట్టినవాడు వలయు; మున్నంగి వేణు గోపాల! 48

నేను నిన్నాయిటంగా నీ భవత్సఖు నీల లోహితుని
గానీ కపుంబోమల్ సనుమ బంధింపగాం దలంచెదను
శానొక మూర్తి! యా చట్టి శివ శివ! తమరింకం గదల
వేణువు నతు లొక్క గంప మున్నంగి వేణు గోపాల! 49

దాని కాపేరు పెట్టితిమి, యా పేర దానినిం బిల్వ
దానికిం దెలియగా వలయు ముందుగాం దనపేరదంచు
తా నింతమాత్ర స్వాములకుం దెలియుదో తమరికి ? నిన్ను
వేణుగోపాలుం డన్నాము; మున్నంగి వేణు గోపాల! 50

వేలకువేల్నమస్కృతులుగా మిమ్ము పిలచి యేమయ్యొ
చాలక లక్షలు కోట్లు పిలుపులు శ్రీమహైరి మున్న,
గోల పిలుచువానికైనఁ బిలిపించుకొనువానికైన
పిలగావలెఁ ద్రపాభరము మున్నంగి వేణుగోపాల! 51

కడఁగి నీ కద్ది లేదన్నమాట యుగయుగాల మాట,
కడఁగి నాకుంగూడ లేనియట్లుగా ఘటియించుటకును
వడి నిర్ణయము చేసినట్లుగా మాట పలుకును లేదు,
బిడియమ్ము నాకేల యింక? మున్నంగి వేణు గోపాల! 52

ఈ మొదల్ తుదలేని యింత సృష్టిలో నేనొక యణువు
కాని యెఱుంగుదుఁ గాని తెలియు నీ గడునుందనమ్ము
స్వామి పవిత్ర్యాణువులో బీరువోకుండ బట్టితి తీపి
వేమును సార్వకాలికము మున్నంగి వేణు గోపాల! 53

ఇదిగో నా స్వామి యీ నామరూప సాహిత్యంబులోన
పదిలంబుగా భద్రపరచిరో నిన్ను పరమర్షిగణము,
మొదలు తుదల్ లేని నామరూపాల పోకళ్ళు లేని
చెదగింజతనమె భద్రమ్మొ మున్నంగి వేణు గోపాల! 54

నిదురించుచున్నప్డు మేలుకొనియుందో నీవు గోపాల
నిదురించుచుందువో మేలుకొన్నప్డు నీవు గోపాల
నిదురించుటయు మేలుకొంట రెండే రెండు లేక యొకడె
పిదులని నిద్రావిలోల! మున్నంగి వేణు గోపాల! 55

మొదల మానవ శిల్పి నిన్ను రాతిరూపున సంతరింప
నెదలోన నెంచుట యెంత యుచితమో యెఱుగను రాద
కదలని మెదలని నీవు రాతివి గాక యేమగుదు
పెదవిపై నవ్వులకేమి? మున్నంగి వేణుగోపాల! 56

ఒక కొంతకును మంచివాఁడు గావున నుపలంబు గొనియె
నికరంబుగాఁగ వజ్రింబు గైకొన్న నీ యలభ్యతయు
ప్రకటితంబై యుండు నీదు గుణడియ పట్టిచ్చి యుండు
పెకలింపగా రానివాడ మున్నంగి వేణుగోపాల! 57

అలుకమై నిది యుందు రిద్ది యనరని నగునె నీయంత
దలుపుక పోయెడివాఁడు లోకానఁ దోచదు గాక
పలుకవంచును నీకు విసిగి పోయిన భక్తులు నిన్ను
పిలుచుటయే తెల్విమాలి మున్నంగి వేణు గోపాల! 58

మొకరి యనుస్వారమునకు నాద్యంతములు లేవటంచు
నొక గొప్పగాఁ జెప్ప నెంత తెల్వియో యోస్వామి దాని
నకట! శూన్యంబంట అంత తెల్వియే వ్యాఖ్యాతలెల్ల
వెకలులు నీకైనవారు మున్నంగి వేణుగోపాల! 59

సంకల్పము వికల్ప మివ్వి రెండును జంతుత్వ మెడయు
నంకముల్ కార్యకారణ సమన్వయ మద్దియ మానవత
యింకఁ దా మవి పట్టనట్టి పొలమున నెఱుగుట నిన్ను
వేంకటపతి యద్ది తెల్వి మున్నంగి వేణు గోపాల! 60

కన్నులలో నీరు నిలచి గొంతులో గాద్గద్య మొప్పి
వెన్నులోపలఁ బుల్కరించి మధ్భుజా వీధిలోఁగదలి
కన్నుంబొమలమధ్య బర్వు దించిన కరణి భాసించి
వెన్నుడా నీ వనుకొందు మున్నంగి వేణుగోపాల! 61

నిదురపోవుచు నున్న యప్పుడు వెలుంగు నిర్వచి యాచుఁ
గదలకుండగ నున్న యప్పుడు వెలుంగు కల దన్న కలదు
నిదుర మేల్కొని యున్నయప్పుడు సహస్రనిర్ఘరంబులుగ
పిరిదిలినప్పుడు కదా వెలుఁగు మున్నంగి వేణు గోపాల! 62

వెలు గన్న యట్టిది స్వస్వరూపమా వృత్తియా, వృత్తి
వెలుగుకు సహజమా! యత్నకృత మట్లు వృత్తి కల్పితమా!
అలయికయే వృత్తి సముపసంహృతియా! స్వస్వరూప
విలసన మిది యెల్ల నీవ మున్నంగి వేణుగోపాల! 63

ప్రభు! ఉపాధిగత సౌందర్య మననంబు వస్తుస్వరూప
విభవంబు ప్రాపింపజేయునే! వస్తు విభవంబు మనన
విభవంబు రెండు నంచులను నేకమై వెలసినఁ గాక
విభు! సాధ్యసాధ నైక్యమవు మున్నంగి వేణుగోపాల! 64

గిరిశేఖరస్థమా సరసి సుందరాకృతి, కృపీటగమా!
గిరిమెత్తు, ప్రస్తర శ్రేణి విన్యాసకృతరేఖ పొలుపా
పరగ నా కూడికో. రుక్మిణీ సత్యభామా సమేత
విరచి తానంద తటాక! మున్నంగి వేణుగోపాల! 65

నీ యంద మంతయు సంవనుత నీవు నిద్రించు వేళ
మాయురే యెంత వర్ణించి తృప్తి యన్మాట కన్పడదు
ఓయి! నీ వాకవేళ నిదుర మేల్కొందువో యన్న భయము
వేయి చెప్పము నీవు గాని మున్నంగి వేణుగోపాల! 66

ఆ నిద్రలో నీదు పెదవిపై నాడు నా లేత నవ్వు
ప్రాణమ్ములందునఁ గూరుచున్నది ప్రాణేశ! మాకు
ప్రాణమ్ములకు నీవు మేలుకొను నూహ రానీవు నిత్య
వేణు నాద విమోహాకారి! మున్నంగి వేణు గోపాల! 67

వేని నిద్దుర పట్టరాని మోహమ్ము వెలయించు నింత
వాని మేల్కనుట యీ మోహ విచ్ఛిత్తి పచరించు నంత
కాన మేల్కొన నీవు మేలుకొన నీవు కలకల మమ్ము
పీనమహా మత్తులోఁ బెట్టి మున్నంగి వేణు గోపాల! 68

నిన్ను నిద్దుర లోన నుండి లేపగా నిశ్చయించితిని
నన్ను మోహంపెట్ట లేవు నీ వింక నవ్వులతోడ
నన్ను! జాగ్రజ్జ్యోతి పైన యీ వెల్గు లవి యెట్టు లుండు
వెన్నుడా! చూడనే వలయు మున్నంగి వేణు గోపాల! 69

కనురెప్ప సంపంగిరేక పోల్కఁగాఁ గ్రమ్మిన మత్తు
వినివారితమ్ముగాఁ దమ్మి పోల్కఁగా విప్పవే కన్ను
అనితర లభ్య సౌందర్య! సాక్షాత్కాయనికుడ నాచు
వినిపింతు బ్రాభాత గీతి మున్నంగి వేణు గోపాల! 70

మేలుకోవే స్వామి మేలుకో స్వామి! మిలమిల లైన
యీలీల వెలుగుల కేమి లే స్వామి! హేరాళమై య
లోల చ్ఛటా పూర్ణమై మెఱుపు తీవలో యున్న సరసి
వేలాకమం బైన లీల మున్నంగి వేణుగోపాల! 71

మేలుకోవే స్వామి మేలుకో స్వామి! మృదుల సౌదామ
నీ లతా నవ పిశంగచ్ఛటా హాసంతీ సటత్స్వమ
మేలుకోవే స్వామి మేలుకో! చల న్మేచ కాంభోద
వేళా హాస దిరమ్మదముగ మున్నంగి వేణు గోపాల! 72

మేలుకో నా స్వామి! నాదు గుండెలో మేలుకో కలిత
మాలా చల ద్గాఢ దుఃఖ నిచయ సంహారణమ్ము గాఁగ
కేళీ మన స్సమాకృష్ట మోహ నిచయ నికృంతనమ్ముగను
భీ లతా మూలమ్ము తునుగ మున్నంగి వేణు గోపాల! 73

మేలుకో నాదు గుండియను దయచేసి మేలుకో వయ్య
మేలు కోరినవారి కొఱకు జాగుగా మేలుకొందు వని
కాలాన మేల్కొనుసరికిఁ బ్రాణాలు కడఁబట్టు నంచు
వే లుదాహరణముల్ కలవు మున్నంగి వేణుగోపాల! 74

నిదుర మేల్కొను మంచు మాటిమాటికి నీకిట్లు చెప్ప
నిదురపోయెడు వాఁడిచట నెవం డని నీవందు వేని
నిదుర నాకును మాత్ర మున్నదా యేమి? నిద్రాభినయము
ప్రిదిలించు కొను మంటి గాని మున్నంగి వేణు గోపాల! 75

అభినయించుచు నిద్ర, మేలుకొని యుంటి ననుకొంట వేఱు
అభితో వినిద్రా గతుండు నా రీతి ననుకొంట వేఱు
నభయులు మాదృశుల్ స్వామి రెండవ జాతి, నీ కరుణ
విభు! లేదు, లేదు జాగ్రత్త మున్నంగి వేణు గోపాల! 76

ఉన్నదా నందన వనము, వని కుడి కొగ్గి మిన్నేఱు
చన్నది మలువుగా, మలుపులోఁ దూరాసాపాలుని మేడ
కన్నా కగు సుధర్మ వీధి కనిచెప్పఁ గన్నట్టు లౌనె
విన్న మాత్రాన స్వర్గంబు మున్నంగి వేణుగోపాల! 77

పెదవిపైఁ జిన్నారి జాజి పూవవ్వ పిల్లనగ్రోవి,
నుదురుపై నెమిలి పింఛియము క్రొన్నిడ మూల్కొను ననగ
మదన గోపాలుని వదన మండల మాధుర్యమెల్ల
విదితమైనదియె గుండియకు మున్నంగి వేణు గోపాల! 78

విన్నాము నినుఁ గూర్చి లక్షమారులు వేణు గోపాల
విన్నది. విన్నట్లు గాక కన్నట్లు వెలయింతు వీవు
నిన్నుగన్నది లేదు సుంత యిది సుమీ నీ దొంగతనము
వెన్నయుఁ బెరుగును గాదు మున్నంగి వేణు గోపాల! 79

ఇది తోవ యని చెప్పి దారి మెలిక లవెల్లను చెప్ప
నది గమ్య మనుకొంట కన్న నవివేకమని వేర కలదె
పదిబార లేగి గమ్యస్థల ప్రాప్తి పగిది నాడెదరు
బెదరి నిదుర మసలుగతి మున్నంగి వేణుగోపాల! 80

నగము ముప్పావును కించి దూరంబు సాధించి నట్టి
నిగమాంత వేత్తలు స్వీయ పథము వర్ణించిన దెల్ల
తగవారి యనుభూతి, పెఱల కది యొక్క తగనట్టి భ్రాంతి
సెగల నీయని నిద్ర త్రోవ మున్నంగి వేణు గోపాల! 81

ప్రకటమౌ నీ నిద్రలోన నొక సుఖ స్వప్నంబు వచ్చి
యొక కాళిదాసు కావ్యంబు వోలెనో యొక త్యాగరాజ
సుకృతి కృతిం బోలెనో తదా భ్రాంతి స్ఫురియించుచుండు
వికృతి విశ్రుతి కాని యట్లు మున్నంగి వేణు గోపాల! 82

అల తటాకములకు నొక్కచో సాగ రాభిధల్ కలిమి
వలె నొక్కఁ డొక్కడు మధ్యమధ్య గోపాల! తా నీవె
యిలకు వచ్చితి నంచు నాడు నిద్రలో నెవ్వడో సడక
వెలయించుకొను వ్యాధివోలె మున్నంగి వేణుగోపాల! 83

ఇన్ని విధాలుగా నిమర కవధి లేనే లేద యనగ
తిన్నగ మేల్కొనువేళ కేదియో తెచ్చి పెట్టెదవు
మిన్నును మన్నును గలిపి పాలించు మేలు చూపెదవు
పిన్నగాఁ దోచు జాగ్రత్త మున్నంగి వేణు గోపాల! 84

అర నిద్ర పావు నిద్రలుగ మేలుకో కయ్య నా స్వామి
తెఱచిన కనులుగా మత్తు వదలిన దేహంబుగాగ
వరలిన జాగ్రత్త వడగ విప్పిన పాముగా నెల్ల
వెఱపఱి మేలుకోవయ్య మున్నంగి వేణుగోపాల! 85

తలమీది సెమ్మి పింఛియము సురగంగ తరగల తనుకు
కలితమా పిల్లనగ్రోవి పేడిన ఖట్వాంగ శకలి
గళమందు రత్నహారములు పాఁకెడు గండు సర్పములు
విలసిల్ల మేలుకోవయ్య మున్నంగి వేణుగోపాల! 86

నీవు మేల్కొన బోవుచుంటి వన్న చిన్నెలు చాల కలవు
నీ వెంత దొంగవో చెప్పలేన చిన్నెలు మానివేసి
నీవు మాగు నిదురకుం బడను వచ్చు నిప్పుడు నెత్రి
వీవగా గిల్లగా వలయు మున్నంగి వేణు గోపాల! 87

వెడ కల్లు త్రావుచు నడి సముద్రాల వెడ మాట నేర్చి
వడి సోమరసముపైఁ బ్రాఁత చదువులపైఁ బగఁగొన్న
బడుగు రక్కసి తేనిచేవ మొగ మోడపై నేగి తునిమి
విడిపించి తంకిలి త్రియికి మున్నంగి వేణు గోపాల! 88

తమ తమ సాహిత్యములయా నుత్తమత్వములు చర్చించు
నమరుల నమరారులయును జర్చా సభాధ్యక్ష్య మూని
యమరంగ వీవున యందు నమృత మన్నట్టి రసంబు
విమలంబు నిర్ణయించితివి మున్నంగి వేణుగోపాల! 89

చెప్పగా రానంత ధనము గుట్టలుచేర్చి దేశాల
కప్పాలప్పాలు వెట్టి చావ చుట్టగా నవని ధరించి
యప్పలు గాక వనాళిఁ దిరిగెడు నసురను వంది
విప్పిన కోఱగాఁ దునిమి మున్నంగి వేణు గోపాల! 90

అనుభవించడు, భార్య కీయ డాత్మజు డన్నది కాదు,
ధనము బింబెలు నిండ నింపి సైన్యముల్ దండయాత్రిలును
మనిసి కాడు పశువు కాడు తన సభామంటప స్తంభ
వినిపాత మయ్యె నృసింహా మున్నంగి వేణు గోపాల! 91

పర లోకములు లేవు సంఘ మర్యాద పాటింపె కలదు
ధరణి మానవ సేవ మించి ధర్మమ్ము దైవమ్ము లేదు
మఱుగుజ్జువా డేమి బాగుపడు నేల మట్టమై పోయి
విరచిత వామనాకార! మున్నంగి వేణుగోపాల! 92

ఇట్టి కా నధికార మున్నదంచు నే యితరుల సొమ్ము
లట్టి కోరిక మాత్రి వచ్చి పడవలె న్యాయమ్ము లేదు
మిట్టిపాటున కంతువంతు లేదాయె మీఁది గొడ్డంటి
పెట్టుగాఁ దుంచెదు వాని మున్నంగి వేణు గోపాల! 93

పది విధాలుగ వెఱ్ఱి తలలు వేసియధర్మంబు పెరుగ
పొదివి పుచ్చిసమేర చెక్కి సరిచేసి భూభాగమెల్ల
నదుపులోనికి తెచ్చినావు మానవంబైన ధర్మంబు
విదితంబుగా రఘువీర మున్నంగి వేణుగోపాల! 94

పని తౌమథ క్రియా, సుష్టు; వివిమయ, వ్యవహార భూమి
ఖన నాత్త ధనరాశి, యుద్ధ పరిహార ఘటన, దుష్ప్రాపి
జన సంఖ్య పెరుగగా సాధు హాలవృత్తి చండావావముల
తెనిచి తుంచితి భూమి ప్రజల మున్నంగి వేణుగోపాల! 95

ఆస్తికత్వము నాస్తికత్వము భయమ్ము నది యుష్మదీయ
మెత్త! నాస్తికత యొక్కప్డు నీ వేలొ హెచ్చరించెదవు
నిస్తులంబుగ నంత హెచ్చరించవు నీవు సిద్ధార్థ
విస్తుపోవుచునుంటి మేము మున్నంగి వేణు గోపాల! 96

ఎప్పుడో యొకనాడు నీవు గుఱ్ఱమ్ము నెక్కి వచ్చెదవు
నప్పు! చేతను గత్తి బూని యపుడు మా యాయుధ శ్రేణి
చప్పవడి మహాణువవ్ము లన్నియుఁ జల్లనౌ నేమి
విప్పి చెప్పగదయ్య సామి మున్నంగి వేణుగోపాల! 97

మేలుకో నా స్వామి క్రిందినుంచి యా మీఁదికి నీ ను
ధా లాస్యశైవాలి నీ కథం జెప్పెదను కృష్ణదేవ
కాలి వ్రేలాడింపఁ బందుకొన నాడు కాంతార వీధి
వ్రేలఁ గొట్టెఁ గిరాత రాజు మున్నంగి వేణు గోపాల! 98

ఆనాడు నీ రాక నరసినంత బ్రహ్మానందమయ్యె
మానాథ! వైకుంఠ నగరి లోన బ్రహ్మర్షి సంతతికి
మానసం బున్నచో నుంత వెన్కకు మరలి కన్గొనుము
వేణువు శరమయ్యెఁ గాల మున్నంగి వేణు గోపాల! 99

దారుమయ ప్రబంధమ్ము సర్వమ్ము ద్వారకా నాథ!
దారుక సారథి! నాటి యుష్మత్కథా వీధి యెల్ల
దారు విచిత్ర గర్భమ్ము సాంబుండు తాల్చె యా త్రెల్లు
వీర విహారమ్ము సాగె మున్నంగి వేణుగోపాల! 100

ఓయి ఫల్గున సారథీ! మహోగ్ర యుద్ధోర్వి లోనఁ క
శాయుత పాణివి దారు వది కాదె చక్రాయుధా! ప్ర
థా యోగ్య మగు సుదర్శనము నడ్డయు దారువా యేమి
వేయి యంచుల కైదు వయ్యు మున్నంగి వేణుగోపాల! 101

శౌర! నీ శృంగార రసమయం బన్న యౌవనం బెల్ల
పారిజాత కథాశ్రయమ్ము దారువు పారిజాతమ్ము
దారు వనీ కథ జ్ఞాపకం బున్నదా జగన్నాథ!
వేరు చేయకుమయ్య నన్ను మున్నంగి వేణు గోపాల! 102

పుట్టినప్పుడె నిన్నుఁ గొయ్యపెట్టెలోఁ బూంచి మీ యయ్య
గట్టెక్కఁ గాళిందిఁ జేరి యా రాత్రి కంసుని మొఱఁగి
అట్టె నైదేడులు వచ్చెనో లేదొ యంతలోఁ బెదవి
పెట్టితి వీ కొయ్యమాక్కు మున్నంగి వేణు గోపాల! 103

ఇద్ది యెందుకు చెప్పఁచుంటి నన దారు వేను నటంచు
సుద్ది కల్పించి చెప్పఁటకు బెజ్జాలు చూడుము, వట్టి
మొద్దుబారుట చూడు. ఇంత యూపిరి పోసిన నాడు
విద్దియల్ చూడుము, కృష్ణ! మున్నంగి వేణుగోపాల! 104

ఇహ గత వైయర్థ్య మెంత తెలిసిన నేమి, కోరికలు
సహజమై నల్లు కన్పడెడుఁ బరిహరించగ నెప్డు వలసి
ముహు రర్పితమ్ము నీ ముగ్ధ మోహనమూర్తి; ఫాలమున
విహరించదాయె నో కృష్ణ మున్నంగి వేణు గోపాల! 105

జన్మ లింకెన్ని నాచేత నెత్తింప సంకల్పమయ్యా
జన్మ లెన్నైన నాకేమి వైరాగ్య సంపదతోడ
మన్మనో విహరణ మీవు వదలకు మదన గోపాల! \
విన్ము నా యీ మాట యొకటి మున్నంగి వేణుగోపాల! 106

శివునకు నీకును నేను భేదమ్ము సేయన యేని
నవురుగా మీ రిద్ద ఱొక్కఁడే బ్రహ్మ చైతన్య మేని
అవుర! వేదాంతముల్ నిజము లేని, న న్నది పొందుఁగాక
వివరమ్ము తెలిసిన నన్ను మున్నంగి వేణుగోపాల! 107

శ్రీ పయోధర సిక్త పులక సస్యకాద్రి క్షేత్రపాల!
దీపి తాధ్యాత్మిక వృత్తి సుర లతా దీప్తాలవాల!
సౌపర్వ నిర్ఝరిణీ ప్రసన్నాంబు జని పాద మూల!
ధీ పరివాహ నిర్మల మున్నంగి వేణు గోపాల! 108

# విశ్వనాథ మధ్యాక్కఱలు

## వేములవాడ శతకము

శ్రీ కాంతి కంధరా కలిత నీహార పృథ్వీ భృత్కన్య
కా కోమలారుణ చ్ఛవి భుజాజాత కాశ్మీర వర్ణ
నీ కాశ ముక్తి కాంతా దృగంత కాంతి పరిపాలితమ
హీ కామి! వేములవాడ రాజరాజేశ్వరా! స్వామి! 1

చన్నదినాల మత్స్యేంద్రి యోగి యా సారంగధరుని
కన్నులు' కాళ్ళు చేతులును వెలచి, నీ కన్న దైవంబు
మిన్నున లేడనిపించె, నేమి సామివి యెట్లు నిన్ను
నెన్నుట వేములవాడ రాజజేశర్వారా! స్వామి! 2

దక్క నే నెక్కడ మఱియు నీ వెక్కడ మహాకపతాక
దక్క నీవిక్కడ మఱియు నీవిక్కడ శిరోధునీక
ఒక్క యోగమ్మొదో నీ చరణ సన్నిహిత ధాత్రి భాగ
మెక్కితి వేములవాడ రాజరాజేశ్వరా! స్వామి! 3

ఒక్క రెండేండ్లకు మున్ను నే వచ్చి యుల్లోల మధుర
చిక్కణ మందాకి నీ నవోక్షిమ! సేవించినాడ
నిక్కడ నిన్నుఁ, దత్ప్రేమచేత నీ విచ్చోటు నన్ను
నెక్కింప వేములవాడ రాజరాజేశ్వరా! స్వామి! 4

ఒక్కభిషేకాని కుబ్బి తబ్బిబ్బు లూఁగిస లేమి
మిక్కిలి యల్ప సంతోషివైన సామివి! యట్లు కాక
యెక్కడి కక్కడే నీవు జమ కట్టెదేమొ, కాదు కృప
కిక్కవు వేములవాడ రాజరాజేశ్వరా! స్వామి! 5

ఒక దేశ మొక గాలి యొక చెఱువు నీరు నొక్క భోగమ్ము
నకు మక్కువై తదుపాధి గతము సాంద్ర మహాన్ను జీవు
నకు నెక్కువైనంత నష్టమేమి నానా జీవసార
మెకదొట్టి వేములవాడ రాజరాజేశ్వరా! స్వామి! 6

ముక్కు మొగంబును లేనివాఁడవు భూ జనుల్ నీకు
ముక్కు మొగంబును నెఱుఁగరనుటలో మోసంబు లేదు
చెక్కించుకొన్నైనఁ జేయువును స్వతస్సిద్ధుఁడ వీవ
దెక్కడ వేములవాడ రాజరాజేశ్వరా! స్వామి! 7

అంతటి నునుపు లింగోపరి ప్రదేశమం దఁటునంట
దింతకు లోవలి డొక్క లోపల నీ నా ప్రాదుగ?
చింతిత మధ్యాక్కఱలను గాని వ్రాసికొనంగ నీవె
యింతగా వేములవాడ రాజరాజేశ్వరా! స్వామి! 8

నాయంత యచ్ఛమా మనసుతోడ నిస్త్రమ్ముగాఁ జోవ
రే యెడ నెందఱే తీవ్ర బుద్ధిరో యే యోగ సిద్ధి
ణో యే జగత్ప్రభావాభి వృద్ధిణో యుపసదింతురు మ
హీయాంస! వేములవాడ రాజరాజేశ్వరా! స్వామి! 9

ఈ గాలి యీ మేనిలోన నేరీతి నెన్నాళ్ళవరకు
నూగించుచుండువో దాని యేర్పాటు నొక్కింత యెఱుగ
నే గంధవాహుడు నెన్ని జన్మల యే గంధ వాహు
డేగునో వేములవాడ రాజరాజేశ్వరా! స్వామి! 10

ఒక్క కవిత్వమ్ము తీసివేసిన నో స్వామి! నాదు
చిక్కరి బిక్కరిగాగ నైనట్టి జీవితం బేమి
యెక్కడ బాతాళమంత లోఁతు, దానిది యున్న మెరక
యెక్కడ, వేములవాడ రాజరాజేశ్వరా! స్వామి! 11

మొగి నా చరిత్రమ్మునకు ప్రభూ! నిప్పు ముట్టించ వలయు
నెగిచి సగానికి సగము తక్కిన దేమొ చిట్టడవి
నగి రేగుపండ్లకు పుల్లరేగుపండ్లకు జనపదము
తెగబడ వేములవాడ రాజరాజేశ్వరా! స్వామి! 12

పచరించి మింటిలో లేఁత యెండలు పండు వెన్నెలలు
విచరింతు వంతియె గాని నాదు జీవిత మూపరమ్ము
రుచిలేని కూరలోనైన గాని తిరుగ మూతవేతు
రెచటను వేములవాడ రాజరాజేశ్వరా! స్వామి! 13

మనుజుల జగమందలి ప్రతిభా విడంబన మెంత చేయు
మనుజు లంతశ్శక్తుల ప్రతిభా విడంబన రేఖ ముందు
మనుజు లల్పపు యోగ శక్తులను నీకె మసి పూయుచుందు
రినదృశా! వేములవాడ రాజరాజేశ్వరా! స్వామి! 14

ఎంత లింగమ్మైన నంతలింగ మందే సర్వజీవ
సంతాన సారమ్ము నెల్ల నిమిడింపఁ జాలెదు వినయ
వంతుఁడ వీవును గుర్తి గవ్వంత ప్రతిఫలముఁ బట్టి
మింతయు వేములవాడ రాజరాజేశ్వరా! స్వామి! 15

ఇంత నిరర్థక జీవితమునకై యెంతయోశ్రద్ధ
అంత సార్థకమైన నీదు భావనయందు నశ్రద్ధ
వింతయా నీ సృష్టి లక్షణమ్మిది వెసదోషమెవరి
దింతకు వేములవాడ రాజరాజేశ్వరా! స్వామి! 16

నీవెల్ల జనముల హృదయములయందు నెగడెదవేని
నీ విరోధంబు పాటింతు రేలొకో నేలపై జనులు
నీవేమి లేవని తమరె యున్నారనియు నేమొ చావ
నీ వారి వేములవాడ రాజరాజేశ్వరా! స్వామి! 17

కృతయుగమతిఁ దాటి పట్టకెదురు దేకెదు వాఁడ నేను
పతివి కాలస్వరూపుఁడవు నేటి కర్మాచీనుఁ డీవు
దుర్తమతి సొంత బిడ్డలను దింపి లోఁతులు చూచు పితవు
బుతమహా! వేములవాడ రాజరాజేశ్వరా! స్వామి! .8

ఒక పందమంచి యున్నయెడఁ దిరుగుచు నుండియు నేన
యొకఁడ నే తిరుగుచున్నట్లుగాఁ దోచుచున్నది నాకు
నొకఁడ నే యనిపించుచున్న దీవు నా యుల్లంబునందు
నొక దొట్టి వేములవాడ రాజరాజేశ్వరా! స్వామి! 19

కనఁద్రిపురమ్మయు నీవు పెనవేసికొంచుఁ జిందించు
కొనుచు నా చిత్తకుడ్యమున మీ నీడ కొనరించుకొంచుఁ
గననేను మీరు కానట్లు నైనట్లుగా మార్చి మార్చు
చిసదృశా! వేములవాడ రాజరాజేశ్వరా! స్వామి! 20

ఈమేను కర్పూరమట్లుగా హారియించి పోయెదును
స్వామి! నీకైన నీరాజనముగ నెచ్చని పొగ తావి
యేమాదిరానో నేను కలితీ లేని దెందుండె సరుకు
హేమాంగ! వేములవాడ రాజరాజేశ్వరా! స్వామి! 21

స్వామి! నాలో నన్ను నిన్నుగాఁ జూచి సవరించికొనెడు
నోము నోచక యున్న నిల్లై సతము కన్నులు కార్చికొంచు
నీమేను బరువుగా బ్రతికి నన్ను రానీవె నీ కడకు
హ్రీమూథు వేములవాడ రాజరాజేశ్వరా! స్వామి! 22

నీవు నాలోఁ బ్రవేశించుటకు నెంచనేవలెఁగాని
తోఁవ లెన్నున్నవి కనులలోనుండి భ్రూరేఖనుండి
రావచ్చు శతశతచ్ఛిద్రి మీా శరీరమ్ము నీ జాలి
యే వలె వేములవాడ రాజరాజేశ్వరా! స్వామి! 23

శ్రీగళా! నిను నేను మేఁక పెంటికో స్త్రీ పయోధరమొ
గాఁగ భావించునంత చెడిపోలేదు కైవల్య నాథ
కాఁగలవాఁడు నంత చెడిపోయినం గాని రాఁవాయె
నేగతి వేములవాడ రాజరాజేశ్వరా! స్వామి! 24

దగ్గుత్తికయును గన్నీళ్లు చూచి నే దక్కితి నీకు
నగ్గలమ్ముగ నని యెంచెద రమాయికాత్ములు, నాది
దుర్గాణి మనసు, శోభనపుఁ బెండ్లి కూఁతు విధాన గమిడి
కిగ్గెద వేములవాడ రాజరాజేశ్వరా! స్వామి! 25

అయ్యయ్యో చెడిపె నాదు మనసుపవి వాగై నను నయము
కయ్యాలు కోసెదు నెంతసేవును కామమ్ము దెసకె
దయ్యమ్మెదో దీనిఁ బట్టుకొన్నది తలఁగించు దీని
నియ్యెడ వేములవాడ రాజరాజేశ్వరా! స్వామి! 26

ముక్కుమూసికొనంగ మూఁడు గడియలు ముక్కుమూసికొని
పెక్కేండ్లు గడపితిఁ గాని నీ జాలి పిక్కంతరాదు
ఎక్కడి కెక్కడి మాట నీ జాలి యెచట నా ఛాలి
యెక్కడ వేములవాడ రాజరాజేశ్వరా! స్వామి! 27

ఒకదాని కొక్కటి లంగరందక యున్నది స్వామి
యకృత శశి జ్యోత్స్నయు నవకమ్మును నైన నీ వెల్గు
నకు, నెండలకు నెండి మోటు తేరిన నాధిమణం, కల
యిక కల్గ వేములవాడ రాజరాజేశ్వరా! స్వామి! 28

నీ తోవ యిదియేమొ దగ్గరనుకొని నీ వెంటబడితి
రాత్రిగాఁ గొఱవి దయ్యాలు కలవన్న రావడియెఱుఁగ
నీ త్రియామా వేళ దాఁట నవుడు దవ్వెంత? జీవిత వ
హిత్రిక! వేములవాడ రాజరాజేశ్వరా! స్వామి! 29

ఉన్నది యున్నదన్నంత మాత్రాన నొక తృప్తి లేక
కొన్నింటిఁ గలిపించుకొంచుఁ గలిపించుకొన్న వస్తువులు
మన్నిక లేక యతృప్తిచే నుత్రిక్కి మరలఁ దొర్లిటిద
యెన్నుచు వేములవాడ రాజరాజేశ్వరా! స్వామి! 30

చెప్పగా రానంత ప్రేమ యున్నది చేసెడిదేమి
అప్ప! ప్రాణా లీయవచ్చుఁ బట్టరానంతకుఁ, బ్రాణ
మెప్పుడో తన దారిఁ దాను పోయెడిదే నాయె, వ్యర్థ
మిప్పాటు వేములవాడ రాజరాజేశ్వరా! స్వామి! 31

కనిపించునదియెల్ల నిక్కువంబుగాఁ గనిపించనట్టు
లనిపించుచున్నది స్వామినాథ! నీ దైనట్టి కరుణ
విసిపించునది యెల్ల వినుచునుంటిని వినిపించనట్టు
లెనిపించు వేములవాడ రాజరాజేశ్వరా! స్వామి! 32

మధ్యాక్కఆలకును నీకు నాకు సంబంధంబు బలిసి
మధ్యాక్కఆలు, నేను వేఱ పనిమీఁద మానివేసినను
నీధ్యానమేమయ్యె నేమి యయ్యెద నేను కృపణామ
హీధ్యేయ! వేములవాడ రాజరాజేశ్వరా! స్వామి! 33

ఆప్పుడచ్చోటికిఁ బోవవలయున యాపైన నెటకో
అప్పటికాపని చేయవలయున యామీఁద నేదియొ
యెప్పు డిదే గోలయయ్యె విడుదల యీమహాబాధ
కెప్పుడు వేములవాడ రాజరాజేశ్వరా! స్వామి! 34

కడుఁబైన శిరసులోపల జటా జూట కాంతారవీథి
నడవి కాచిన వెన్నెలయ్యెఁ బ్రితి పదవ్యాచ్ఛ్రితి బ్రిముకు
అడుగున నడుగుల యందుఁ బ్రితి పదోద్వ్యాఖ్యయయ్యె
మృడ! నాకు వేములవాడ రాజరాజేశ్వరా! స్వామి! 35

కనులు మూసికొనంగ నేవో లేఁగాఁ కనిపించుచుండి
కనిపించుచున్నది యిదని యొక గుర్తు కలుగక యుండి
మనసులో నొక్క యానంద రేఖ సంపాదించుచుండె
నినదృశా! వేములవాడ రాజరాజేశ్వరా! స్వామి! 36

ఒక విధమైనట్టి మన్ను భూమిలోనుండి వేలేండ్లు
లోక శిలయో లోహమో యగు నటందురోయి నా దేహ
మొక విధమైనట్టి మన్ను నీలోన నుండి యిన్నేండ్లు
లిక యెప్డు వేములవాడ రాజరాజేశ్వరా! స్వామి! 37

శేఖరమయ్యె స్వామీ! సదా కోటి లింగాలలోన
మా బోడి లింగమ్ము చూచితే యన్న మాదిరిగాఁగ
నాబోటి వా రెంతమంది గరళ కంఠ! తుడిచికోకు
మీ బాడి వేములవాడ రాజరాజేశ్వరా! స్వామి! 38

ఒక్కప్డు నీవు నాలోన రాతివై యుండువు కదల
వొక్కప్డు చైతన్యమెల్ల నీవయై యుందువు స్వామి!
దక్కితిఁగాన నాడింతు నీకు చిత్తము వచ్చినట్లు
చిక్కితి వేములవాడ రాజరాజేశ్వరా! స్వామి! 39

త్రివ్విన కొలఁది సంసారమున మన్ను తట్టలకొలఁది
త్రివ్విన కొలది నీయందు జ్యోతిస్సిరమ్మ దాభముగ,
అవ్వల నేమున్న దింత వెన్నెల నైనచోఁ ద్రివ్వ
నివ్వల? వేములవాడ రాజరాజేశ్వరా! స్వామి! 40

వనములపై వట్టి బయలునందున భవనాలి మీఁద
నినుఁ బాడుకొంచును గగన వీధిని నేఁ బోవుచుండఁ
దనువు నాయది వచ్చి నన్ను మేల్కొల్పెఁ దరుణేందుమౌళి
యినదృశా! వేములవాడ రాజరాజేశ్వరా! స్వామి! 41

నియమితమైన ప్రాణముల లోపల నీ వుంటివంచు
నయమూర్తి! యిన్నినాళ్ళకును దెలిసెనయా! యుమానాథ!
నయ ముమాదేవి సత్కరుణ నాదు ప్రాణముల మేల్కొన్న
దియదార్తి వేములవాడ రాజరాజేశ్వరా! స్వామి! 42

ఒట్టుసుమీ ! పీడిపోకు పోదువేమో యన్నయూహ
పుట్టి గగ్గోలయిగుండె దుఃఖమ్ముపొంగి వచ్చెడిని
కట్టెడి నాబ్రతుకెంత భీతినిగల్గించఁ గలద
యిట్టిది వేములవాడ రాజరాజేశ్వరా! స్వామి! 43

ఇవ్వడు నీయూహ వచ్చు వచ్చు నదే యూహయే యొ
కవ్వడు దీనికిఁ గాని దానికిఁ గానినేఁగర్త
నెవ్వడు కాని కానాంతర స్థితుఁడవై యీవ తిరిప్పెదవ
యెవ్వడు వేములవాడ రాజరాజేశ్వరా! స్వామి! 44

చన నెంచినాడ నచ్చటికి వెళ్ళుట జరిగెనా! యటకుఁ
దనకుఁబో నిష్టములేదు వెళ్ళుట తప్పెనా! నీవ
యనుతు వంపవును జేయింతు చేయింప వంటఁ గట్టెద వ
యిన నాకు వేములవాడ రాజరాజేశ్వరా! స్వామి! 45

పరమేశ ననునేన నీవుగా లోన భావించుచుంటి
నరయఁ బినాకంబు మీఁద వ్రాలి నాదవు మెడ బుజము
లొరయుచు చిఱు గూను గాఁగ నీవుగా నుంటినో యేన
యెఱుగను వేములవాడ రాజరాజేశ్వరా! స్వామి! 46

హేలారసాకృతీ! భావనా పినాకీ! నిండియుండి
నాలోనఁ దోణికిసలాడుచున్నావు నా కన్నులందు
జాలు వారుచునుండి నేయి కొలిచిన చాయగాఁ గొత్త
హేలగా వేములవాడ రాజరాజేశ్వరా! స్వామి! 47

ఏమాత్ర చెదరినన్నైన బెసకిపోయెద నీవు నల్గు
రేమో మరేమో వచింతు రీవు నా యెద నిండియుండ
నీ మరియాద నీకన్న నెక్కువై యెనఁగెదు స్వామి
యేమందు వేములవాడ రాజరాజేశ్వరా! స్వామి! 48

ఈవదిగా నిదిగా దలంచుచు నెల్ల వేళలను
భావనావధిగను వెఱ్ఱి వెఱ్ఱిగా బ్రిమకుడైపోయె
ఈవన తేలాటి వెలుఁగవో నుంత యెఱుకకు రాద
యేవిధి వేములవాడ రాజరాజేశ్వరా! స్వామి! 49

నిద్దుర మేల్కొనుచుంటి వ్యవహార నియతిమై మనుచు
పొద్దు కుంకించుచునుంటి నిద్దుర పోవుచునుంటి
నుద్దవిడిఁ లోనఁ బురువు తొల్చుచు నున్నట్టులయ్యె
నెద్దడి వేములవాడ రాజరాజేశ్వరా! స్వామి! 50

మనసని లేనట్టి నిన్ను నను పేడ మనసెట్టు లొప్ప
నని యెట్లు చెప్పెదు సురల నను పేడి యరిగినా వందు
నను పేడి చని వారమైనదయ్యో నీనాటికి లెక్క
కెనిమిది వేములవాడ రాజరాజేశ్వరా! స్వామి! 51

పలునాళ్లు నాలోన నేను నిజముగా బ్రిదుకుచున్నట్టి
తలచుట లేదు, వెంబడిన లోక వృత్తమ్ము తప్పదును
ఒలయు వాయువు సాగుచుండు నాడకయుండుఁ గ్రొత్తమిం
యిలమీఁద వేములవాడ రాజరాజేశ్వరా! స్వామి! 52

బండిని లాగెడు నెద్దు కూడఁ గన్పడనట్టి గడ్డి
బండివోలిక నేను సాగుచుంటిని పై బర్వు నెవరి
తిండికో! యలవాటు కొలఁది లాగెదుఁ దెలియని కోర్కె
నొందుచు వేములవాడ రాజరాజేశ్వరా! స్వామి! 53

నచ్చినప్పుడు నేన నీవు, క్రింద నిల్వఁగ నీవు నన్ను
హెచ్చి మహైక్యంబుగాఁ జరింతువ యట, నేఁగి యేమి
పిచ్చియో యిటువైపు మరల మొగము చూపించవే అ
దెచ్చటో వేములవాడ రాజరాజేశ్వరా! స్వామి! 54

అది మనదా దానిఁ దానికోసమై యంగలార్చుటయు
అది మనదైన తర్వాతఁ గలుగు ధైర్యముచేత శక్తి
వదలుట లోకమం దున్నదే స్వామి పడసిన శాంతి
యెదఁగల్గి వేములవాడ రాజరాజేశ్వరా! స్వామి! 55

తెలిసి కామ పథాన జనుట జీవుని తెగని కర్మంబు
తెలిసి దుఃఖమ్ము పొందుటయె యేమందుఁ దెలివిలో నీవు
కలిసి వర్తించుట, యిదియును వివేక ఘటనాధ్వ మందు
నెలయింపు వేములవాడ రాజరాజేశ్వరా! స్వామి! 56

పరువమ్ము స్వప్నమ్ము మొదలు లైనవవస్థలు మృత్యు
వరయ నవస్థయే యైన, సహజమై యవి బాధ లేక
బొరసెడు నిది వచ్చినపుడు యమబాధ పుట్టించుఁ బ్రాణ
మెరియించు వేములవాడ రాజరాజేశ్వరా! స్వామి! 57

చిరిగిపోయిన పాతగుడ్డ వదలి, క్రొంజీర ధరించు
తెఱఁగున నైనచోఁ బూర్వ మున్నట్టి దేహంబు విడుట
చిరిగిన గుడ్డవైఁ బ్రేమ యుండదు చెప్పట యిద్ది
యెఱుకకై వేములవాడ రాజరాజేశ్వరా! స్వామి! 58

మరియును సత్ప్రసంగమ్ము విన్న నీ మహనీయ మూర్తి
దరిసెన మబ్బిన యట్టులుండుట, తక్కిన మాట
యరయ నీవయి దూరదూర మేగిన యట్లుంట, కరుణ
కిరవౌదో వేములవాడ రాజరాజేశ్వరా! స్వామి! 59

నీ కృప లేనప్పు డాపదగ్నికి నీళ్ళ విధానఁ
గైకోక కళవెళ లాడిపోయితిఁ గల్గి నీ కరుణ
చేకొని లోఁ గ్రాఁగి తరక కట్టుదు క్షీరమ్మువోలె
శ్రీకంఠ! వేములవాడ రాజరాజేశ్వరా! స్వామి! 60

మంగలంబునఁ బెట్టి నన్ను వేయించి మాడ్చుచున్నావ
యింగలంబునన యకాయకిఁగ పెట్ట నెవరు వద్దనిరి
ముంగలఁ బింగల దెసలఁ గ్రిందఁ బై ముట్టించు భస్మ
శృంగారి! వేములవాడ రాజరాజేశ్వరా! స్వామి! 61

కనుచున్న వినుచున్న దెల్లఁ దెలిసికోఁ గలుగుట లోనఁ
దనరారు నొక తెల్వి చేతనే గదా! తాఁ దెల్వి నేన
యనుకోనువలెఁ గాక తెల్వి నేను వేఱా! తెల్వి నీవ
యిన నేనో! వేములవాడ రాజరాజేశ్వరా! స్వామి! 62

నేనేమొ సర్వమ్ము నిన్నుఁ దెలిసికొనెడు వాఁడ మాత్రె.
మైనచోఁ దెలిసికోఁబడెడు లక్షణ మదియేది నీది
నేనేమొ జ్ఞాతను జ్ఞేయుఁడను నీకు జ్ఞేయత యొక్క
డేనచే వేములవాడ రాజరాజేశ్వరా! స్వామి! 63

ఆనంద మొక్కఁడే నీ స్వరూప మంచన దాని యాను
పానులు తెలియనైనవియె యనుభవింపను వలెఁగాక
కానీ తెలిసికొన్నఁగాని యనుభవ జ్ఞానంబు గలుగ
దే నాకు వేములవాడ రాజరాజేశ్వరా! స్వామి! 64

అనుభవించితిన నీవైన యానంద మవుదైనఁ గాని
యనుభవించెడి వాడ నేను వేఱు, వేఱగునె తానదియు
ననుభవమన్న శబ్దమ్ము నర్థమ్మునదుకునే వాని
నెనుపవే వేములవాడ రాజరాజేశ్వరా! స్వామి! 65

తెలిసికొంటకు నిన్నుఁ దొలుత నాలోనఁ దెలివి యుండవలె
తలఁపఁగా ననుభవించుటకు వలయు భూధాత్వర్థమైన
తొలి వస్తువది నేను కామి వీలులేదు, రహస్య మింత
యెలయింతు వేములవాడ రాజరాజేశ్వరా! స్వామి! 66

ఆనంద మనుభూతికైన దైనచో నది యందులోని
డానందమును, చెప్పి, యునికి మూడింట నమరుదు నేను
పూని యీ మూఁడింటి మించి యెవ్వఁడవో చెప్పు నీవ
యే నౌదు ,వేములవాడ రాజరాజేశ్వరా! స్వామి! 67

ఉన్న యీ సామాగ్రి నన్ను మించి నీ కున్నది యెంతో
యన్నచో ఓసి సముద్రమా! నేను నంథః కణమ్ము
నన్నాను మా దృశాంభఃకణ సహస్రి మంభోధి తత్త్వ
మెన్నిన వేములవాడ రాజరాజేశ్వరా! స్వామి! 68

పెను ఝంఝ కెరటమ్ము లేపి యొడ్డున విరిచెను నన్ను
వననిధిఁగాక పోయితిన అదికాక, పడియలోఁ బడితి
నిన కర స్పర్శచే మొగిలు వలె మింటికేగెద నిన్ను
నెనసెద వేములవాడ రాజరాజేశ్వరా! స్వామి! 69

అంత యనంతమై పెద్ద గాలులు నాడి తరంగ
సంతానకమ్ము వళత్క డిండీర సంతతి యెగసి
జంతు సంతానమ్ము కడుపులోపలఁ జరియించి స్వామి
వింతగా వేములవాడ రాజరాజేశ్వరా! స్వామి! 70

నీవుగాఁ బరమేశ్వరుఁడవు కావచ్చు నీవు శిక్షింతు
కావలులను, వారుగాని నినుఁ దిట్టకయు యెట్టులుందు
రీవుగా యింక శిక్షింతు తిట్టెద రింకను వార
లే విధి వేములవాడ రాజరాజేశ్వరా! స్వామి! 71

బుద్ధి రావలెనంచు నీవు వారికి, బుద్ధి వచ్చునటె
మద్ది మొద్దులకును నిప్పు ముట్టింప మండును గాక
మొద్దులు కానప్పు డంకురం బట్టు బుద్ధులు, నిప్పు
డెద్దులు వేములవాడ రాజరాజేశ్వరా! స్వామి! 72

ఊపిరి తీసికొం చూపిరిఁ విడుచో మహాదేవ
నీ పేరె యెడ తెగకుండఁ దలఁచుచుంటిని మహాదేవ
నీ పేరు తలచుచు నుంట చిత్తంబు నిలువలేదేని
యేపాటు వేములవాడ రాజరాజేశ్వరా! స్వామి! 73

ఒక తెల్ల గురివింద గింజవోలిక నున్న కాలాణు
వకట శత సహస్ర వృద్ధి నొంది సూర్యాచంద్ర మనుల
వికృతియై కాలమై నీవు దానిలో విరిసి గ్రీవేయ
నృకపాల వేములవాడ రాజరాజేశ్వరా! స్వామి! 74

అణువైన కాలమ్ము నాల్గు భాగాలుగా నచ్చమగా తెలుపు
పౌన, పావుగా నల్పు, సగముగా నల్పు ముప్పావు నల్పు
తనరగాఁ దొల్తటి ముక్క యచ్చ శ్వేతమ్ము నీ లింగ
మినదృశా! వేములవాడ రాజరాజేశ్వరా! స్వామి! 75

దానియంతట నది మృత్యు వరుదెంచు దాఁక నిట్లుండు
నే నిట్టు లుండుట నాకు నేమియు నిష్టము లేదు
నే నిట్టులుండుట నీదు దయలేని యెలయింపు గాఁగ
నే నెంతు వేములవాడ రాజరాజేశ్వరా! స్వామి! 76

చావు రానీయవు తొలఁగకుండ నిన్ స్మరియింపనీవు
భావి తోఁచగ నీవు, చిత్తమును నిలంబడ నీయనీవు
యీవు కాదంచును వేఱచోటేగనీయవు ముక్తి
హే వాక! వేములవాడ రాజరాజేశ్వరా! స్వామి! 77

గ్రహచారమును బట్టి రాకపోకలు కైకొను మేమి
గ్రహచార మది నీకు సంవిదాకార! కైవల్య నాథ!
విహరింపుమీ! నాదు నీకయిన చిత్త వీధిలో నెపుడు
నిహాదూర! వేములవాడ రాజరాజేశ్వరా! స్వామి! 78

అసలు యథార్థంబు తెలిసి బ్రదుకుట యమిత కష్టంబు
ముసరెడు మోహంబు బ్రదుకులోఁ దీసి ప్రట్టించు మోహ
విసరంబు వీడియు వాసనాశక్తి వీడని బ్రదుకు
లిసుక నీర్వో వేములవాడ రాజరాజేశ్వరా! స్వామి! 79

బ్రదుకుటయే యెంతో దినము దినము దుర్భరమయి పోయె
మఱి సుఖవాంఛ యెక్కడిది సుఖమన్న మాట కష్టమ్ప్ర
చ్యుతమయి శాంతి లేకున్కఁ బ్రాణ సంక్షోదమై మృతియె
హితమయి వేములవాడ రాజరాజేశ్వరా! స్వామి! 80

నిజముగా నాలోన నాకుఁ దెలిసిన నేనొక్కరుండ
నృజగతికి నెఱుంగ వెలయఁ జేసిన నేను వేఱొకఁడ
యజ! నిన్నుఁ బ్రార్థించు నేను వేఱు, మహాదేవ నేన
నృజుమూర్తి వేములవాడ రాజరాజేశ్వరా! స్వామి! 81

వానికి వానికే తెలియు వాడు సన్ప్రార్థించు రీతి
నేనేల పలుకగా వలయు నంచీవు నెద నెంచెదేని
పోనిమ్ము నావోలె నాటగానే ప్రభూ! రాఁగదయ్య
యేనోహ వేములవాడ రాజరాజేశ్వరా! స్వామి! 82

ఒదిగించి నా దెసకీవు మేరువు నొరిగించ వలద
యెనుగు కోరిక వెండికొండ కోస మే నేడ్చుచునుండ
నదిరయ్య దానికై యేడ్చినప్పటి కది లేద యిప్పు
డిది లేద వేములవాడ రాజరాజేశ్వరా! స్వామి! 83

నాణె మా చోట ముఖావ యవచాలనము లేని-చోట
ప్రాణమ్ము లాడని-చోట మనసెగఁ బ్రాఁకిన చోట
ద్రోణాభమైన సంవిద్భ్రమీ మూర్తితో రా, శిరో ధృ
తైణాంక! వేములవాడ రాజరాజేశ్వరా! స్వామి! 84

ఊహ మనస్సులో నెక్కడో పుట్టుచున్నది శబ్ద
మాహ్వృతంబై నాభియందు నుదయంబు నందుచున్నది పు
రోహితుండౌ నగ్నివీవ, యెడఁదఁ గూర్చుంటివో, వేహ
దీహేశ! వేములవాడ రాజరాజేశ్వరా! స్వామి! 85

స్మృతి యన్నది మనస్సు, మనసుతోఁ గూడి జీవుని యున్కి
స్మృతి లేదు నిద్దుర వేళ నప్పుడు జీవుండు లేడో
నతుఁడయి యొదిగి నీ యదుపులోన నున్నాడో జీవుండు
ఋతమహో! వేములవాడ రాజరాజేశ్వరా! స్వామి! 86

కుక్కయు మరి దాలి గుంటలోఁ బండుకొన్నంత సేపె
తక్కున లేచి తోఁక విదలించి వెంటనె దొడ్డిదారి
యెక్కడఁ గనిపించు నక్కడే దూరు జృంభస్మరాగ్ని
దృక్కేళి! వేములవాడ రాజరాజేశ్వరా! స్వామి! 87

ఎంతసేపటికిని చీఁకటుల్ గాఁగ నిది మూసికొనెడు
వింతలౌ వెల్గులు కానిపించఁగా విప్పికోద, యఘ
కృంత వికాస సుకృతి పరిమళ భక్తి ప్రథా సూన
వృంతమా! వేములవాడ రాజరాజేశ్వరా! స్వామి! 88

పదు నెక్కియాత్మహానుండొక్కరుఁడు నాత్మవంచకుండొకఁడు
మది నెంచఁ దొలివాఁడు నాస్తికుండును మలివాఁడ నేను
మొదటివాఁడె నయంబు నిజముగా నాకంటె మోసంబులేని
యెదవాఁడు వేములవాడ రాజరాజేశ్వరా! స్వామి! 89

కాసంత యుపయోగపడక పైనుండి కరసి పెత్తనము
చేసెడు వైఖరి మాని, వచ్చి నా చిత్తాన నిలుము
లో సాయపడునట్లు చూపి వెస గోతిలోన దింపకు! మ
హీసార! వేములవాడ రాజరాజేశ్వరా! స్వామి! 90

ఈ కోర్కి యుదయింపకుండ నుండుట యెప్పుడేఁ గలదె
యీ కామ వైయర్థ్య మెడఁద లోపల నింతగాఁ దెలిసి
యీ కాయము జఁబుచేత నచ్చుచో నిది తుది దగునె
శ్రీకంఠ! వేములవాడ రాజరాజేశ్వరా! స్వామి! 91

ఏ విధమ్మున జూచినను వృథామైనదీ సృష్టి తోచు
ఆవల నీవు లేవన్న నీ శూన్య మంగీకరింప
న్వలె నింత వైయర్థ్య మెందుకో యెందుకో దీని
కీ వేల వేములవాడ రాజరాజేశ్వరా! స్వామి! 92

నిను నూహ చేసెడు నంతసేపును నే నొక్క బుద్ధి
ఖనిని నీయూహ మానితిని నేను మూర్ఖ వతంసుఁడైతి
నను బాఁకుచుంటివి పరువవేదివి నవ్య చైతన్య
ఘృణి ఖనీ! వేములవాడ రాజరాజేశ్వరా! స్వామి! 93

ఎన్ని లక్షణములు నుండవలయునో యేదియు విడక
అన్ని లక్షణములు కలవు మరియు నింకన్నియు కలవు
నన్ను రక్షించుటే మగతనమ్ము చానసగమ్ము తనము
నన్నక వేములవాడ రాజరాజేశ్వరా! స్వామి! 94

ఇప్పటి కరువదియైదు వచ్చిన వేమనవలయు
నవ్వుడు పాతిక యేండ్లనాడు నీయందు నా మనసు
చొప్పెటులున్నదో యట్లె యున్న దీ చొప్పు నీ వేమి
చెప్పెదో వేములవాడ రాజరాజేశ్వరా! స్వామి! 95

కలుగఁ గ్రియా సన్నికర్ష హేతువై కాలమ్మునందు
నల భూత వర్తమానములు భావియు నట్లె నా చేత
తెలువు మాసెను నీకు స్వచ్ఛమైన జ్యోతిర్ఖాండమునకు
నెలయించి వేములవాడ రాజరాజేశ్వరా! స్వామి! 96

లోకమ్ములో నెన్నిముళ్లు కలవు నాలో నన్ని ముళ్ళు
నై కోహ సంజనకమ్ములై పొల్చు నవి యున్నయెడల
నీకును నాకు సంబంధ మధికమానే వీనిఁ జింపు
మీ కేళి వేములవాడ రాజరాజేశ్వరా! స్వామి! 97

నిన్ను భావించుచు విష్ణువనుకొందు, నీ వనుకొందు
వెన్ను నూహించుచు, నిద్దఱుంగాదు వెస భావమందు
నన్ను నేనే విముక్తునిగఁ దేజస్సనాథుగా బిట్టు
నెన్నుచు వేములవాడ రాజరాజేశ్వరా! స్వామి! 98

తన్నదా వొంగిలి డొంక తిరుగుళ్ళ తర్కముల్ బలిసి
నిన్ను గాదనివేఁడో రగడ పెంచుచు, నిన్ను గాదంచుఁ
గొన్నిన్నాళ్ల నేమైన మాళి మొలిపించుకొన్నాఁడొ మూర్ఖుఁ
డెన్నగా వేములవాడ రాజరాజేశ్వరా! స్వామి! 99

కాలమ్ము దెస వంగియున్న యట్లువంక శశాంకు వలన
వాలించుచుంటి వీ సర్వ సృష్టి దివా నిశల్ ధూర్జ
టీ! లేఁత జాబిల్లి మాళి మొలిపించు, డిందె కాలమ్ము
హేలగా వేములవాడ రాజరాజేశ్వరా! స్వామి! 100

శ్రీకాంతి కంధరా కలిక నీహార భూమి భృత్కన్య
కాకోమలారుణచ్ఛవి భుజాజాత కాశ్మీర వర్ణ
నీకాశ ముక్తికాంతా దృగంత కాంతి పరిపాలిత మ
హీకామి! వేములవాడ రాజరాజేశ్వరా! స్వామి! 101